# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

జనవరి 1979

సంపుటము : 56 సంచిక : 1

---

విడిపత్రిక వెల రూపాయిన్నర



కీ॥ శే॥ శివలెంక శంభుప్రసాద్‌గారు
సంపాదకుడు 1938 – 72

# స్వవిషయం

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ దేశం చరిత్రలో కొత్తదశ ఒకటి మొదలయినదని ఎందరో అనుకున్నారు. కొన్ని వందల సంవత్సరాలుగా కొన్ని రంగాలలో ఇక్కడ రావలిసిన మార్పులు రాకుండా ఉండిపోవటంతో భారతీయులు వెనుకపడిపోయారన్న అభిప్రాయానికి మంచిప్రాచుర్యం వచ్చిందంటే అతిశయోక్తికాదు. స్వాతంత్ర్యం తరువాత పరిపాలన భాధ్యతని స్వీకరించిన జాతీయ నాయకులు తమ దేశం వెనుకబడినతనాన్ని పోగొట్టుకొనటమే తమ ధ్యేయంగా పెట్టుకున్నారు. మహాత్మాగాంధీ అస్తమయం అనంతరం ఆయన బోధనలు కొన్ని ప్రచారంలో ఉన్నమాట నిజం. కొన్నిటికి ఆచరణలో సైతం ప్రాముఖ్యం ఉండిఉండవచ్చు. అయితే, అనుసరింపబడిన అభివృద్ధి పద్ధతులు, విధానాలు అధికారంలో ఉన్నవారి బలాన్ని విపరీతంగా పెంచుతున్నాయని కొందరు హెచ్చరిస్తూనే వచ్చారు. ఇటువంటి వారి హెచ్చరికలలో ఎంత నిజం ఉన్నదో 1975 జూన్ దాకా తెలియలేదు. ఆ నెలలో ఒక్కసారిగా కొత్తదిగాతోచే ఒక ధోరణి ప్రారంభించింది వేళ్ళు పాతుకోని పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకి భారత దేశంలో పెద్ద ముప్పే వచ్చిందనిపించింది. కాని, అత్యవసర పరిస్థితిగా వర్ణింపబడినది వచ్చినంత హటాత్తుగానే పోయింది. [ఈ హటాత్పరిణామంవలననే దేశంలో ఇంత అస్థిమిత పరిస్థితి ఏర్పడినదేమో నని అనిపిస్తూ ఉంటుంది.] ఎమర్జెన్సీ కాలంలోనే "భారతి" లో కొందరు తమ ఆవేదనని తెలుపుతూ పంపిన రచనలు పడటానికి అవకాశాలు లేకపోలేదు. అప్పటిలో నిర్బంధానికి గురి అయినవారి రచనలు కొన్ని ఇప్పుడు పడుతున్నాయి. వీటన్నిటిలోనూ ద్వేషం అన్నది కనిపించకపోవటం గమనించ తగిన విషయం జాతీయోద్యమం ఉజ్వలంగా కొనసాగుతున్న రోజులలో వెలువడిన రకం రచనలు నేటి వాతావరణంతో రావటం కష్టం అనిపిస్తుంది. సాంఘిక న్యాయం దృష్టితో దేశంలోని పరిస్థితులని చూసేవారి రచనలు కొంచెమయినా అధికంగా రావటానికి వీలుకల్పించే పరిస్థితులు నేడు పుష్కలంగా ఉన్నాయి. "సమాజం"లో వచ్చే మార్పులకి "సాహిత్యం" ఎంతో కొంత ప్రతిబింబంగా ఉండగలిగినట్లయితే వర్తమాన కాలంలో తక్కిన ప్రపంచం అంతటినీ నేరుగానో, పరోక్షంగానో ఆదర్శంగా స్వీకరింపబడుతున్న పాశ్చాత్య ప్రపంచంలో ఏర్పడిన పరిణామాలు, వెలువడిన సాహిత్యం — వీటిని గురించి రచనలు చేసేవారు ఆలోచించి చూడవచ్చు. వ్యక్తి స్వాతంత్ర్యాల విషయంలో ప్రథమస్థానంలోఉన్న పాశ్చాత్యదేశాలే ఆహారం, పరిశ్రమల విషయంలోనూ ప్రథమ స్థానంలో ఉన్నాయి. వ్యక్తిస్వాతంత్ర్యాలు ఆర్థికాభివృద్ధికిగాని, సాంఘిక న్యాయానికిగాని అడ్డంకులుగా ఉండగలవంటే నమ్మటం కష్టం. భారతదేశంలో ఇంకా నిర్బంధాలు లేని చర్చకి వీలు ఉంది గనుకనే ప్రపంచం అంతటా సృష్టింపబడుతున్న సాహిత్యాన్ని గురించి ఆలోచించి, మాట్లాడుకునే వీలు ఉంది. పాశ్చాత్య సంస్కృతిని ఇటీవల కొంతకాలంగా ఒక రకం నైరాశ్యం, సందేహం ఆవరించాయని చాలామందికే అనిపిస్తోంది. వీటి ప్రభావం ఇక్కడి సాహిత్యంమీద ఉండక తప్పదు కాని ఆ ఛాయలే ఇక్కడ సైతం అలుముకోవాలని లేదు. తెలుగులో రాసేవారిని ప్రభావింప చెయ్య గలిగినవన్నీ విదేశ సాహిత్యాలద్వారానే దిగుమతి కానక్కరలేదు మహాత్మగాంధికన్నా మార్పుకోరిన భారతీయుడు లేడు. ఆయన హింస లేకుండానే మార్పుని సాధించవచ్చునని బోధించి, ఆచరించి చూపించాడు. "సంస్కరణ విప్లవకారుని పాలిటి పెనుభూతం" అని ఈమధ్యనే జాన్ కెన్నెత్ గాల్‌బ్రెయిత్ అన్నాడు. తెలుగులో రాసేవారు తమ రచనలద్వారా ఎన్నో విధాలుగా మార్పులు తీసుకురాగలరు. [నియంతలు సాహిత్యాన్ని నిర్బంధంలో ఉంచటానికి ప్రయత్నించి సాహిత్యానికి గుర్తింపు ఇస్తారన్నది లోకసామాన్యం.] "సాహిత్యం" అన్న మాటకి ఎంతో విశాలమయిన అర్థం ఉన్నదని అందరికీ ఈ సందర్భాన్ని పురస్కరించుకుని మరొక సారి మనవి చేసుకుంటున్నాము. ఆధునిక ప్రపంచానికి సంబంధించిన విషయాలన్నిటిని గురించీ 'భారతి'కి తెలుగులో రచనలు రాగలవని మేము ఆశిస్తున్నాము.



# విషయానుక్రమణిక

## జనవరి 1979


| | | |
|---|---|---|
| శిలావిగ్రహం | డా. సి. నారాయణరెడ్డి | 5 |
| నిశ్శబ్ద సంగీతం | సంఘమిత్ర | 6 |
| జీవన సంధ్య | శ్రీ యర్రమిల్లి చలపతిరావు | 7 |
| గువ్వపిల్ల | శ్రీ పులికంటి కృష్ణారెడ్డి | 8 |
| ప్లేటో "రిపబ్లిక్" | శ్రీ వి. కృష్ణారావు | 9 |
| తెల్లని పక్షి | మల్లెల | 12 |
| బసవేశ్వరుని సంస్కరణలు<br>బసవనీతి వచనములు | శ్రీ రేకళిగె మఠము వీరయ్య | 13 |
| నీవు సూర్యునివోయ్ | శ్రీ సి. హెచ్. మధు | 15 |
| అర్వాచీన తూర్పు గాంగుల, సూర్య వంశ<br>గజపతుల రాజధానీ నగరములు | డా. సి. వి. రామచంద్రరావు | 16 |
| కవి — పక్షి | శ్రీ జి. రామశేషయ్య | 21 |
| సాహిత్య వీరుల గుండెలలో కొండలు | జమదగ్ని | 22 |
| రాతి | డా. తంగిరాల | 27 |
| ఆంధ్రదేశములో జైన మత ప్రవేశ<br>ప్రచారములు — ఒక పరిశీలన | శ్రీ జి. జవహర్‌లాల్ | 28 |
| పునరంకితమ్ | శ్రీ మధుర్‌జీ | 32 |
| వేళ్లు | శ్రీ సుమతీంద్ర నాడిగ్<br>అనువాదం: శ్రీ ఎన్. రమేశ్, శ్రీ దేశెట్టి కేశవరావ్ | 34 |
| రాళ్లపల్లి పీఠికలు — ఒక సమీక్ష | శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 37 |
| భావ విహంగాలు | శ్రీ పి నరసింహారెడ్డి | 42 |
| వయస్సు—శాస్త్రవేత్తల సృజనాత్మక కృషి | హాన్స్ క్రెబ్స్<br>అనువాదం : వి. ఎస్ అవధాని | 44 |
| తెరపై మరకలు | శ్రీ కలువకొలను సదానంద | 48 |
| ఆంధ్ర విశ్వ కళా పరిషన్ముద్రణం<br>"తెలుగు వ్యుత్పత్తి కోశం" | శ్రీ నిడుదవోలు వేంకటరావు | 49 |
| ప్రతిబింబాలు | శ్రీ గడియారం శేషఫణి శర్మ | 55 |
| విద్య — ఆర్థికాభివృద్ధి | శ్రీ కె. యస్. చలమ్ | 56 |
| కలగూరగంప | | 62 |
| గ్రంథ విమర్శలు | | 72 |




# శిలా విగ్రహం

## డా॥ సి. నారాయణరెడ్డి

వెళ్లిపో ఓ జీవితమా !
వెల్లువ దూకే నా అడుగుల్లోంచి.
వెన్నుపూసను చీల్చుకొస్తున్న
విక్రాంతి అరుపుల్లోంచి.

నీ వుంటున్న ఆ చోటు
నిట్టూర్పుల ఊబిమడుగు.
నిన్ను భుజాన వేసుకున్న కోటు
నీలి చిల్లుల పాత గొడుగు.

నా పరుగువేరు; అది
నయాగరాకు పెదబాల శిక్ష.
నా పలుకు వేరు; అది
మెదళ్ల గంజాయిని విదిలించే స్వేచ్ఛ.

నీకూ నాకూ రాజీ కుదరదు
నీటికీ నెత్తుటికీ కుదరనట్టు.
ఎప్పుడు మనది తెగని తేడా
ఏటికీ గట్టుకూ ఉన్నట్టు.

ఏదో నువ్వు తిరగేస్తుంటావు
ఇద్దరం మిణుగురెత్తిన ఆదిని.
నేనో ఊదివేస్తుంటాను
నేటి నిప్పుల మీద బూదిని.

సెలవు తీసుకుందామా గతానికి
శిలా విగ్రహం వినిర్మించి;
మళ్లీ కలుసుకుందామా రేపటికి
మరో చైతన్యంతో ఉదయించి.



# నిశ్శబ్ద సంగీతం

## సంఘమిత్ర

చిత్ర విచిత్ర శిల్ప చాతుర్యంతో
భాసించే
నీ యీ అద్భుత సామ్రాజ్య సౌధానికి
వారసుడిగా నన్ను నిర్ణయించి, పట్టంగట్టి
నీ కొలువు కూటంలో సామంతుడిగా
నాకో ఉచిత స్థాన మిచ్చి గౌరవించావు.
అత్యున్నతమైన పితృ వాత్సల్యాన్ని
నీ యీ అపూర్వ కానుకతో
ప్రకటించు కున్నావు.

దురదృష్టం !
తనయుడిగా నా కర్తవ్యాన్ని
నిర్వర్తించు కోలేక పోతున్నాను.
నీ నుండే రూపు దిద్దుకున్న నేను
నీ ఉనికినే పూర్తిగా మరచి పోయేంతగా
పతన మయ్యాను.
విషాదంలోనో, వినోదంలోనో
నీ యీ పిచ్చి పాటల్ని పాడుకుంటానే తప్ప —

నా హృదయ కవాటములు తెరచి
మనస్ఫూర్తిగా నిన్నాహ్వానించి
నా మనోప్రాంగణమున నీకో ఉన్నతాసనమును వేసి,
నిన్ను గౌరవించుకోలేక పోతున్నాను.

నిరంతరం ప్రవహించే నీ దయా ప్రవాహం
నా గుండెల్ని చీల్చి, నా ప్రాణాల్ని పీల్చి
తనలో కలుపు కుంటే ఎంత బాగుండును.

నా తలపై ప్రేమగా
నీ కుసుమ కోమల హస్తాలలంకరించిన
మణి కిరీటపు మనోహర మయూఖులు
నా కళ్ళల్లో ప్రతి ఫలించి

నా సామర్థ్యంపై అంతులేని విశ్వాసాన్ని,
నా అదృష్టంపై అర్థంలేని మమకారాన్ని
పెంచు తున్నాయి.
నువ్వు సహృదయ తతో ప్రసాదించిన హృదయం,
రెండుగా చీలి,
విరుద్ధ స్వభావాల నుద్ధరిస్తున్నది
నీవు ప్రసాదించిన శక్తి, విచిత్ర శక్తుల్ని
సృజించి,

వినాశన విధానాల నన్వేషిస్తోంది.
గతంలో నీవు ప్రసరింప జేసిన
జ్ఞాన కుసుమ పరిమళ లహరులు
నా నుండి క్రమంగా తప్పుకుని
నీలో కల్సిపోతున్నాయి.

నా యీ ప్రయాణ మార్గం నీ మందిరానికి
చేర్చ లేదని,
మేధస్సు నిరంతరం ఘోషిస్తున్నా
"ఇక్కడే యెక్కడో పసిడి మెట్లున్నాయి
అలసిపోతావేం, అన్వేషించు" అంటోంది
హృదయం.

నీ చిరునవ్వుల వెలుగురేఖలకు ఎదురుగా
ఏనాటికైనా చేరుతానన్న ఆత్మవిశ్వాసంతో
మార్గాలను మారుస్తూ

నిరంతరం నీ అడుగు జాడలకోసం
అన్వేషిస్తూనే వుంటాను.



# జీవనసంధ్య

## శ్రీ యఱ్ఱమిల్లి చలపతిరావు

మసక చీకట్లు ముసురు కొంటున్న ఈ మునిమాపువేళలో
ఎక్కడో దూరాన ఒక మేఘం ఉరిమినట్లు
ఒకతటిల్లత మెరిసినట్లు
ఒక భ్రాంతి ! ఒక క్రాంతి!
నా జీవన ప్రాంగణంలో ఏనాడో నాటి
పెంచుకుంటున్న చెంగల్వలు
ఒక్కొక్క మొగ్గ విచ్చుకుంటున్నాయి.
ఒక్కొక్క పూవుగా రూపు దిద్దుకొంటున్నాయి.
శిథిలశిశిరం నిష్క్రమిస్తోంది.
నవవసంతం రానున్నదనేమో ?
నవ్వుతున్నాయి నా ఎదలో హాయిగా
పరిమళిస్తున్నాయి ఒక నవ సౌరభాన్ని తీయగా.
ఈజీవన సంధ్యారాగంలో, మధురస్మృతులుచేసే మందహాసం
అరవిచ్చిన పారిజాతాలు వెదజల్లే తీయని హాసంలా,
సుహాసినీ స్నిగ్ధ కపోలంలా
శాంతికపోతంలా
అలా, అలా, నా గుండెలో జాలిగా
మధురానుభూతుల్ని నింపుతూ
జాలువారుతున్నది, దూరమౌతున్నది.
ఈ జీవన సంధ్యారాగంలో
నిశ్శబ్దం ఘనీభవించింది.
ఈ జీవుని ప్రస్థానంతో
ఒక జీవనరాగం అస్తమిస్తుంది.
రానున్నది అసుర సంధ్య
ఇక అస్తమించు జీవన సంధ్య.
ప్రకృతినిండా పరచుకొంటున్న ఈ కెంజాయల యొక్క
పుంజీభూతమైన ఈ సంధ్యా జ్యోత్స్నలో,
విరుస్తున్నాయి మెల్లమెల్లగా గతస్మృతుల విరులు.
కురుస్తున్నాయి వర్షపు జల్లులా గతస్మృతుల ఇరులు.
జీవనగాథా స్రవంతిలో ఒకనావలా
తేలిపోతున్న ఈ జీవుని హృదిలో
మాయని బాధామయ గాథల అరుణారుణ రక్తిమలో
ఈజీవన సంధ్యా స్వప్నపు గతమంతా ఒక కలలా
ఒక అలలా! అలా! అలా!
కరగిపోతున్నది. విరిగిపోతున్నది.
శరన్మేఘమాలికలా! శీర్ణమేఖలలా !
జిగికాంతులజిగీషల్లో, ఈ జీవన సంధ్యారాగం
జగన్మోహనమై, ఒక రంగుల వెన్నెలలా
ప్రతి అణువునూ ప్రభావితం చేస్తూ
ఒక అందమైన ఇంద్రచాపంలా
ఒక చల్లని చంద్ర కిరణంలా
ప్రకాశిస్తోంది! ప్రగల్భిస్తోంది !
అరుణారుణ కాంతుల్ని మ్రింగడానికి కాబోలు
అల్లదిగో ఒక ధూమకేతువు అప్పుడే బయల్దేరింది
తన సుదీర్ఘ బాహువుల్ని విశ్వాంతరాళంలోకి చాచుకుంటూ
తల విరియబోసికొని అంగలార్చుకుంటూ,
ఆయాస పడుతూ, అడుగులు వేస్తూ,
నిశ్శబ్దంగా, నింగినంతా,
ఆవరిస్తున్నది! అవతరిస్తున్నది దివినుండి భువికి.
భయంగొల్పే ఒక జీమూత సేతువు.
ఒక ధూమకేతువు.
అలముకొంటున్న ఈ పెను చీకటి కవ్వలి లోకంలో
ఏమున్నదో ఎవరికి తెలుసు ? మిత్రమా!
కాని,
మసక చీకట్లు ముసురుకొంటున్న ఈ మునిమాపువేళలో
ఈ అస్తమయ సంధ్యలో నామవస్సులో మాత్రం
మధురస్మృతుల మల్లెలు విరుస్తున్నాయి.
మధుర భావాల సన్నజాజులు పరిమళిస్తున్నాయి.
ఈ సుదీర్ఘ జీవనయామినిలో ఒంటరిగా
నేను పయనించవలసిన అనంతయాత్రా పథంలో
నా వెంట వీటినే నేను తీసుకొని పోగోరుతున్నాను
నా జంటగా వాటినే నేను కోరుకొంటున్నాను.



# గువ్వ పిల్ల

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

కాలం

నిర్విరామంగా నిగ్గదీస్తూంటే
నిరాటంకముగా సాగిపోతున్న తంతి కమ్మి !
కాల పరిభ్రమణకు కట్టుబడిన లోకంలో

నేను —
రెక్కలు ముక్కలు చేసుకొంటూ
నిలిచిన చోట నిలువనంటూ
నిరంతరము శ్రమిస్తూ

జానెడు పొట్టకోసం మూనెడు వేషాలు వేస్తూ
అలుపు సొలుపు ఎరుగని గువ్వపిల్లను !
కాలమనే తంతి కమ్మిమీద
కడుపు కోసమని రెక్కలు విప్పి కూర్చున్న గువ్వపిల్లను !! —

ఆ తంతి కమ్మిలో
నీళ్ళ వాటంగా, నిరాఘాటంగా, నిరంతరమూ
సాగిపోతున్నాయి సవాలక్ష వార్తలు —
ఎందరెందరో దీనికి కర్తలు !

ఏడుకొండలవాని దర్శనార్థం
ఎప్పుడో దిగబడబోతున్న మంత్రివర్యుల బృందానికి
ఏడేడు లోకాలు ఎక్కడో కాదు
ఏడు కొండల పైననే చూపించడానికి
ఏర్పాట్లలో లవలేశం లోపం జరిగితే —

అగ్గిలేకనే కొంప లంటుకుంటాయనీ,
అర్ధరాత్రి గొడుగు పట్టనున్న అదృష్టవంతుడి జాతకం
అందాల పంజరములో రామచిలుకకు
రాచ మర్యాదల గతిగా విగతించినదనీ,
సామ్యవాదానికి ఎక్కడో ఎవరో నిప్పు పెట్టారనీ,

నీతి నిజాయితీలకు ఉప్పు పుట్టడం లేదని
ఈమధ్య ఎవరో ఎవరికో చెప్పులహారం వేశారని
మిందు క్రిందులు కావడానికి తలక్రిందులైనా
మిందు మిందే !— క్రింద క్రిందే !!— గా వున్నదనీ,

పుట్టి చస్తున్నారనీ చచ్చి పుడుతున్నారనీ,
బ్రదుకలేక చస్తున్నారనీ చావలేక బ్రదుకుతున్నారనీ,
పెండిండ్లకు ప్రేమ వ్యవహారాలకు శుభాకాంక్షలనీ
శుభం పలికితే అధికారుల ఆంక్షలనీ
కోప తాపాలతో కొంపలు కూలడము

విరహాగ్ని జ్వాలలతో గుండెలు కాలడము
రాళ్ళల్లో బియ్యము యిసుకలో సిమెంటు కలవడము
ఎన్నో ఎన్నెన్నో వార్తలు ! —
నీళ్ళవాటంగా నిరాఘాటంగా నిరంతరమూ
సాగిపోతున్నాయి —

నా కండ్ల ముందుగా నా కాళ్ళ క్రిందుగా !—
నాకే మాత్రము తెలియకుండగా ! !
తెలిసినా తెలియకపోయినా
ఈ మహా కాల ప్రవాహములో
అగ్గిపుల్ల కుక్కపిల్ల సబ్బుబిళ్ళల జాబితా కెక్కని

నేనొక గువ్వపిల్లను !
తగుదునని కలం పట్టిన దద్దమ్మను !
కాశీ మజిలీ కథలను
కమ్మగా మనుమళ్ళకు వినిపిస్తున్న అవ్వమ్మను ! !

శ్రీ ఏ. కృష్ణారావు

# ప్లేటో "రిపబ్లిక్"

ప్లేటో క్రీ. పూ. 428లో ఏథెన్స్ నగరంలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించినాడు. ఎనిమిది సంవత్సరాలు సోక్రటీస్ వద్ద విద్య నభ్యసించినాడు. క్రీ. పూ. 386లో అకాడమీ (Academy)అనే విద్యాలయాన్ని స్థాపించినాడు. రాజనీతి తత్త్వ శాస్త్రంలో ప్రామాణిక గ్రంథాలైన "రిపబ్లిక్", "లాస్" మొద లైన గ్రంథాలను రచించినాడు క్రీ.పూ. 347లో మరణించినాడు.

పాశ్చాత్య రాజనీతి తత్త్వశాస్త్రానికి ప్లేటోను మూల పురుషునిగా వర్ణించవచ్చు. ఇతడు రచించిన "రిపబ్లిక్" రాజనీతికి తల మాణికంగా ఈ నాటికీ పరిగణింపబడుతున్నది. ఇందులో ఒక ఆదర్శ రాజ్యాన్ని ప్లేటో సమగ్రంగా చర్చించాడు ఇతని రాజకీయ భావనలను సమకాలీన గ్రీకు నగర రాజ్యాల స్థితిగతులు చాలా వరకు ప్రభావితం చేసాయి. గ్రీస్ దేశం వివిధ నగర రాజ్యాలుగా (City-States) విభజితమయి విచ్ఛిన్నకర శక్తుల ప్రభావం వల్ల, సోఫిస్ట్‌ల బోధనలవల్ల, రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక రంగాలలో పతనావస్థకు దారితీసింది. ముఖ్యంగ ఏథెన్స్ నగరంలో రాజకీయ కర్తల అవినీతి, అసమర్థతల వల్ల ప్రజాస్వామ్యం క్షీణించి అజ్ఞానుల పాలనకు లోనయింది సోక్రటీస్ మరణం ప్లేటోను ఎక్కువగా ప్రభావితం చేసింది. ప్రజాస్వామ్యం పట్ల అతనికి ఏహ్యాభావం కల్పించింది. "రాజ్యాధికారం విజ్ఞానుల చేతిలో ఉండాలి; లేదా రాజ్యపాలకులు విజ్ఞానవంతులై ఉండాలి అప్పుడే నగరరాజ్యాలు సుభిక్షంగా ఉంటాయి; అలాకానిచో వాటికి పతనం తప్పదు" అనే అభిప్రాయంతో ప్లేటో తత్త్వవేత్తలు రాజ్యపాలకులుగా (Philosopher-Kings) ఒక ఆదర్శ రాజ్యాన్ని తన "రిపబ్లిక్" గ్రంథంలో చర్చించాడు.

## ఆదర్శ రాజ్యము

ఇది ఆచరణలో ఉన్న రాజ్యాలకు ఒక 'నమూనా రాజ్యం' (Model State) గా ఉండవలెనని ప్లేటో భావించాడు రాజకీయ వేత్తల అవినీతి, అసమర్థతలు ప్లేటోను ప్రజాస్వామ్యం పట్ల విముని చేసినాయి. ప్రస్తుత రాజ్యపతనాలకు కారణాలను గుర్తించి, వాటిని తొలగించటానికి రాజ్యాన్ని ఒక అత్యున్నతమైన నైతిక వ్యవస్థగా రూపొందించటానికి ప్లేటో ప్రయత్నించాడు.

ప్లేటో ఆదర్శ రాజ్యంలో ప్రజలను మానవుని ప్రధాన గుణాలైన ఇచ్ఛ ( Appetite ), ధీరత్వము (Spirit), హేతువు (Reason) లను ఆధారం చేసుకొని మూడు వర్గాలుగా విభజించాడు. ఈ వర్గాలను ఈ క్రింది విధంగా చెప్పవచ్చు:

1 పరిసర ప్రభావాలకు అతీతమై ఇంద్రియ నిగ్రహం కలిగిన వారు.

2 పరిసర ప్రభావాలకు క్షోభ చెంది ఉద్వేగంగా ధైర్యంతో విపత్కర పరిస్థితులను ఎదుర్కొనేవారు.

3 పరిసర ప్రభావాలకు లొంగిపోయే వారు.

ప్లేటో అభిప్రాయంలో మూడవరకం వారు రాజ్యపాలనకు అనర్హులు. వీరు ఆహారోత్పత్తి, ఇతర వస్తూత్పత్తిచేసి ఇతర రెండు వర్గాల నిత్యజీవితావసరాలను తీర్చాలి. రెండవ వర్గం వారు ధైర్య సాహసాలతో రాజ్యాన్ని శత్రువుల నుంచి కాపాడాలి. మొదటి వర్గానికి చెందినవారు ఇంద్రియ నిగ్రహం కలిగి విజ్ఞానవంతులైన ధార్మికులు. ఈ ధార్మికప్రభువు (Philosopher kings) లే రాజ్యపాలనకు అర్హులు.

ప్లేటో అభిప్రాయంలో విజ్ఞానవంతులే పరిపాలకులుకావాలి లేదా పరిపాలకులు విజ్ఞానాన్ని సంపాదించుకోవాలి. అలాకానినాడు ప్రస్తుత రాజ్యాలకు వాటి దోషాల నుంచి విముక్తి లభించదని ప్లేటో పగాఢ విశ్వాసము. ప్లేటో సూచించిన మూడు వర్గాలు వారి వారి కార్యకలాపాలను సక్రమంగా నిర్వహించాలి. ఈ విధమైన శ్రమ విభజన (Division of labour) ను ఆధారం చేసుకొని ప్లేటో వర్గాలను సూచించాడు ఈ వర్గాలు శక్తి సామర్థ్యాలనను సరించి ఏర్పాటవుతాయేకాని వంశ పారం పర్యంగా మాత్రం కాదు.

పరిపాలకులు నిరవధికంగా రాజ్య కార్యకలాపాలలో నిమగ్నులవటానికి ప్లేటో ఒక పథకాన్ని సూచించాడు. దీని ప్రకారం పరిపాలకులకు కుటుంబము, వ్యక్తిగత ఆస్థి ఉండవు. కుటుంబము, ఆస్థి పాస్తులు స్వార్థానికి దారితీస్తాయని, పరిపాలకులలో బంధుప్రీతి, అవినీతి ఏర్పడుతాయని ప్లేటో భావించాడు. అందువల్ల పరిపాలకులకు వ్యక్తిగత కుటుంబము, ఆస్తిని నిషేధించాడు. అయితే మూడవ వర్గం వారికి (సామాన్య ప్రజలు) ఇవి ఉంటాయి.

## ప్లేటో కమ్యూనిజమ్

ఆదర్శరాజ్యంలో పరిపాలకులు నిస్వార్థత, ఉన్నతాశయాలు కలిగి ఉండాలి. ఆస్థి మానవుని స్వార్థపరునిగా, చపలచిత్తునిగా చేస్తుంది. అందువల్ల ప్లేటో సంపదను వ్యక్తిగత ప్రయోజనానికి

కాక రాజ్య పోషణకు, దేశశ్రేయస్సుకు వినియోగించదలచినాడు. రాజ్యంలో ''ప్రతివ్యక్తి సుఖదుఃఖాలు అందరూ పంచుకోవాలి''అనే ఉన్నతభావమే ప్లేటోకు కమ్యూనిజానికి మార్గం చూపింది. ''రిపబ్లిక్''లో వ్యక్తిగత ఆస్థి నిషేధింపబడింది. ఆస్థిని ప్రభుత్వ పరం చేయుటం అప్పటికే గ్రీకు నగర రాజ్యాలలో కొంత వరకు ఆచరణలో ఉన్నదని ప్లేటో గ్రహించాడు. గ్రీకు నగర రాజ్యాలలో ప్రజలు సామూహికంగా భూములకు యాజమాన్యం వహించటం గమనించాడు ఏథెన్స్ ప్రభుత్యం వ్యక్తి ఆస్థి, సంపదలను అజామాయిషీ చేసేది స్పార్టాలో వ్యక్తిగత ఆస్థి ఉన్నప్పటికీ పాడి పంటలను బానిసల పోషణకు వినియోగించేవారు. క్రేటీ నగర రాజ్యంలో ప్రభుత్వ భూములను ప్రభుత్వాధీనంలో ఉన్న బానిసలు వ్యవసాయం చేసి పంటను సమిష్టి భోజనశాలలకు పంపేవారు. ఈ పద్ధతులను ప్లేటో కొంత మార్పులు చేసి ''రిపబ్లిక్''లో సూచించాడు. వ్యవసాయ దారులు పంటలను పండించి రాజ్యపాలన, రక్షణ బాధ్యతలను స్వీకరించిన పరిపాలకులను, సైనికులను పోషించాలి. అందువల్ల సైనికులు, పరిపాలకులు తమ కాలాన్ని పూర్తిగా రాజ్య కార్య కలాపాలలో నిమగ్నం చేయటానికి వీలవుతుంది.

వ్యక్తికి వివాహంవల్ల కుటుంబం ఏర్పడుతుంది. కుటుంబం వల్ల 'నా'భార్య, 'నా' సంతతి అనే భావాలు ఏర్పడుతాయి. అందువల్ల వారి శ్రేయస్సుకోసం, భవిష్యత్‌కోసం అవసరాలకు మించిన ఆస్థిని సంపాదించటానికి కృషిచేస్తాడు. అందువల్ల వ్యక్తి స్వార్థపరుడై లంచగొండిగా తయారవుతాడు. అందువల్ల ప్లేటో పరిపాలకులకు ఆస్థేకాక కుటుంబాన్నికూడా నిషేధించాడు. ఆస్థిలేకపోవటం కొంతవరకు సహించవచ్చు కాని కుటుంబం లేక పోవటం మానవాతీతమైన సాహస కార్యము. పరిపాలకులకు కుటుంబము ఉండదు. కుటుంబం అనే ప్రమేయంలేకుండా పాలక వర్గానికి చెందిన స్త్రీ పురుషులు కొంతకాలం కలసి జీవించే ఏర్పాటును ప్లేటో సూచించాడు. దీని ప్రకారం తెలివితేటలలోను, శారీరకంగాను సమస్థాయిలో ఉన్న స్త్రీ పురుషుల సంయోగం ద్వారా మంచి సంతతి ఏర్పడుతుందని ప్లేటో అభిప్రాయము. ఈ విధానం ద్వారా రాజ్యానికి అవసరమైన, ఆరోగ్యమైన జనాభా ఏర్పడుతుంది.

శిశువు జన్మించగానే ప్రభుత్వ శిశుసంక్షేమశాఖ ఆ శిశువు పోషణ భారాన్ని వహిస్తుంది. ఈ పద్ధతి ప్రకారం సంతతిని తల్లి తండ్రులు, తల్లితండ్రులను సంతతి గుర్తించుతారు. పరిపాలకులకు తమ సంతతి ఎవరో తెలియనందువల్ల వారు ప్రజలందరినీ ఆదరంతో చూస్తారని ప్లేటో అభిప్రాయము.

ప్లేటో 'రిపబ్లిక్'లో సూచించిన కమ్యూనిజానికి, ఆధునిక కమ్యూనిజానికి చాలా వ్యత్యాసాలున్నాయి రాజ్యపాలకులు నిస్వార్థపరులుగా నిరంతరం రాజ్యపాలనలో నిమగ్నులవటం ప్లేటో లక్ష్యము. భౌతిక వనరుల ప్రస్తావన ఇందులో లేదు. ఆధునిక కమ్యూనిజమ్ భౌతిక సంపదకు సంబంధించినది. వస్తూత్పత్తి, వినిమయము, పంపిణీలను నియతంచేసి సమాజ యాజమాన్యంలో సంపద సమానంగా ప్రజలకు అందించటం దీని ప్రధానలక్ష్యము. ప్లేటో కమ్యూనిజం పాలకవర్గానికే పరిమితము. అది వారిని లౌకికబంధనాలనుండి తప్పించటానికి ఒక సాధనము. ఆధునిక కమ్యూనిజం అందరికీ వర్తిస్తుంది. ప్లేటో కమ్యూనిజం వర్గాలను తొలగించదు. ఆధునిక కమ్యూనిజం లక్ష్యం వర్గ రహిత సమాజ స్థాపన.

## విద్యా విధానము

ఆదర్శ రాజ్యంలో ధర్మాన్ని స్థాపించి ప్రజలందరిలో సమన్వయాన్ని సాధించటానికి ప్లేటో రెండు ముఖ్యమైన పద్ధతులను సూచించాడు ఒకటి కమ్యూనిజమ్, రెండు విద్యావిధానము. మొదటిది అర్థిక వాతావరణాన్ని కల్పిస్తుంది. రెండవది వైజ్ఞానిక వాతావరణాన్ని కల్పిస్తుంది. ఈ రెండిటిలో ప్లేటోవిద్యావిధానానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు. ఎందుకంటే మానవ స్వభావాన్ని తీర్చిదిద్ది సంఘాన్ని ప్రగతి పథంలో నడిపించటానికి విద్య సరైన సాధనము. ప్లేటో అభిప్రాయంలో రాజ్యమే ఒక అద్వితీయమైన విద్యాసంస్థ. విద్యాబోధన రాజ్యంయొక్క ప్రధాన కర్తవ్యము.

'రిపబ్లిక్'లో ప్లేటో విద్యావిధానాన్ని గురించి చాలా వివరంగా చర్చించాడు. మానవులలో మంచి భావాన్ని కలిగించటం విద్యయొక్క ముఖ్య ఉద్దేశము. విద్య అంటే భాష్య జ్ఞానమేకాదు, మానసిక పరిణతి పొందటం. ప్లేటో అభిప్రాయంలో మానవుడు పరిపూర్ణతను సాధించగలిగే శక్తి సంపన్నుడు, ఆదర్శపౌరుడు. క్రమశిక్షణతో జీవితంలోని జటిల సమస్యలన్నింటినీ గురించి ఆలోచిస్తాడు. అతడు సత్యాన్ని సత్యంకోసమే అన్వేషిస్తాడు. ప్లేటో విద్యావిధానం స్త్రీ పురుషులకు సమానంగా వర్తిస్తుంది స్త్రీ పురుషులు సమానమని, అన్నిరంగాలలో వారి శక్తిసామర్థ్యాలు రాజ్య శ్రేయస్సుకై వినియోగించాలని ప్లేటో అభిప్రాయము. స్త్రీలు రాజ్యపాలకులుగాను, రక్షకులుగాను ఉండటానికి అర్హులని భావిస్తాడు.

ప్లేటో రూపొందించిన విద్యావిధానం క్రమబద్ధమైనది, ప్రగతిశీలకమైనది. బాల్యదశలో విజ్ఞాన సముపార్జనకన్న ప్రపంచం గురించి, తోటి మానవులను గురించి ఒక దృక్పథాన్ని ఏర్పరుచుకోవటం అవసరం. యువనదశలో విద్యకు భౌతిక, వైజ్ఞానిక విషయాలలో సంబంధం ఉంటుంది. సంగీత సాహిత్యాలు బుద్ధిని వికశింపచేయుటానికి, వ్యాయామం దేహబలాన్ని వృద్ధి చేయటానికి ఉపయోగిస్తాయి. చివరిదశ అయిన వయోజన దశలో సాధారణవిద్య, వృత్తి విద్యలను నేర్పుతారు. వ్యక్తి తన అభిరుచులు, శక్తి, సామర్థ్యాలను బట్టి యుక్తమైన వృత్తిని అనుసరించటానికి విద్య ఉపయోగపడాలి.

ప్లేటో ఆదర్శరాజ్యంలో విద్య ప్రభుత్వ యాజమాన్యంలో ఉంటుంది. ఇది రెండు రకాలు : ప్రాథమిక విద్య, ఉన్నత విద్య.

ప్రాథమిక విద్య 17, 18 సంవత్సరాల లోపు విద్యార్థులకు వర్తిస్తుంది సంగీత సాహిత్యాలు, సామాన్య శాస్త్రాలు, సాధారణ విద్య ఈ దశలో నేర్పుతారు. అయితే అసభ్య శృంగారాల, ధైర్యాన్ని, నిగ్రహాన్ని పోగొట్టే భయంకర గాధలు మొదలైనవి విద్యార్థులకు నేర్పరాదు. 18–20 సంవత్సరాల విద్యార్థులకు వ్యాయామంలో ప్రత్యేక శిక్షణ ఇవ్వాలి.

ప్రాథమిక విద్యలో ఉత్తీర్ణులైన వారే ఉన్నత విద్యకు అర్హులు. 20–35 వయస్సువరకు ఉన్నత విద్య నేర్పుతారు ఈ కాలాన్ని రెండు దశలుగా విభజించవచ్చు. ఒకటి 20 నుంచి 30 సంవత్సరాలు. రెండవ దశ 30 నుంచి 35 సంవత్సరాలు. మొదటి దశలో విద్యార్థి తన అభిరుచి ననుసరించి ఒక వృత్తిని ఎన్నుకొంటాడు. ఆ వృత్తిలో అతనికి శిక్షణ ఇస్తారు. అతడు క్రమబద్ధమైన శాస్త్రాభ్యాసంచేయాలి తార్కిక శక్తిని కూడా అభివృద్ధి చేసుకోవాలి. సైనిక శిక్షణకూడా పొందాలి. ఈ దశ పూర్తయిన తర్వాత 30 వ ఏట ఇంకొక పరీక్ష జరుగుతుంది. ఇందులో ఉత్తీర్ణులైన వారు రాజ్యపాలకులుగా గుర్తింపటం జరుగుతుంది. వారికి మళ్ళీ ఐదు సంవత్సరాలు అదనంగా శిక్షణ ఇస్తారు గణితశాస్త్రం. ఖగోళ తర్కశాస్త్రాలు అధ్యయనం చేయాలి పరిపాలకులకు తార్కిక శక్తి అవసరమని ప్లేటో అభిప్రాయము మొత్తంమీద ఉన్నత ప్రత్యేక వృత్తి విద్యగా పరిణమిస్తుంది

ప్లేటో "రిపబ్లిక్" రాజనీతికంటే విద్యావిధానానికి ఎక్కువ పేరు పొందింది. సకల శాస్త్ర పారంగతుడైన వ్యక్తి రాజ్యాధికారాన్ని చేబడితే పరిపాలన విజ్ఞతాయుతంగా ఉంటుందని ప్లేటో అభిప్రాయము. రాజ్యాధికారం వంశపారంపర్యంగా కాక; సైనిక శక్తిపై కాక, ఎన్నిక ద్వారాకాక, దైవదత్తంగాకాక, మానవుని మేధాశక్తిపై ఆధారపడి ఉండాలని చెప్పిన మొదటి తత్త్వవేత్త ప్లేటో.

## చట్ట రహిత రాజ్యము

ప్లేటో ఆదర్శ రాజ్యము విజ్ఞానయుతమైన నిరంకుశ పాలనను ఏర్పాటుచేస్తుంది. ప్లేటో అభిప్రాయములో రాజనీతి ఒకకళ. ఇందులో నిష్ణాతులైన వారే పరిపాలకులు. విజ్ఞానవంతులే పరిపాలన నిర్వహించాలనటం కొన్ని విషయాలలో వ్యక్తి నిర్ణయాలు తీసుకోవాలన్న అభిప్రాయాన్ని విస్మరిస్తుంది. రాజనీతిని ప్లేటో వైద్యంతో పోల్చాడు. వైద్యశాస్త్రాన్ని అభ్యసించిన వ్యక్తి రోగవిశ్లేషణకుఏవిధంగా అర్హుడౌతాడోఆదేవిధంగాతత్త్వవేత్త మాత్రమేరాజ్యాధికారానికిఅర్హుడని ప్లేటో నిశ్చితమైనఅభిప్రాయం. ఈవిధమైన విపరీతసామ్యం రాజనీతిని రాజనీతికాకుండా చేస్తుంది. ఎందుకంటే విజ్ఞాని కాకపోయినా సామాన్యవ్యక్తి రోగి మాత్రం కాదు. అతనికి నిపుణుడైన వైద్యుని సంరక్షణ అనవసరము. అతనికి ముఖ్యంగా కావలసినది తన స్వవిషయాలను తాను నిర్వహించుకోవటం. బాధ్యతతో ఇతర బాధ్యతగల వ్యక్తులవలె వ్యవహరించటం.

ప్లేటో ఆదర్శ రాజ్యంలో చట్టాలకు స్థానంలేదు. అంతేకాక ప్రజాభిప్రాయం కూడా ఉండదు. ప్లేటో ప్రతిపాదన ప్రకారం ఆలోచించినట్లయితే ఆదర్శ రాజ్యంలో చట్టాలు అనవసరము ఎందుకంటే పరిపాలన అంతా ధార్మికుల చేతులలో ఉంటుంది. వారికి ప్రజాభిప్రాయంతో పనిలేదు. ఒకవేళ ప్రజాభిప్రాయం ఉన్నా దానికి ప్రాముఖ్యం ఉండదు. అసంతృప్తి చెందిన కొద్దిమందిని అనునయించటానికి, వారిని అదుపులో ఉంచటానికి ప్రజాభిప్రాయం అనవసరం అవుతుంది. ఎందుకంటే తాత్త్విక ప్రభువులను శాసనాలతో బంధించటం అవివేకము. వైద్యుడిని ఔషధ నిర్ణయాన్ని వైద్య శాస్త్రాన్ని అనుసరించి చెప్పమని రోగి అడగటం ఎంత అవివేకమో తాత్త్విక ప్రభువులను శాసనబద్ధులం చేయటం అట్లాగే ఉంటుంది.

ప్లేటో చట్టాలను గురించి ప్రస్తావించక పోవటానికి ఒక కారణం ఉన్నది. చట్టం ఆదర్శ రాజ్యంలో ఉండటానికి వీలులేదు. ఎందుకంటే శాస్త్రీయ విజ్ఞానం ప్లేటో భావించినట్లు ప్రజాభిప్రాయంకంటే ఉన్నతమైనదైతే చట్టం ఆధిక్యతకు అవకాశం లేదు. చట్టం సంప్రదాయంనుంచి జనిస్తుంది. ఇది అనుభవం ద్వారా, ఆచారాల ద్వారా, ఆను పూర్వ్యకాల ( Precedents ) ద్వారా రూపొందుతుంది. హేతుబద్ధమైన విజ్ఞానం సాంప్రదాయకమైన చట్టాలకు లోబడదు. విజ్ఞానాన్ని చట్టానికి అతీతం చేయటం వల్ల కొన్ని సమస్యలు ఏర్పడుతాయి. వాటన్నిటినీ కేవలం విద్య మాత్రమే పరిష్కరించలేదు. ఈ కారణాలవల్లనే ప్లేటో "స్టేట్స్ మాన్," "లాస్" అనే గ్రంథాలలో చట్టానికి కొంత ప్రాముఖ్యం ఇచ్చాడు.

## ముగింపు

రాజకీయ సాంఘిక సమస్యలకు వాస్తవిక వివరణ ఇచ్చేవారు ప్లేటోను కాల్పనికవాది (Utopian) అని భావిస్తారు అతని భావాలను చాలా మటుకు అపార్థం చేసుకోవటం జరిగింది. వాటిని సరిగ్గా వివరించక పోవటం గూడా జరిగింది. ప్లేటో కాల్పనిక జగత్తులో ఒక నైతిక సమాజాన్ని నిర్మించాడనటం సబబుకాదు. అతడు సూచించిన పద్ధతులు ఈనాటి సాంఘిక రాజకీయ సమస్యలకు కూడా ఎంతో అవసరం అనిపిస్తుంది. అయితే ప్రస్తుత కాలంలో రాజకీయ సాంఘిక సమస్యలను వాస్తవిక దృక్పథంతో పరిశీలించే వారికి ప్లేటో సిద్ధాంతాలు అంతగా నచ్చకపోవచ్చు. అధికార దుర్వినియోగము, అవినీతి, ఆశ్రిత పక్షపాతాలు పరిపాలకులో ఎంత చోటు చేసుకొన్నయో నిర్ణయించటానికి ఈనాడు ఏర్పడిన దర్యాప్తు సంఘాలు స్పష్టంచేస్తున్నాయి. దీనిని గుర్తించే సుమారు రెండు వేల ఐదు వందల సంవత్సరాల క్రితమే ప్లేటో పరిపాలకులకు ఆస్తి, కుటుంబ ఆశక్తులు ఉండరాదన్నాడంటే ఇందులో ఎంత ఔచిత్యం ఉన్నదో మనం ఊహించుకోవచ్చు.

ప్లేటో కేవలం ఆదర్శవాది మాత్రమేకాదు. అతడు పూర్తిగా కాల్పనిక జగత్తులో విహరించలేదు. సమకాలీన వాస్తవిక సమస్యలు అతనిని పూర్తిగా ఆకర్షించాయి. వాటిని పరిష్కరించేటందుకు ప్లేటో ప్రయత్నించాడు·మాకియవెల్లీ (Machiavelli), కారల్ మార్క్స్, లెనిన్‌ల వలె ప్లేటో కూడా తక్షణ సమస్యల గురించి తీవ్రంగా ఆలోచించాడు. సిరాక్యూస్ రాజుతో పరిచయం, ఆ రాజ్యానికి వెళ్ళి అక్కడ రాజ్యాంగ సంవిధానాన్ని మార్చటానికి ప్లేటో చేసిన ప్రయత్నం మొదలైన వాటిని పరిశీలించినట్లయితే తన ఆదర్శ రాజ్యాన్ని ఆచరణలో పెట్టటానికి అతడు ఎంత కృషి చేసినాడో తెలుస్తుంది. అంతేకాక ప్లేటో కేవలం సిద్ధాంత పరమైన, అమూర్తమైన (abstract) విషయాలను గురించి ఎక్కువ ఆసక్తి చూపలేదు. ప్లేటో తన దృష్టిలో మానవ సమాజాన్ని రాజకీయాలను పరిశీలించిన వాస్తవికవాది. వాటిని అర్థం చేసుకొని, వాటి అనర్థాలను సంస్కరించటానికి ప్రయత్నించిన ఒక గొప్ప మేధావి. సాంప్రదాయిక భావాలకు సంపూర్ణంగా స్వస్తి చెప్పి నూతన సమాజాన్ని నిర్మించటంలో విప్లవాత్మకమైన భావాలను సూచించిన ఆధునిక యుగపురుషుడైన కారల్ మార్క్స్ వలె ప్లేటో ఒక మహా తత్త్వవేత్త.

ప్లేటో రాజనీతి తత్త్వం కాలాతీతమైనది. సార్వజనీనమైనది. అతడు "రిపబ్లిక్" వ్రాసి దాదాపు రెండు వేల ఐదు వందల సంవత్సరాలైనప్పటికీ ఈనాటికీ మానవుని హేతువాదంపై దాని ప్రభావం అపరిమితము. నిజానికి ఈనాడు మనం ఎదుర్కొంటున్న సమస్యలన్నింటినీ ప్లేటో చర్చించాడు.

ప్లేటో ఆదర్శ రాజ్యం, అతని సిద్ధాంతాలు ఆచరణ యోగ్యం కాక పోయినా ఆమోద యోగ్యమైన ఆదర్శాలుగా అవి మానవ చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తాయి. వాటిని అధిగమించి సాంఘిక, రాజకీయ సమస్యలకు పరిష్కారం ఇచ్చే తత్త్వవేత్త ఈనాటికీ జనించలేదనటం అతిశయోక్తి కాదేమో?

## సంప్రదింపు గ్రంథాలు


1 Plato and His predecessors—E Barker
2 Plato and Aristotle—E. Barker
3 Plato-the Man and His works—A. E. Taylor
4 The Dialogues of plato—Edited by B. Jowett
5 The Essence of platos' philosophy—Constantine Ritter
6 plato Today—Crossman
7 Lectures on the Republic of Plato—R.L. Nettleship.


# తెల్లని పక్షి

## మల్లెల

పడమటి పూరి గుడిసెలో
మసకేసిన మబ్బు చిమ్నికౌగిట్లో
కాగితపు పువ్వులా పెనుగులాడుతోంది...
ఒక ఎర్రని వెలుగురేకు.

చెట్ల పర్వతాలపై
ఆకుల మైదానాల్లో
తపస్సుచేస్తున్న నిశ్శబ్ద దిగంబర సౌందర్యం
శిరీషపు పూమొగ్గల గుహల్లోకి
ప్రశాంత గంగలా ప్రవహిస్తోంది.

నేను
శబ్దంలో మరణించి
శతాబ్దాల మహానిశ్శబ్దానిక వలస పోతున్నా...,
ప్రపంచ విపంచికపై సృష్టి జీవన స్వరాన్ని
ఇరుసంధ్యలలో రాగరంజితం చేసి,
శూన్యం పంపిన దూది పల్లకిలో
ఒక హిమబిందు — శిశువునై.
తిరిగి రావాలన్న కాంక్షలేదు.
రాకుంటే — ఈ గుడ్డి గూటికి వెన్నెలరాదు.
అణువంత జిజ్ఞాసతో — సృష్టి మహాశూన్యంలోకి
పయనిస్తున్న నన్ను
ఆచ్ఛాదనమే శాశ్వతమనుకున్న
ఈ అర్థాంతర అవసర చైతన్యం
నీడలా వెంటాడి
నగ్నంగా భగ్నమై పోతోంది...,
నే నీ నల్లని లోయిల్లోంచి
మహా శ్వేత శిఖరాగ్రాలకు
పురోగమిస్తున్న తెల్లని పక్షిని.

శ్రీ రేకళిగె మఠము వీరయ్య

# బసవేశ్వరుని సంస్కరణలు

బసవేశ్వరుని జీవన చరిత్ర, బహుళార్థసాగరమేగాక, సకలార్థ సాగరము వంటిది ప్రస్తుతము మనము సతమతమౌతున్న సమస్యల కన్నింటికిని, పరిష్కార మార్గములాతని వచనముల యందు మనకు దొరుకును. కనుకనే ౧౯౨౪ నందు బెల్గాములో మహాత్ముడు ఉపన్యసించునప్పుడు, "నేను మీకు క్రొత్తగా తెలుపదగిన విషయమేమియునులేదు. నేను చెప్పబోవునదంతయును, సుమారు ఎనిమిది వందల సంవత్సరముల క్రితమే, బసవేశ్వరుడు తెలిపియున్నా"డని, అప్పటి జనులనుద్దేశించి వచించియున్నాడు.

బసవేశ్వరుండొనరించిన సంస్కరణములన్నియు నేడు మనకు మార్గదర్శకములుగానున్నవనుట మిక్కిలి సముంజసము. అతని సంస్కరణములను, ధార్మిక, సామాజిక, ఆర్థిక, నైతిక సంస్కరణములుగా విభజింపవచ్చును. అతడు అన్ని సంస్కరణములకును ధార్మికతత్త్వమునే మూలముగా గ్రహించి యుండెను. ప్రస్తుతము మనము గొప్పగా చెప్పకొనుచున్న కులమత తత్త్వ విరోధము, సర్వమానవ సమానత్వము, అస్పృశ్యతా నివారణము, స్త్రీ పురుష సమానత్వము, అహింస మొదలగు సంస్కరణములు చాలావరకు రాజకీయ తత్త్వమునే అనుసరించియున్న వనవచ్చును.

మొగలు సామ్రాజ్యమును పటిష్ఠతము చేయుటకై అక్బరు పాదుషా మొదలుపెట్టిన 'దీనేఇలాహి' అను సర్వసమ్మత మత ప్రచారము, ఆ నాటి రాజకియ ప్రాతిపదికపైననే ఆధారపడియుండె ననునది అందరెరింగిన విషయమే! అప్పటి రాజకీయము సామ్రాజ్య వాదతత్త్వము ననుసరించియున్నందున, అక్బరు తర్వాత ఆ ప్రచారము అంతరించినది. నేటి రాజకీయము ప్రజాస్వామ్య తత్త్వముపై నడుచుచున్నందున, రాజకీయ నాయకులు జనసామాన్యము యొక్క ఆదరణను పొంది, వారి 'మత దానము'ను పొందుటకు, ఈ సంస్కరణములను చేయూతగా గొనుచుండుట అందరికిని తెలిసిన విషయమే! అక్బరునకు 'సూఫీ' మతతత్త్వముపైని అభిమానమున్నను తన సామ్రాజ్య పటిష్ఠత కోర్కెమెండుగా నుండెనన్నట్లు, నేటి రాజకీయ నాయకులకు, మానవతా వాదముపైని అభిమానమున్నను. రాజకీయ సాధనకోర్కెయే అధికముగా నున్నదనిన సత్య దూరము గాదు. నేడు జరుగుచున్న ప్రచారములు, విరుద్ధ ప్రచారములు రాజకీయ అల్లకల్లోలములను, ఇందుకు నిదర్శనములుగా గైకొనవచ్చును. ఈ ప్రచారముల వలనను, అల్లకల్లోలముల వలనను, వారు చేయదలచిన సంస్కరణములకు భంగము కలుగుచుండుటయేగాక మానవత్వముకు బదులు దానవత్వము తాండవ మాడుచుండుట గోచరమగుచునే యున్నది.

దేశమునందు హిందూజాతికి మూల రూపమున నొక ప్రత్యేక సంస్కృతి, సంప్రదాయమున్నను, కులమత తత్త్వముల ననుసరించి స్థానకాల విభేదముల ననుసరించి అనేక సంస్కృతులకు, సంప్రదాయములకు మనదేశము పుట్టినిల్లైనదనుటలో సందేహంలేదు. ఐనను ప్రస్తుత వాతావరణమునందు వివిధ కుల మతములకు చెందిన మానవులందరును, కులమత విభేదములనుగాని, అంటరానితనమునుగాని పాటించక అందరును కలిసి మెలసి సర్వ సహోదర భావముతోనే ప్రవర్తించుచుండుట నేటి ప్రచారముల పరిణామమైనను, మంచి పరిణామమే!

వర్ణ విభేదము, కులమత వివక్షత, హిందూ జాతియందు ఆనాటి నుండియే వచ్చుచున్నది. కాని అప్పటినుండియే వాని వలన గలుగుచుండిన కొన్ని అనర్థములను ధార్మిక పురుషులు, వేదాంతులు, తత్త్వశాస్త్రజ్ఞులు తెలుసుకొని వానిని నిర్మూలించు ప్రయత్నములను కూడ జేయుచునేయున్నారు. వారిలో బుద్ధుడు, మహావీరుడు, రామానుజుడు, బసవేశ్వరుడు, కబీరు, వేమన, దయానందుడు, మన మహాత్ముడు, ప్రశంసనీయులు. వీరందరును కులమత విభేదమును, అస్పృశ్యతను నివారించి మానవ సమాజమునందు సర్వ సమానత్వమును, సర్వ సహోదర భావమును నెలకొల్పిరి. కబీరు, వేమన తప్ప మిగిలిన వారందరును ధార్మిక పద్ధతి ననుసరించి, కొన్ని నిబంధనలను కల్పించి వాని అనుకరణము ద్వారా మానవులందు సర్వ సమానతను నెలకొల్ప ప్రయత్నించి తమ తమ ప్రయత్నములందు సఫలులు కూడ కాగలిగిరి.

బుద్ధుడు మహావీరుడు జాతిమత విశిష్టమగు వర్ణ కల్పనను ఖండించి, నూతన సమాజ రచనకు దారితీసినను, ఆ నూతన సమాజమునకు అనుకూలమగు ఆర్థిక సంస్కరణములను సూచించనందునను, ఆ మతముల నియమములు కొంత కఠినములుగా నున్నందునను, క్రొత్తగా నేర్పడిన ఆ సమాజములు వివిధ శాఖలుగా విభజింపబడి ప్రత్యేక మతములుగా నిలిచిపోయినవి. రామానుజుడును వివిధ కులముల వారికి వైష్ణవ మత దీక్షనొసగి, నవ సమాజ నిర్మాణ ప్రయత్న మొనరించినను; ఆ నూతన సమాజము

నందలి జనులకు ధార్మికముగాను, సామాజికముగాను సమాన ప్రతిపత్తిని కలుగజేయనందున, వైష్ణవుల యందును వర్ణ కల్పన నెలకొని, ఉచ్చనీచ భావన పెంపొందుచు వచ్చెను. కబీరు, వేమన మొదలగు వేదాంత పురుషు లొనరించిన బోధనలు జనుల యందు 'పురాణ వైరాగ్యము' వలె వినినప్పుడు ఉద్రేకము, ఉత్సాహములను కలుగజేసినను, తర్వాత అవి గ్రంధస్థ నియమములై నిలిచి యుండును.

బసవేశ్వరుడు, దయానందుడు, వీరిరువురును, తమతమ సంస్కరణములను, ముఖ్యంగా వర్ణ విభేద నిర్మూలనమును ధార్మిక ప్రాతిపదికపైననే ప్రారంభించినందు వలన, వారు తమతమ ప్రయత్నములందు సఫలులురని నిస్సంశయముగా చెప్పవచ్చును. బసవేశ్వరుడు కులమత విభేదములు లేక మానవులందరును వీరశైవధర్మ సంప్రదాయాను సారము 'లింగధారణ'మున కర్హులనియు, 'లింగధారణ' బొందిన వారందరును సమానులనియు ఆచర రీత్యా నిరూపించెను. అట్టి వారందరును, ధార్మిక చర్చల గురించి తాను స్థాపించిన అనుభవ మండపమునందు పాల్గొని తమతమ అనుభవములను వెల్లడిజేయుట కర్హులని, వారికి స్వాగత మొసగుచుండెను. అంతేకాక బసవేశ్వరుడు వర్ణాంతర వివాహములను కూడ మత ప్రాతిపదికపైననే జేయవచ్చునని తెలిపెను. అతని కాలమునందే లింగధారుండగు హరళయ్యయను అస్పృశ్యుని కుమారునకును అలింగియగు మాధువయ్యయను బ్రాహ్మణుని కూతురునకు, ఆమె లింగధారియైన తర్వాతనే, వివాహము జరిగినది లింగధారులందరు (మొదలే కులము వారైనను) సమానులనియు, వారియందు(పూర్వ కుల బేధముల ననుసరించి) ఉచ్చనీచతారతమ్యము జేయకూడదనియు బసవేశ్వరుడు ఖండితముగా బోధించెను. లింగధారులందరు,శివభక్తి, లింగపూజా నియమము, సకల జీవదయా పరత్వము, వృత్తి పవిత్రత, సత్యవచనము, సహనము, సద్శీలము, స్త్రీ ఔన్నత్యము, దాసోహబుద్ధి మొదలగు ఉత్తమ నియమములను పాటించుచు సత్య శుద్ధ జీవనమును గడుపుచుండవలయునని, అతడు బోధించెను. అట్టి వారందరును ''శివశరణులనియు, శంకర సమానులనియు, తాను వారందరికిని కింకరుండ''ననియు ఉద్ఘోషించెను. అందువలననే నాడు చీలికలు చెందియుండిన మానవ సమాజము నొక్కటిగా నేర్పడి ధార్మికముగాను, సాంస్కృతికముగాను, సర్వ సమానతగల లింగాంగుల సమాజరూపమున రూపొందగలిగెను.

దయానందుడును ఏ కులము వారైనను, వైదిక మత సాంప్రదాయానుసారము ''శుద్ధి'' సంస్కారమును పొందిన తర్వాత వారందరును సమానులగుదురనియు, వారు 'ఆర్యులు' అనగా గౌరవనీయులని తెలిపెను బసవేశ్వరుని వలెనే దయానందుడును ఆర్యులందరును, సత్యవచనము, అహింస, మద్య మాంసాదుల నిషేధము మొదలగు ఉత్తమ నియమములను పాటించుచు దైవ భక్తి గలిగియుండవలయునని బోధించెను. అందువలననే వారి యందు ధర్మాభిమానము, ఐకమత్యము కనబడుచున్నది.

నేడు మనము పాటించుచున్న సంఘ సంస్కరణములు ముఖ్యముగా కుల మతభేద నిర్మూలనము, అస్పృశ్యతానివారణము, వర్ణాంతర వివాహములు, స్త్రీ పురుష సమానత్వము జాతిపితయగు గాంధిమహాత్ముడు సూచించిన సంస్కరణముల ననుసరించియున్నవి. మహాత్ముడు రాజకీయముగా యుగపురుషుడైనను, ధార్మిక తత్త్వములను బొత్తిగా విడువలేదనుట నిస్సందేహము. దైవభక్తిని, సదసద్వివేకమును, మంచి చెడుల తారతమ్యమును అతడు చేయ జార విడువలేదు. అతడు ఇతర భౌతికసూత్రములతో బాటు, దైవ భక్తి, సత్యవచనము, అహింస, మద్యమాంసాదుల వర్జనము మొదలగు నైతిక, ధార్మిక సూత్రములను గూడ బోధించి యున్నాడు. అంతేగాక బసవేశ్వరునివలె 'నుడివినటులు నడువ వలయుననియు, నడిచినటులు నుడువవలయుననియు' కూడ బోధించియున్నాడు. మహాత్ముడును సదాచారము, సత్య శుద్ధమగు వృత్తి, నిరాడంబరజీవనము, మానవసమాజాభివృద్ధికి అవసరమని తాను ఆచరించిచూపియున్నాడు. ఇట్టి నైతిక సదాచారముల నను సరించియే కులమత విభేదములను వదలవలయునని, అతని సిద్ధాంత మనుట సత్య దూరముగాదు. కులమతములవలన ఉచ్చనీచ తారతమ్యములేకున్నను, ఆచార విచారము, శీలములననుసరించియైనను, గ్రాహ్యము, దూష్యము తప్పనిసరియని అతని అభిమతమైయుండె ననుటకు, మాలవాడలలోకి తాను స్వయముగా బోయి, వారికి సదాచార సత్ప్రవర్తనములను, పరిశుభ్రతను బోధించుట, వారి ఇండ్లను, వాకిండ్లను శుభ్రముచేయించుట, మొదలగు అతని దిన చర్యలే సాక్షియన వచ్చును. నేటి మన రాజకీయనాయకులు, కుల మత విభేద నిర్మూలనమునందు మహాత్ముడు సూచించిన మూల తత్త్వమును విడిచి, మానవులందరును సమానులని అనుట, అసమంజసమున వచ్చును.

సామాజిక సంస్కరణ మెంతటి ఉపయుక్తమైనదైనను, జనుల మనస్సులలో అది ఉప్పొంగి వచ్చిననే సుళవుగా ఆచరణ యందు వచ్చుటకు అవకాశముండును. గావున నేటి నాయకు లందరును, రాజకీయ సాధనకొరకే గాక, మహాత్ముడు జూపిన సదాచారము, సద్శీలములను ప్రధానముగా గొని, జాతిమత విభేద నిర్మూలనమును, వర్ణాంతరవివాహములనుజరిపినచో అవితాత్త్వికము గాను, సాంస్కృతికముగాను, ఉపకరించుననవచ్చును. జనులయందు సత్ప్రవర్తనము సద్భావములను కలుగజేయనిదే అట్లు చేసిన సంస్కరణమనిపించక సంకరమనిపించును కనుకనే బసవేశ్వరుడు ఈ వర్ణ విభేదములను, లింగధారణద్వారా మాన్పుటకుప్రయత్నించి ఘనవిజయమును పొందెను—

# బసవన నీతివచనములు

నాలవాడు నీతిగలవాడైన అతనింటి
మూలబడియుండుటలేను, చూడవయ్యా!
రీతిదప్పక 'లింగ శరణన'వయ్యా!
రీతిదప్పకును 'శివ శరణన'వయ్యా!
మా కూడల సంగని మహామందిరమందు.
మాదిగ చెన్నయ్య, నీతిమంతుడయ్యా! —

దయలేని ధర్మమదెట్టిదయ్యా!
దయయే గావలయు సకల ప్రాణుల యెడ,
దయయే ధర్మమునకు **మూ**లమయ్యా!
**కూ**డల సంగయ్య అట్లుగానివారి నొల్లడయ్యా!

రాతి నాగులజూచిన, 'పాలు **బో**యు' మందురు.
జాతి పాముల జూచిన 'చంపు చంపు' డందురు.
తినగల జంగముడొచ్చిన, 'పో పో'మ్మందురు
తినలేని లింగమునకు 'నైవేద్యమిడు' మందురు.
కూడల సంగని శరణుల జూచి, ఉదాసీన మొందిన;
గుండుకు తాకిన పెల్లవలె నగుదురయ్యా!

సెట్టియందునా సిరియాళుని ?
చాకలియందునా, మాచయ్యను ?
డోహరుడందునా, కక్కయ్యను ?
మాదిగయందునా, చెన్నయ్యను ?
నేను బ్రాహ్మణుడ ననిన,
కూడల సంగయ్య నగునయ్యా!

ఉత్తమ కులమున బుట్టితినను,
కష్ట తరమగు బరువును, నాపైన మోపకయ్యా!
కక్కయ్య తన ప్రసాదమునియ్యడు చూడయ్య!
దాసయ్య తన తీర్థము నొసగడు **చూ**డయ్య!
మన్ననగల చెన్నయ్య నన్ను, మన్నింపడు చూడయ్య!
ఉన్నత మహిమా, కూడల సంగమదేవా!

పలికిన పలుకులను, నమ్మి, నిన్ను
బఱయచ్చెదరని, ఓ పశువా, ఏడ్చుచుంటివా!
వేదము జదివినవారి యెదుట నేడ్వుము.
శాస్త్రముల వినినవారి యెదుట నేడ్వుము.
నీ వేడ్చినందులకు తగురీతి చేయును
కూడల సంగము దేవుడు.

తెలుగు అనువాదము : శ్రీ రేకళిగె మఠము వీరయ్య

# నీవు సూర్యునివోయ్!

శ్రీ సిహెచ్. మధు

రాళ్ల
కన్నీళ్లను తుడువవు
చేతులు తుడుస్తాయి.

తుపాకీలు
కన్నీళ్లను తుడువవు
చేతులు తుడుస్తాయి

మాటలు
కన్నీళ్లను తుడువవు
చేతులు తుడుస్తాయి.

ఇంకొకరు
నీ కన్నీళ్లను ఆర్పరు
నీ కన్నీళ్లను
నువ్వే తుడ్చుకో

సూర్యుని కోసం
ఆరాట మెందుకూ ?
నీవే సూర్యునివికా

డాక్టర్ సి. ఏ. రామచంద్రరావు

# అర్వాచీన తూర్పుగాంగుల, సూర్య వంశగజపతుల రాజధానీ నగరములు

అర్వాచీన గాంగ రాజన్యులలో మూడవవాడైన అనంతవర్మ చోడ గంగుని కాలము (క్రీ. శ. 1070- 1152) వరకు, పూర్వ అర్వాచీన తూర్పుగాంగ ప్రభువుల తామ్రపట్టికలన్నియు దంత పురమునుండిగాని, కళింగ నగరమునుండిగాని వెలువరింపబడినవి. అధికముగా కళింగ నగరమునుండే ప్రకటింపబడినవి. అనంతవర్మ చోడగంగుని విస్తృత సామ్రాజ్య ప్రయోజనములు, అతడు క్రీ. శ. 1134లో రాజధానిని కేంద్రస్థముగనున్న కటకము (కటక్)నకు మార్చునంతవరకు, తూర్పుగాంగులకు దంతపుర, కళింగ నగరములే రాజధానీ నగరములుగ నుండినవి.[1]

## దంతపురము

ఈ రాజధానీ నగరముల పుట్టుపూర్వోత్తరముల గూర్చి అనంతవర్మ చోడగంగుని మరితామ్ర పట్టికల అవతారికా భాగముల నుండి మాత్రమే కొంత తెలియుచున్నది. తూర్పుగాంగ వంశ స్థాపకుడైన కామార్ణవుడు, తన సోదరులతో కోలాహలపురమునుండి తూర్పుగ పయనించి, శబరాదిత్యుడను వానిని నిర్జించి కళింగ రాజ్యమును వశపరచుకొని, దానిని, వైభవమున ఇతర జనపతుల రాజధానులను తలదన్ని, అమరావతి నపహసించు 'దంతాపురము' రాజధానిగ పరిపాలించెనని ఈ అవతారికలు తెలియపరచును. ('శబరాదిత్యన్నిహత్య కామార్ణవః కలింగా న్గ్రహత్ తస్యచ రిజిత సకల నృపతిపుర మపహసిత సురేంద్రపురం దంతాపు పురన్నామ నగరీ రాజధాన్యాసీత్').[2] దీనిని బట్టి, కామార్ణవుడు, నాటికే విభవాస్పదముగ వెలసియున్న దంతపురమును తన రాజధానిగ చేసుకొనెనని అనుకొనవలెను. బౌద్ధసారస్వతమున దంతపురమను ప్రాచీన నగరముయొక్క ప్రసక్తి కలదు. బుద్ధుని మహాపరి నిర్వాణానంతరము, అతని శిష్యుడైన ఖేముడు బుద్ధుని పై పళ్లలో ఎడమవైపు దాని నొకటిని దంతపురమునకు కొని తెచ్చెనని దళద వంశము చెప్పును.[3] మహావస్తు (III, 208, '09)లో ఉద్ధృత మొనర్చబడిన దీఘనికాయ మందలి ఒక ప్రాచీన గాథయందు కళింగమందలి దంతపురము భారతవర్షమునందలి ఏడు ప్రాచీన నగరములలో ఒకటిగ చెప్పబడినది.[4] సంస్కృత భాషయందుగల మిక్కిలి ప్రాచీన గ్రంథములలో మహావస్తు ఒకటి. కుంభకార జాతకము కూడ దంతపురమును కళింగమునకు రాజధానిగ పేర్కొన్నది.[5] ఈ దంతపురమును చరిత్రకారులు జగన్నాథపురితోను,[6] శ్రీకాకుళమునకు కొద్ది మైళ్లదూరమున, శ్రీకాకుళం – ముఖలింగం రోడ్డుమీదవున్న దంతవక్త్రపురము లేక కోట అను స్థలముతోను, వివిధముగ గుర్తించినారు.[7]

ముఖలింగ మందలి మధుకేశ్వరాలయమున గల అనంతవర్మ చోడగంగుని కాలమునాటి రెండు శాసనములలో దంతపురము పేర్కొనబడినది. శ. 1027 (క్రీ. శ 1105) నాటి శాసనమున చోడగంగుని దేవేరులలో ఒకతె యగు లోకాంబిక(లోకాంబికా... శ్రీ చోడ గంగావనీనాథ క్షేమపరంపరోదధి జలోద్యచ్చంద్రరేఖాకృతి :) దేవుని అఖండ దీపము కొనసాగించుటకై ఇద్దరు బందిని గ్రామ తెలకికాపులకు 'దంతాపారమున'–అనగా దంతపురమున–మూడు పుట్ల భూమి ఒసగినది.[8] శ 1035 [క్రీ. శ. 113] నాటి శాసనము కూడ చోడగంగుని మరొక దేవియైన ఎఱుకమ్మ ['చోడ గంగ్గనృపతే : ప్రేమైక పాత్రమ్మహాదేవీ శ్రీ యఱుకమ్మ నామ విదితా'] అఖండవర్తి దీపమునకై 'దంతాపురము'న ఇచ్చిన మూడు పుట్ల నేలను గూర్చి తెలుపును.[9] శ. 1106 [క్రీ. శ. 1184] నాటి, కొంత పగిలి యున్న సింహాచల శాసనమున సూరప్ప అనువాడు దంతపుర పాలకుడైన సింహాద్రిపతి అనువాని మంత్రిగా చెప్పబడియున్నాడు [దంతపురేశ సింహాద్రిపతేర్మంత్రీ.][10] ఈ శాసనములను బట్టి, 12వ శతాబ్దము వరకు, ముఖలింగమునకు దాపున దంతపుర మొకటి వుండెడిదని, దానిని గాంగ ప్రభువులు నియమించిన అధికారి ఒకడు పాలించుచుండెడివాడని తలచవలసియున్నది. అనంతవర్మ చోడగంగుని మరి తామ్రపట్టికల అవతారికలో కళింగమున తూర్పుగాంగవంశ స్థాపకుడైన కామార్ణవుని రాజధానిగా పేర్కొనబడిన దంతాపురము లేక దంతపురము, ఈ శిలా శాసనములలో చెప్పబడ్డ దంతపురమే అని భావించవచ్చును. అర్వాచీన గాంగరాజులలో మొదటి వాడుగ తలచబడుచున్న మూడవ వజ్రహస్తుడు (క్రీ. శ. 1038 – 1070) కూడా తాన శ. 967 [క్రీ. శ. 1045] నరసాపట్నం తామ్ర పట్టికలను దంతపురము నుండి వెలువరించుట ఈ ఊహకు బలముగా నున్నది.[11] అనంతవర్మ చోడగంగుని మరి శాసనములలో, కళింగమున తూర్పుగాంగ వంశ స్థాపకుడై, బహుశా ఎవి

మిదవ శతాబ్దపు ఉత్తరార్ధమున వున్న కామార్ణవుడు, వైభవోపేతమైన దంతపురము తనకు రాజధానిగ ఎంచుకొన్నాడని చెప్ప బడినను, [12] కామార్ణవునికి ముందు కాలము నుండి అనగా తూర్పుగాంగులు తమపాలనను ప్రారంభించిన ఆరవ శతాబ్ద మాదిగా, ఈ దంతపురము వీరి రాజధానిగ వుండినదని పూర్వ గాంగుల తామ్ర పట్టికలు మనకు తెలుపును. గాంగశకము 39 వ సంవత్సరము నాటి ఇంద్రవర్మ జిర్జింగి తామ్రపట్టికలు దంత పురము నుండి వేయబడినవి. [13] మన ఎరుకకు వచ్చిన పూర్వగాంగు లలో ఇంద్రవర్మ మొదటివాడు. శ. 1103 నాటి దేవేంద్రవర్మ కంబకాయ తామ్రశాసనము, అతడు దంతపురమున నుండగా ['దంతిపురస్థిత':] ఒసగినట్లు చెప్పబడ్డది; కాని ఈ శాసనమున కళింగ నగరము రాజధానిగ పేర్కొనబడినది ['కళింగ నగరాధి వాసకాత్'')[14]. దంతపురము ఉనికిని, రాజధాని నగరముగనో, లేక ఒక ప్రధాన నగరముగనో, క్రీ. శ. 6వ శతాబ్దము నుండి 12వ శతాబ్దము వరకు గల తూర్పుగాంగ శాసనములు పేర్కొనుచున్నవి అనంతవర్మ చోడ గంగుని మరి శాసనములలో విజిత సకల నృపతి పురమని, అపహసిత సురేంద్రపురమని [15] వర్ణింపబడిన దంత పురము అదేవిధముగ ''అమరపురప్రతిస్పర్థి శ్రీమద్దంత పురాత్''[16] అని, 'విజయవతో దంతపురవాసకాత్' [17] అని వర్ణింపబడుట గమనింప దగ్గ విషయము.

## కళింగ నగరము

పూర్వగాంగ వంశపాలకులలో వరుస క్రమమున మూడవ వాడై, దానార్ణవుని పుత్రుడైన ద్వితీయ కామార్ణవుడు త్రివిష్టపమును తిరస్కరించెడి నగర మనుపేరుగల పురమును నిర్మించెనని అనంతవర్మ చోడగంగుని మరితామ్రపట్టికలు తెల్పును. [''ద్వితీయ కామార్ణవః పంచాశద్ వర్షాద్ మహీమండలమమణ్డయత్ తస్య తిరస్కృత త్రివిష్టపమ్ నగరం నామపురమాసీత్''] [18] ఆకాశ మంటు హర్మ్యకుడ్యములు, విచిత్రపత్ర లలితా చిత్రితములైన ద్వారములు కలిగి, దేవతలకు స్వర్గసౌధములన్న ఏవగింపు కలిగించెడు దేవాయతన మను, [19] మధూక వృక్షము నుండి ఆవిర్భవించిన మధూకేశ్వరునికి ఆ నగరమందు కామార్ణవుడు నిర్మించెనని ఈ తామ్ర పట్టికలు చెప్పును. [''తస్మిన్ సోపి మధూక వృక్ష జనుషద్-ఈశస్య, లింగాకృతేః కృత్యాభ్యామ్ మధుకేశ ఇత్యరచయత్ ప్రాసాదమ్ – అభ్రంలిహమ్ యద్ద్వారోర్ధ్వ విచిత్ర పత్రలతికాశ్చిత్రీ వాపశ్యతామ్ సౌధాన్యంబర వర్తినామ్ హృదిభవేన్న్యూనమ్ విమానరుచిః.'][20] ఈ 'నగర' నిర్మాణము, అంతకు ముందు రాజధానిగ నున్న దంతపుర ప్రాధాన్యమును, వైభవమును క్రమముగా హరించినట్లు కనబడు చున్నది తూర్పుగాంగశాసనములలో పేర్కొనబడ్డ 'నగ రము' లేక 'కళింగనగరము'ను; చరిత్రకారులు, నేడు, నాలుగు లేక అయిదువేల జనాభాతో గూడిన గ్రామముగా నున్న ముఖలింగముగా గుర్తించిచారు. ఇచట అనేక అర్వాచీన తూర్పుగాంగ శాసనములతో కూడిన మధూకేశ్వరాలయము కలదు. [21]

తొమ్మిదవ శతాబ్దపు రెండవపాదముననో, మూడవపాదము ననో వున్న రెండవ కామార్ణవుడు కళింగ నగరస్థాపకుడని అనంత వర్మ చోడగంగుని తామ్రపట్టికలు చెప్పినప్పటికి, కనీసము గాంగ సంవత్సరము 80 [అనగా క్రీ. శ. 498 + 80=578] నాటికే కళింగ నగరము రాజధానిగ అలరారుచుండెనని పూర్వగాంగ తామ్ర పట్టికలు తెలుపును. [22] చోడగంగుని తామ్ర పట్టికలలోని పొర పాటునకు కారణము తెలియదు. కాని ఇదే పట్టికలలో చెప్పబడిన దంతపురము మొదటి రాజధాని తరువాత కళింగ నగరము దాని స్థానము నాక్రమించినది అను విషయమును పూర్వగాంగ తామ్ర పట్టికలు కూడ సమర్థించుచున్నవి; ఎట్లన, గాంగశక సంవత్సరము 39 నాటి ఇంద్రవర్మ జిర్జింగి తామ్ర పట్టికలు [3] దంతపురము నుండి వెలువరింపబడగా, హస్తివర్మ గాంగ సంవత్సరము 79 నాటి నరసింగపల్లి తామ్ర పట్టికలు, [24] 80 నాటి ఉర్లాం తామ్రపట్టికలు[24a] కళింగనగరము నుండి ప్రకటింప బడ్డవి. పూర్వ గాంగరాజు సామంతవర్మ తామ్రపట్టికలు గాంగ సంవత్సరము 64 నాటివి, సేమ్యవనము నుండి ఇవ్వబడి కళింగనగరమును పేర్కొన లేదు.[25] దీనిని బట్టి, కళింగనగరము గాంగ సంవత్సరములు 64,79ల మధ్య, అనగా క్రీ. శ. 562, 577ల మధ్య, ఆరవ శతాబ్దపు మూడవపాదమున నిర్మితమై యుండవచ్చునని ఊహింపవలసి యున్నది. ముఖలింగ దేవాలయము లందు ఒక్క పూర్వ గాంగ శాసనము కూడ కానరాక పోవుట ఆశ్చర్యము కొలుపును. కాని క్రీ. శ. పదకొండవ శతాబ్దము వరకు గాంగరాజులు తమ దాన ధర్మములనన్నిటిని తామ్ర శాసనస్థము గావించిరే కాని, శిలా శాసనస్థము చేయలేదు అను విషయము ఇచట జ్ఞప్తియందుంచు కొనవలెను. బహు దేవాలయ నిర్మాత లైన తూర్పు చాళుక్యులు కూడ ఇదే పద్ధతి ననుసరించుటచే, వారి శిలాశాసనములు కూడా పదకొండవ శతాబ్దమునకు ముం దటివి కానరావు. పోగా రెండవ కామార్ణవుడు కళింగ నగరమున మధూకేశ్వరాలయమును మాత్రము నిర్మించెననియు, తరువాతి కాలమున పొరపాటుగ అతడే నగరస్థాపకుడుగ ఎంచబడెననియు తలచుటకు కూడ వీలున్నది.

పూర్వగాంగ శాసనములు, దంతపురమును గూర్చి చెప్పి నట్లే, కళింగ నగరము త్రివిష్టపమును మించినదను చోడగంగుని తామ్రపట్టికలలోని వర్ణనమును సమర్థించుచున్నవి. కళింగ నగ రము 'సర్వఋతు సుఖ రమణీయ'మని శాసనములు పదేపదే చెప్పుచున్నవి. దంతపురమువలెనే; కళింగ నగరము కూడా 'విజయ కళింగ నగర'మని, అమర పురానుకారిణి' అని వర్ణింపబడినది.[26] గాంగ సంవత్సరము 397నాటి దేవేంద్రవర్మ విడివలస తామ్ర పట్టికలు, కళింగ నగరము అనేక దేవకులములతో నిండి, విస్తార సామ్రాజ్య మహిమతో కూడి, అతల తిలకమై అమర పురము ననుకరించుచున్నదని చెప్పును. (శ్రీమదనేక దేవకుల లులా

దమర వు నుకారిణ కల్పాంత సంకలితా వనల్ప సామ్రాజ్య మోహితా మహా సుమమహిమ్నో మతల తిలకాత్).[27] శక. 1103 నాటి దేవేంద్రవర్మ కంబకాయ తామ్రపట్టికలు సర్వమతా సుఖ రమణీయమైన ఆ నగరము సుధాధవళ ప్రాసాద పంక్తులచే, దోర్దండ పండితులచే, సేనాబలముచే అలంకృతమని చెప్పు చున్నవి.[27a]

అనంతవర్మ చోడగంగుని మలి పరిపాలనా వత్సరములలో, క్రీ. శ. 1134 ప్రాంతమున, తూర్పుగాంగ రాజధాని కటకము నకు మార్చబడినది.[28] ఈ మార్పువలన దంతపుర, కళింగ నగర ములు తమ రాజకీయ ప్రాధాన్యమును కోల్పోయి, కాలక్రమమున తమ వైభవమును పోగొట్టుకొని, క్షీణించి, నిర్జనములైపోయినట్లు తోచును.

## క ట క ము

జగన్నాధ దేవాలయ కైఫీయతు అగు మాదలాపాంజి అను ఒరియా గ్రంధము అనంతవర్మ చోడగంగు తూర్పు గాంగుల రాజ ధానిని వంశధారానది ఒడ్డునవున్న కళింగ నగరము (ముఖలింగము, శ్రీకాకుళము జిల్లా)నుండి, మహానది ఒడ్డునవున్న కటకము (కటక్)నకు మార్చెనని చెప్పను. చోడగంగుని కాలమున, ఉత్తర మున గంగనుండి దక్షిణమున గౌతమివరకు విస్తరించి వున్న విశాల సామ్రాజ్యపు సైనికావసరములనుబట్టి, ఈ రాజధాని మార్పు జరిగినట్లు తోచును. 'కటకము' అను పేరు ఆ ప్రదేశము మొదట గాంగ సైన్యముల శిబిరావాసమని సూచించును.[29] అర్వాచీన తూర్పుగాంగుల కాలమున దీనిని ఎక్కువగా వారణాసి కటకమను పేరుతో పిలిచిరి. దాదాపు అన్ని అర్వాచీన గాంగ శిలా శాసనములలో ఈ నగరము వారణాసి కటక మనియే పేర్కొనబడినది. ఇది గజ పతుల కాలమునకు (క్రీ. శ, 1434 – 1538) దాని సంక్షిప్త నామ మైన 'కటకము' అనుపేరుతో పిలువబడుట జరిగినది. అనే కములైన వీరి శిలాశాసనములలో, శక 1309 నాటి ఒకే ఒక సింహాచల శిలాశాసనమున ఇది 'కటకము' అని చెప్పబడినది.[30] శ. 1375నాటి మరియొక సింహాచల శిలా శాసనమున ఇది "రాజా కటక"మని పేర్కొనబడినది.[31] బహుశా రాష్ట్ర రాజధానులైన (Provincial capitals) పొట్నూరికటకము[32] మొదలగు వాని నుండివేరుపరచుటకై దీనిని 'రాజాకటక' మని (Royal capital) పేర్కొనుట జరిగి యుండవచ్చును. శ. 1375 (క్రీ. శ. 1453)నాటికి సూర్యవంశ గజతులు కటకమునుండి పాలించు చుండిరి. అర్వాచీన తూర్పుగాంగుల శాసనములలో పైన పేర్కొ నిన శ. 1309 (క్రీ. శ. 1387) నాటి ఒక్క సింహాచల శాసన మందు మాత్రమే వారణాసి కటకను, 'కటకము' అని పేర్కొన బడుట జరిగినది.

అర్వాచీనతూర్పు గాంగ శిలా శాసనములలో వారణాసి కటకమును మొట్టమొదటగా పేర్కొనిన శిలా శాసనము శక. 1035 (క్రీ. శ. 1113) నాటి సింహాచల శాసనముగా కన్పట్టు చున్నది.[33] దీనిని బట్టి క్రీ. శ 1113 నాటికే చోడగంగు రాజధానిని కటకమునకు మార్చినాడనుకొనవలెను. కాని ఇది చోడ గంగుడు క్రీ. శ. 1134 ప్రాంతమున రాజధానిని కటకమునకు మార్చినాడని చెప్పు మాదలాపాంజి కధనమును వ్యతిరేకించును కాని క్రీ శ. 1113 నాటికే ఈ మార్పు జరిగినదని చెప్పటకు ఆధారములు కలవు. శక. 1034 (క్రీ. శ. 1112) నాటి చోడగంగుని కొర్నితామ్ర పట్టికలలో అతడు పరమవైష్ణవుడుగా చెప్పబడినాడు.[34a] ఇది చోడగంగునికి జగన్నాధముతో అనటి దైవము పురుషోత్తమ - జగన్నాధునితో ఏర్పడ్డ అనుబంధమును సూచించును ఇంతేకాక, చోడగంగుని ఇతర తామ్ర పట్టికలలో కళింగ నగరమునుండి అవి వెలువరింపబడ్డవని చెప్పబడగా, కొర్ని తామ్ర పట్టికలు వెలువరింపబడ్డ స్థలము పేర్కొనుట జరుగ లేదు. ఇంతేకాదు; కొర్ని తామ్ర పట్టికలలో చోడగంగుడు పరమవైష్ణవుడుగా మాత్రమేగాక పరమ మాహేశ్వరుడుగా కూడ చెప్పబడియుండగా, శ. 1040 (క్రీ.శ. 1118) నాటి అతని విశాఖపట్నం తామ్ర పట్టికలు అతనిని పరమవైష్ణవుడుగా మాత్రమే పేర్కొని పరమమాహేశ్వర బిరుదమును వదలివేసినవి[34] శక. 1035 (క్రీ. శ. 1113) నాటికి చోడగంగుడు రాజధానిని కటకము మార్చినాడనుకొన్నను, లేదనుకొన్నను, పైన పేర్కొనిన క్రీ. శ. 1113 నాటి సింహాచల శాసనము. ఆ నాటికి వారణాసి కటకము లేక కటకము, తూర్పు గాంగ శాసనములలో రాజకీయ ప్రాధాన్యమును సంతరించు కొనుచున్న నగరముగా కనబడ ప్రారంభమైనది.

ముస్లిం చరిత్రకారులు కటకమును "బనారసి" లేక "కటక్ బనారస్" అని పేర్కొన్నారు.[35] షమ్స్–ఇ–సిరాజ్ అఫీఫ్ రచించిన "తారీఖ్–ఇ–ఫిరోజ్ షాహి" యందు ఇట్లు చెప్ప బడినది : "గర్వోద్ధతులైన ఈ (ఒరియా) రాజుల చిరకాల ఆవాసమైన బనారసీ నద్ద సుల్తాన్ ఫిరోజ్ విశ్రమించినాడు. అప్పుడు జాజ్‌నగర్ రాజుగానున్న అడాయ, బనారసీ విడిచిపోవుట మేలనితలచి, వేరొక చోట నివసించెను. సుల్తాన్ ఫిరోజ్ అతని ప్రాసాదము నాక్రమించినాడు.[35a] ఇంకను, "బనారసీయందు రెండు కోటలు కలవు. ప్రతిదానియందు చాలమంది ప్రజలు నివసించి యుండిరి."[36] "రాజులు బ్రాహ్మణులు. జాజ్‌నగర్ నందు రాజ పదవికి వచ్చెడి వారందరు ఈ కోటలను బలపరచుట తమ పవిత్రధర్మముగా భావించిరి. ఇట్లు అవి విస్తరించినవి."[37] బనారసీ నిర్మితమైన స్థలమును గూర్చి "తారీఖ్–ఇ–ముబారక్ షాహి" అను గ్రంధము ఇట్లు చెప్పను: "(ఒరియా) రాయల నివాసస్థానమైన బనారసీ, నగరమువైపు సుల్తాన్ (ఫిరోజ్‌షా) నడచినాడు. మహానదని విడిచి (ఒరియా) రాజు తిలాంగ్ వైపు పారిపోయినాడు "[38]

తూర్పు గాంగ శాసనములలో గల కళింగనగర వైభవ వర్ణనలతో పోల్చిచూచినపుడు, కటకమును గూర్చి తూర్పుగాంగ,

గజపతి శాసనములలో గల వర్ణనములు మిక్కిలి పరిమితమని చెప్పవలెను. తూర్పుగాంగ శాసనములలో ఈ నగరమును గూర్చి ఎట్టి వర్ణన లేదు. కపిలేశ్వర గజపతి (1434–1468) రాజ ప్రతినిధిగా కొండవీట (దండపాట)ను పాలించిన గాణదేవుని కొండవీటి తామ్రపట్టికలలో, ఈ కటకమును గూర్చి "కటకస్యపురియస్య రాజధానీ విరాజితే మహానదీ పరిసరే శక్రస్యేవ అమరావతీ" అని మాత్రము చెప్పబడ్డది [39]. బెజవాడ యందలి శాసనమొకటి, "చేషష్టి విద్యాకర కటక పట్టణ' సింహాసనమందు శ్రీ వీరరుద్ర ప్రతాప దేవుడు(ప్రతాపరుద్ర గజపతి 1497-1538) పాలించుచున్నాడని, ఈ నగరమును అరువది నాలుగు కళలకు నిలయముగా చెప్పినది. [40] ప్రతాపరుద్ర గజపతి విరచితముగానున్న సరస్వతీ విలాసము కటకమును, వైభవమున మిగిలిన ప్రసిద్ధ భారతీయ నగరములతో సరితూగునదిగను అమరావతీ ప్రతిబింబముగను వర్ణించినది ("అయోధ్యామివాయోధ్యాం, మధురా మివమధురాం, ద్వారవతీ మివద్వారవతీం, అవన్తీమివాన్తీం, మాయామివమాయాం, వారణాసి కామివ వారణాసికాం, ఇపిచ కాశిమివ విశ్వేశ్వరాధిష్టితాం, అయోధ్యామివ ఇక్ష్వాకు సన్మార్గాం, కాఞ్చమివ కమకోటి పుణ్యకోటి సమేతాం, మధురామివోగ్రసేన పరిపాలితాం, ద్వారవతీమివానక దున్దుభిఘోషా సమేతాం, మహానదీజల మధ్య మధ్యాసీనాం, అమరనదీ ప్రతిబిమ్బమివ భూకాన్తాకటీ కఙ్కటక నగరీం".) [41]

## రాష్ట్రరాజధానులు

గజపతుల కాలమున, దండపాటలు అని పిలువబడ్డ రాజ్య విభాగములు రాజధానులై, రాజప్రతినిధి అధిష్ఠితములగు, కొండవీడు, రాజమహేంద్రవరము మొదలగు నగరములు, వైభవమున, సామ్రాజ్యమున కంతను రాజధానియైన కటక నగరముతో పోటీ పడినట్లు కనపడును కపిలేశ్వర గజపతి ప్రతినిధిగా, కొండవీడు నగరము అధిష్టానముగ, కొండవీటి దండపాటను గాణదేవుడు పరిపాలించినాడు. శ. 1377 నాటి గాణ దేవుని కొండవీటి తామ్రపట్టిక యందు, కొండవీడు, వ్యాపార సమృద్ధితో కూడిన విపణి వీథులు ఎల్లప్పుడు రథ గజ తురగ,పదాతులచే అలరారి, అమరావతిని పోలినదని వర్ణింపబడ్డది. ["సా కొండవీడు నగరీ విపణిస్థ పణ్యా త్రేత రాయ పరిపాలిత రాజధానీ దేవాలయ బలభిదో నగరీవ భాతి శశ్వద్ గజేంద్ర రథవాజి పదాతి రమ్యా."] [42] మిగిలిన రాష్ట్ర రాజధానుల వర్ణనలు మనకు లభించక పోయినను, వాని వైభవము కూడ కొండవీటి వైభవమునకు తగ్గక యుండెడిదని చెప్పవచ్చును.

## జ్ఞాపికలు

1. అనంతవర్మ చోడగంగు రాజధానిని కటకమునకు మార్చిన కాలమును గూర్చిన చర్చకు, క్రింద "కటకము" శీర్షిక క్రింద చూచునది.

2 "అనంతవర్మ చోడగంగుని కొర్ని తామ్రపట్టికలు. శ. 1034" కళింగదేశ చరిత్ర, (కదేచ), అనుబంధము, పు. 68; భారతి, 1925, నవం, పు. 101 మొ.

3. చూడు, కదేచ, పు. 123.

4. Rapson, The Cambridge History of India, I, పు. 123.

5 కదేచ, పు 251, 551.

6. అదే, పు 268–269 లు

7. అదే, పు. 123, 233. పాడుబడ్డ ఈ కోట వర్ణనకు, చూడు, Annual Report on Epigraphy: 1921–22

8. దక్షిణ హిందూదేశ శాసనము (దహింశా), V.1086

9 అదే, V. 1084.

10. VI. 1189.

11. ఎపిగ్రాపియా ఇండికా [ఎఇ], XI, పు. 147–154లు. కొందరిచే దంతాపురముగ గుర్తించబడిన జగన్నాధపురి మూడవ వజ్రహస్తుని రాజ్యమున లేదను విషయము ఇచట గుర్తించవలెను.

12 'అనంతవర్మ చోడగంగుని కొర్ని తామ్ర పట్టికలు; శ. 1034'–కదేచ, అను. పు. 68; భారతి, 1925, నవం, పు 101 మొ.

13. ఎఇ, XXV, పు.101. మొ.

14. కదేచ, అను. 80; భారతి, 1927, నవం, 115 మొ.

15. పైన. జ్ఞాపిక. 2. చూచునది.

16. కదేచ, అను. పు. 37. 'ఇంద్రవర్మ జిర్జింగి తామ్ర పట్టికలు, గాంగ వత్సరము. 39'

17. 'ఇంద్రవర్మ పుర్ణి తామ్ర పట్టికలు; గాంగవత్సరము 149; కదేచ, అను పు 40

18 అనంతవర్మ చోడగంగుని కొర్ని తామ్రపట్టికలు, శా. 1034' కదేచ, అను, పు. 69; భారతి, 1925, నవం పు. 101 మొ.

19 దేవస్య శంభోర్మధూక సముదయస్య ఆదిమూర్తే'– అని శ. 1065 నాటి ఒక ముఖలింగ శాసనము మధూకేశ్వరుని వర్ణించినది దహింశా, V 1111

20. 'అనంతవర్మ చోడగంగుని కొర్ని తామ్ర పట్టికలు, శ. 1034' కదేచ, అను. పు. 69; భారతి, 1925, నవం. పు. 101 మొ.

21. దహింశా, V. 1008–1148. ముఖలింగముతో కళింగనగరము గుర్తింపుకు సంబంధించి చూడు, Madras Journal of Literary Society, 1889–1894, పి. 68; ఎఇ, IV. పు. 183 మొ॥ కదేచ, పు. 195–237.

22 'హస్తివర్మ ఉర్లాం తామ్రపట్టికలు, గాంగ సంవత్సరము, 80'–కదేచ, అను 34.

23. కదేచ, అను పు. 37; ఎఇ, XXV, పు. 281 మొ.

24. భారతి 1934, సెప్టెం, 461 – 466; ఎఇ, XXIII, పు. 62–67లు.

24 ఎ. కదేచ, అను; పు. 34.

25. ఎఇ, XXVII, పు. 216 మొ.

26. "నందవర్మ శాంత బొమ్మలి తామ్రపట్టికలు, గాంగ సంవత్సరము, 221", కదేచ అను. పు.43 ఈ తామ్ర పట్టికలలో కళింగ నగరము, 'అమరపురానుకారిణ సర్వర్తు సుఖరమణీయాద్విజయవత్ శ్రీ కళింగ నగరవాసకాన్" అని ప్రస్తుతింపబడ్డది.

27. కదేచ, అను పు. 46

27ఎ. అదే, పు. 80. "అమర పురానుకారిణ సర్వర్తు సుఖరమణీయాత్ సుధావళ ప్రాసాద మాలావిరత లాలిత లోకాత్ దోర్దాండ పండిత సులాలాలం కృత శ్రీ కళింగ నగరాధి వాసకాత్.

28 "కటకము" శీర్షిక క్రింద చూచునది.

29. చూడు, D. C. Sircar, Some facts of Early Orissan History, Journal of Indian History, XXXIV, P 275.

30. దహింశా, VI.929.

31. అదే, VI. 1050.

32. అదే; VI. 786, 790. 1078.

33. అదే, VI. 756.

33 ఎ కదేశ, అను పు. 72; భారతి, 1925, నవం, పు. 101.

34 Indian Antiquary, XVIII, పు.165–172లు

35. History of India (Eliot and Dowson) III P 312, IV II; V 386·

35ఎ. అదే III పు. 312.

36. Eliot and Dowson, III 312 as corrected by Hodivala, Studies in Indo-Muslim History (1957) II 198

37. Eliot and Dowson, III. 313.

38· అదే, IV పు 11,

39 Indian Antiquary, XX, పు. 390.

40. దహింశా, × 737.

41. సరస్వతీ విలాసమ్, పు 11

42 Indian Antiquary, XX పు. 393.

# కవి - పక్షి

## శ్రీ జి. రామశేషయ్య

చీకటి గూటి నుండి
వేకువ వెలుగును దర్శించి
లోకాన్ని మేల్కొల్ప దలచి
స్వేచ్ఛా పక్షాలతో ఎగిరి
ఇచ్ఛాగానం చేసే
పక్షిని మించిన 'కవి' ఎవరు ?

పక్షికీ కవిత్వానికీ
అవినాభావ సంబంధం

ఆదికవి అవతరణకు
జంట పక్షులే కదా
కారణం — ప్రేరణం
కూలిన జంట మగపక్షిని
చూసిన ఒంటరి పెంటి పక్షి
చేసిన రోధన ధ్వనిలో
దాగిన భావం వాల్మీకి మాటల్లో
మాగి అక్షరాల్లో తూగి
అది కవిత్వంగా — ఆది కవిత్వంగా
రూపొంది స్మరణీయమౌతున్నది.

అలతి అలతి పలుకులతో కవి
రస పర్వాలు పండించినట్లు
పుల్లా పుడకతో పక్షి
అక్షిపర్వంగా అల్లుతుంది గూడు

కవి

శిఖరాల ఔన్నత్యం — లోయల అగాధతత్వం
అందుకున్నట్లు — తెలుసుకున్నట్లు

పక్షి సైతం
శిఖరాలపై నిలువగలదు
లోయలలో వాలగలదు
భావ పక్షాలతో ఎగిరి
స్వేచ్ఛగా పాడే కవిలాగే

స్వీయ పక్షాలతో ఇచ్ఛాగానంతో
స్వేచ్ఛగా ఎగురుతుంది పక్షి.

గుండె గూటి నుండి
అమూర్త పక్షి బృందాన్ని
అక్షరాకాశంలో విహరింపజేసే
మానవుడు 'కవి'

జమదగ్ని

# సాహిత్య వీరుల గుండెలలో కొండలు

గుండెలలో కొండలనగానే భయం వేస్తుంది. అది అనవసరం. అన్ని భయాలూ అజ్ఞానం వల్లనే కలుగుతాయి. సాహిత్య వీరులు సర్వజ్ఞులవడం చేత వారి గుండెలలో ఎంత పెద్ద కొండలైనా కరిగి నీరైపోయి లోకాల కాహ్లాదాన్నే కలిగిస్తాయి.

మహాకవి కాళిదాసు తన కుమార సంభవాన్ని హిమవత్పర్వత ప్రశంసతో ప్రారంభించాడు. అది ఆయనకు పట్టి కొండకాదు.

అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ తోయనిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః ॥.

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వంతి రత్నాని మహౌషధీంశ్చ
పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్॥

ఆ హిమవంతుడు దేవతాత్ముడైన నగాధిరాజు. గోరూప ధారిణియైన భూమాతకు ముద్దుబిడ్డ. జగజ్జననియైన పార్వతిని కన్నతండ్రి. అనంత రత్న ప్రభవుడూ, సర్వ మహౌషధీ నిలయుడూ!

అచేతనమైన కొండ చేతన మెట్లా అవుతుంది? ఇది కేవల తార్కికులకు గుండెలలో అడ్డుపడే కొండ వంటి ప్రశ్నే! చరాచర జగత్తు సమస్తమూ జీవ స్వరూపమే అని నిశ్చయాత్ములైన తాత్త్వికులకీ ప్రశ్నే పుట్టదు. అఘటన ఘటనా పటీయసియైన మాయ కధీశ్వరుడైన పరమేశ్వరుడు చేయలేని దుంటుందా? ద్రోణంలో, శరస్తంభంలో, మత్స్య గర్భంలో, మృగీ గర్భంలో మహర్షులే మహానుభావులను సృజింప జేయగలుగుతున్నప్పుడు పరమేశ్వరి పర్వతానికి పుత్రికగా జనింప లేదా?

తరతమ భేదాలతో వ్యక్తమవుతూ ఉండడమూ వ్యక్తం కాక పోవడమేగాని అంతా చిన్మయమే! అందుచేత శిలాదేహాలు గల కొండలు కూడా జీవులే! పూర్వం వాటికి రెక్కలు ఉండేవట. వాటితో అవి యథేచ్ఛగా తిరిగి తిరిగి తోచిన చోట నల్లావాలి లోకాలకు ఉపద్రవం కలిగిస్తుండేవట. ఇంద్రుడు వజ్రా యుధంతో వాటి రెక్కలు నరికి కదలకుండా పడి ఉండేటట్లు చేశాడట! హిమవంతుని రెక్కలూ తెగిపోయాయి. అతని కుమారుడు మైనాకు డొక్కడే తప్పించుకున్నాడు అదృష్టం కొద్దీ!

అతన్ని గూర్చి రామాయణంలో వాల్మీకి గొప్పగా చెప్పాడు. హనుమంతుడు సముద్ర లంఘనం చేస్తుంటే రామదూత అయిన అతనికి సహాయ పడాలని సముద్రుడు మైనాకునితో "బాబూ! నువ్వు కొంచెం లేచినిలబడి ఆ వెళ్ళున్న పుణ్యాత్మున కాతిథ్యమియ్యి. ఆయన కొంచెం విశ్రాంతి తీసుకుని నీ ఆతిథ్యంతో శక్తిమంతుడై రామ కార్యాన్ని సాధిస్తాడు. నేనా రఘువంశానికి ఎంతగానో ఋణ పడి ఉన్నాను. నా జన్మకే వాళ్ళు కారణం. ఈ విధంగానైనా వాళ్ల ఋణం కొంత తీర్చుకుంటాను" అని బతిమాలాడు. ఆ మాటలు విని మైనాకుడూ ఆలోచించాడు. పర్వతాల్లో మహా మహులు రెక్కలు తెగి కూలి పోతున్నప్పుడు తాను తప్పించు కోగ[illegible]గింది వాయుదేవుని సహాయం వల్లనే. వాయు పుత్రుడైన హనుమంతున కాతిథ్యమిస్తే తన కృతజ్ఞతా తెలుపుకున్నట్లవుతుంది, రామ కార్యానికీ తోడ్పడ్డట్లవుతుంది. సరేనని మైనాకుడు మంచి మంచి పళ్లన్నీ నెత్తికెత్తుకుని హనుమంతుని మార్గంలో పైకి లేచాడు. ఏదో అడ్డు వస్తోందని చెయ్యి విదిలించాడు పావని దానికే మైనాక శిఖరం చిట్లిపోయింది. పుణ్యానికి పోతే పాపమెదురైన అనుభవం తటస్థించినా మైనాకుడు బెదరక హనుమంతున కసలు విషయం చెప్పి, ఆతిథ్యం స్వీకరించుమని అభ్యర్థించాడు. హనుమ తన దురుసు తనానికి పశ్చాత్తాపం ప్రకటించి, తన దీక్ష తెలియజెప్పి, రామ కార్యం విలంబాన్ని సహించదని ముందుకు వెళ్లిపోయాడు.

ఎవరీ సముద్రుడూ, మైనాకుడూ? వాళ్లు జడ పదార్థాలా? వాళ్లకున్న వివేకం మనుష్యుల కుంటుందా? మహాకవి చిత్రణలో వాళ్ళు దేవత లనిపించడం లేదూ! చైతన్యం వ్యక్తమవుతున్న ప్రయోజనాన్ని పరాకాష్ఠ నంగించి చిత్రించాడు వాల్మీకి!

గుండెలో బండ పడ్డా పరవాలేదుగాని గుండె బండ కాకూడదు. ప్రతిదాన్నీ పదార్థ దృష్టితోనే చూచే పరమాణు యుగంలో ముదిరిపోతున్న అనర్థమే ఇది. సర్వమూ చిన్మయ మనుకున్న పూర్వులు గుట్టనూ పుట్టనూ చేతనాలుగానే భావించి పరమోన్నత వివేకంతో పరమార్థాన్నే అందుకుంటే కనిపించే దాన్ని మాత్రమే నమ్మే నవీనులు తమకు తెలియకుండానే కఠినాతి కఠిన హృదయులవుతున్నారు. సిద్ధాంతాల పేరుతో మారణహోమాలు చేస్తున్నారు. మానవత పేరుతో దారుణ రాక్షసు లవుతున్నారు. విజ్ఞానం పేరుతో విశ్వ విలయకారు లవుతున్నారు

కాగా మన పూర్వులకు కొండలు వట్టి బండలు కావు. వాటిలో కుల పర్వతాలున్నాయి. అవి పర్వత వంశకర్తలు. ఎందరో పుణ్యజీవులు భగవదనుగ్రహానికి పాత్రులై యోగంతో శిలాదేహాలు

ధరించి అలా పడి ఉంటున్నారు. మల్లికార్జునస్వామిని శిరసా వహిస్తున్న శ్రీశైలమూ, వేంకన్నను తాలుస్తున్న శేషాచలమూ, రాముణ్ణి ధరిస్తున్న భద్రాచలమూ అట్టి పుణ్యజీవులే!

మాయా మానుష విగ్రహుడైన శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై అరణ్యవాసం చేస్తూ రమ్యమైన గోదావరీ తీరంలో ప్రత్యణువును పరమపవిత్రం చేశాడు తన విహారంతో! గోదావరీ తీరం సీతారాముల లౌకిక సంయోగ వియోగాలు రెంటికీ సాక్షీ భూతమై వారి దివ్య చరిత్రను నేటికీ స్మృతికి తెస్తూనే ఉన్నది. రామచంద్రుడొకనాడు ఎండలో తిరిగి తిరిగి ఒక చెట్టు క్రింది నీడలో విశాలమైన చట్టుబండ ఒకటి ఉంటే దానిమీద ఆసీనుడయ్యాడు. అక్కడ కాసేపు విశ్రమిస్తే ఆయనకు బడలిక అంతాపోయి ఉల్లాసం కలిగింది ఆ మహానుభావున కావిధంగా పరిచర్య చేసిన ఆ బండ జీవితం ధన్యమైంది. మహాత్ములకు తెలిసిగాని, తెలియకగాని జీవులు చేసే పరిచర్య వృథాపోదు గదా! శ్రీరామచంద్రుడు సంతోషించి ఆ బండనుద్దేశించి మాకు శ్రమాపనోదం కలిగించావు కాబట్టి త్వరలోనే నీవు మేరు పుత్రుడవై మహాభక్తుడవు కాగలవని అనుగ్రహించాడు. మేరువు ధర్మపత్నితో కలిసి సంతానం కోసం బ్రహ్మను గూర్చి ఆ సమయంలోనే తపస్సు చేశాడు. శ్రీరామచంద్రుని అలసట నివారించిన ఆ బండయే మేరు పత్ని గర్భాన భద్రుడుగా అవతరించింది. ఆ భద్రుడు పూర్వజన్మ విజ్ఞానంతో పుట్టి శైశవంనుండే పరమభక్తుడై పరమ పురుషార్ధమైన ముక్తినే కోరి శ్రీరామచంద్రుని గూర్చి అతి తీవ్రమైన తపస్సు చేశాడు. పూర్వజన్మలో బండ. ఈ జన్మలో కొండ. అయినా నిశ్చేతనమైన జడ ప్రకృతి కాక జ్ఞానయుతుడై తపస్సు చేయడం! ఎంత విచిత్రమైన సన్నివేశమిది! చుట్టూ పుట్టలు పుట్టి పుట్టంబుట్టు వనిపించుకున్న వాల్మీకి తపస్సు కంటే పుట్టుకతో చట్టై ఆరాధ్య దైవమనుగ్రహించేవరకు ఏ కొంచెమూ కదలిక పొందక బండగానే ఉండిపోయిన భద్రుని తపస్సే అధికమేమో! భక్త వత్సలుడైన శ్రీరామచంద్రుడు భద్రుని తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై కావలసిన వరం కోరుకో మన్నాడు. ఆ భద్రుడెంత వివేకియో చూడండి. పరమేశ్వర దర్శనంతో అణువణువు పుల్కరించిన శరీరంతో మహాభక్తుడైన ఆ భద్రుడు స్వామికి ముమ్మారు ప్రదక్షిణించి ఎంతో కష్టంమీద గొంతు పెగుల్చుకుని "స్వామీ! నీవు కోరుకోమన్నావేగాని నాకేమి తెలుసు. నేను వట్టి బండను. నీ మాహాత్మ్యం నేను తెలుసు కోగలనా? ప్రహ్లాదుడు నీ సర్వ వ్యాపకత్వాన్ని తెలుసుకున్నాడు. నీ మూర్తి యోగ పురుషులకు విదితమైంది నీ మహిమ సనకాదులకు తెలుసు నీకు సేవ చేయడం ఆంజనేయునకు తెలుసు. నీ యందు భక్తి చూపడం శబరికి మాత్రమే తెలుసు. నీ చరణరజః ప్రభావం గౌతమసతి అహల్య ఎరుగును భరత లక్ష్మణ విభీషణ విశ్వామిత్ర వసిష్ఠాంగదాదులు నీ యితర విశేషాలు తెలిసిన ధన్యాత్ములు. వట్టి జడుడనైన నాకు నిన్ను గూర్చి ఏమి తెలుసు? నాకు ఏ వరమూ వద్దు. నన్ను నీలో కలిపేసుకో" అని ఏమీ తెలియదంటూనే అన్నీ తెలిసిన విజ్ఞుడై సాయుజ్యమే కావాలని ప్రార్థించాడు. శ్రీరామచంద్రుడతని భక్తి భరిత వివేకానికి సంతోషించి "నీవు నిష్కాముడవని నాకు తెలుసు అయినా నా సాకార దర్శనం వృథా కావడానికి వీలు లేదు ఏదో ఒక వరం కోరుకో" మని నిర్బంధించాడు. అప్పటికీ భద్రుడు మెత్తపడక "ఏ కోరికకోరితే అన్నికోరికలూ నశిస్తాయో, అట్టి కోరిక" నను్గ్రహించవలసిందని మనవి చేశాడు. ప్రక్కనున్న సీతామహాతల్లికి రామచంద్రుడు చేస్తున్న భక్తపరీక్ష కఠినమనిపించింది. ఆమె ఊరుకోలేక కల్పించుకుని భద్రునకు భద్రమిమ్మని ప్రార్థించింది. "వరం కోరమంటే కోరడంలేదాయె నేనేంచేస్తా" నన్నాడు రాముడు. "నిన్ను దైవమని నమ్మి శిరసు వంచి నమస్కరిస్తే నెత్తిన కాలు పెడ్తా" వని అధిక్షేపించింది తల్లి "అవును. అలా చేసినందువల్లనే గదా బలికి బంటునై ఉంటున్నా నిప్పటికీ" అన్నాడు రాముడు. "ఓహో అదా సంగతి. ఇతన్ని గూడా అలా చేయదల్చుకున్నారన్నమాట. మీ రెంత గడసరులండీ" అంటూ ఆ తలి "బాబూ! భద్రా! నీ వంచిన తల ఎత్తక అలాగే ఉండిపో. ఈ మహానుభావులు నీ నెత్తిన కాలుపెట్టి నీకు భద్రం కలిగిస్తారట' అని వేళాకోళం చేస్తున్నట్లు గానే భద్రుడు ఆ కోరికనే కోరేటట్లు చేసింది. "మా అమ్మ సీతతో నిజంగానే నా తలమీద కూర్చుని నిన్నూ నన్నూ సేవించే వారి కోరికలు తీరుస్తూ చిట్టచివరికే నాకు మోక్షాన్ని"మ్మని ఆ భద్రుడు కోరాడు. అతని కోరిక ననుసరించే సీతాలక్ష్మణ సహితుడై భద్రగిరి శిరః ప్రదేశ మధివసించి శ్రీరామచంద్రుడు భద్రాది రాముడయ్యాడు. పరమభక్తుడైన భద్రుడు భక్తానుగ్రహార్ధ మవతరింప నెంచిన రాముని కోరికను తీర్చడానికి అమ్మ సూచనతో ఆ కోరిక కోరేడేగాని అతనికే కోరికలూలేవు. ఓయి భద్రా! భక్తిఅంటే భక్తి నీదేనయ్యా! తక్కినవారిభక్తిలో ఎంతకాదన్నా ఏ కొంచెమో చాంచల్య ముంటుంది. నీవు అచల భక్తుడవు దైవ మంటే దైవం శ్రీరామచంద్రుడొక్కడే! బండలకూ కొండలకూ ముక్తి ననుగ్రహించే దైవం నమ్మి కొలిస్తే బుద్ధిగల మానవుల కియ్యడా? ఈ రామ మాహాత్మ్యన్నే రామదాసు దాశరథీ శతంకలో ఏనుగెక్కి చాటించాడు, నేటికీ చాటిస్తున్నాడు! (ఈ కథ భవిష్యోత్తర పురాణంలోని గౌతమీ మాహాత్మ్య ఖండంలో ఉన్నది).

వామాంక స్థిత జానకీ పరిలసత్<br>
    కోదండ దండం కరే<br>
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే<br>
    శంఖం శరం దక్షిణే<br>
బిభ్రాణం జలజాత పత్రనయనం<br>
    భద్రాద్రి మూర్ధ్నిస్థితం<br>
కేయూరాది విభూషితం రఘుపతిం<br>
    సౌమిత్రి యుక్తం భజే!

ఇదీ భద్రుణ్ణి అనుగ్రహించిన రామస్వరూపం!

ఆదికవి నన్నయ్య కద్రూవినతలు చూచిన సముద్రాన్ని వర్ణిస్తూ—

> అలఘు ఫణీంద్రలోక కుహరాంతర దీప్తమణిస్ఫురత్ప్రభా
> వలి గలదాని శశ్వదుదవాస మహావ్రత శీత పీడితా
> చల ముని సౌఖ్యహేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబుఁ న్
> వెలిగెడు దాని గాంచి రరవింద నిభానన లమ్మహోదధిన్॥

అన్నాడు. ఇందులోని అచల మునులన్న రూపకం సముద్రంలోని కొండలను మునులనే చెప్తున్నది. ఎల్లప్పుడూ నీళ్ళల్లో ఉండాలన్న మహావ్రతాన్ని పాలిస్తూ చలికి బాధపడుతున్న కొండలనే మహా మునులకు వెచ్చదనాన్ని సమకూర్చి సౌఖ్యహేతు వవుతున్న బడబాగ్ని శిఖలతో ఆ సముద్రం వెలుగుతోందట! కొండలనే మునులా? కొండలవలె ఉన్న మునులా? చలీ, సుఖమూ అంటున్నందువల్ల రెండవ విధంగా అనుకోవడంలోనే ఔచిత్య మెక్కువ.

చైతన్యం అంతటా ఉన్నదని తెలిసి కొండలూ జీవులే అని అంగీకరిస్తే అన్ని కొండలూ మునులే కావలసిన అవసరంలేదు. మనుష్య ప్రపంచంలో ఎంత వైవిధ్య మున్నదో అక్కడా అంత ఉన్నది. కామక్రోధాలు రాగద్వేషాలు అన్ని భావాలూ కనిపిస్తాయి.

ఆంధ్రసాహిత్యంలో అగస్త్యుడు చేసిన వింధ్య గర్వ దమనాన్ని చాలామంది కవులే వర్ణించారు. స్కాందాన్ని అనుసరించి కాశీ ఖండంలో శ్రీనాథుడు ప్రపంచించి చెప్తే...వాల్మీకాన్ని అనుసరించి విశ్వనాథ స్వీయ ప్రతిభా విశిష్టంగా చెప్పారు అగస్త్య మాహాత్మ్య పర్యవసాయకంగా దీన్ని స్మరించని ప్రాచీన కవియే లేడనుకోవచ్చు. శ్రీనాథుని చిత్రణలో ఎన్నో జీవిత రహస్యాలు ఆవిష్కృత మవుతాయి.

> కంటికి నిద్రవచ్చునె సుఖంబగునే రతికేళి జిహ్వకున్
> వంటక మించునే యితర వైభవముల్ పదివేలు మానసం
> బంటునె? మానుషంబుగల యట్టి మనుష్యున కెట్టివానికిన్
> గంటకుఁడైన శాత్రవుఁడొకండు తనంతటివాఁడు కల్గినన్॥

అంటుంది వింధ్యం. స్పర్ధకంతటి ప్రభావం ఉన్నది అనిపిస్తున్నది వింధ్య చేత అన్నమాటను గూడా మరిపించి కవిచేత మనుష్యునకనే అనిపించిం దా స్పర్ధ!

అగస్త్య దర్శనంతో ఆ విస్మృతి కవికీ వింధ్యానికీ తొలగిపోయింది.

> స్థావరంబైన రూపంబు జలదవీథి
> నావరించుచు మొదల నున్నట్లు యుండ
> జంగమంబైన రూపంబు నవదరించి
> యెదురుగా వచ్చె వింధ్య మహీధరంబు॥

> మొగులు ముట్టిన మహామూర్ధంబు ధరిమోవ
> బాదాంబుజములకుఁ బ్రణతిఁజేసి

ఇత్యాదిగా ఎంతో వినయంతో, భక్తితో ఆయన నర్చించి, తన గొడవ చెప్పుకొని ఆయన మాట మన్నించింది. అది సరేగాని ఆ వింధ్య యన్న మాటల్లో ఆ కవి సార్వభౌముని వ్యక్తిత్వం ప్రత్యక్ష రానా ప్రస్ఫుట మవుతుంది.

తెనాలి రామకృష్ణుడీ సన్నివేశాన్ని ఒకే పద్యంలో స్మరించినా చాల శక్తిమంతంగా చెప్పాడు. పుడిసిటఁబట్టెనే తపసి, కడుపున వేల్చెనే తపసి అంటూ రెండు పాదాల్లో ఆయన మాహాత్మ్యాన్ని చెప్పి యయ్యగస్త్యునిన్ బొడగని వింధ్యభూధరము బొరియప్తై నిక్కియున్న ఎండ్రకాయ చటుక్కున దిగిపోయినట్లు అడగిపోయిం దన్నాడు. విశ్వనాథ ఆ కథనంతటినీ అగస్త్య సోదరునిచే చెప్పించి వివరికొక మణిపూసలాంటి మాట అనిపిస్తారు.

> పర్వతాగ్రమ్మునను హోమ్ము పావకోళ్ల
> గుర్తులవి మీరు దారిగాఁ గొండదాటి
> వచ్చితిరి కద కని యుండవచ్చు మీరు
> అదియె మిగిలిన బంగార మద్రిపతికి॥

నదులన్నీ సాధారణంగా పర్వతాలలోనే ప్రభవిస్తాయి. అందుచేత నదీ పర్వతాలకు సహజంగా తండ్రీకూతుళ్ల సంబంధమే ఉంటుంది అయినా అన్యపర్వత ప్రభావాలయిన నదులను కొండలు ప్రేమించడంలో తప్పేమీలేదు. ''నదీనాం సాగరో గతిః'' అన్నట్లు అన్ని నదులకూ సాగరుడే భర్త అవుతున్నా సాగరేతరులకు భార్యలైన నదులు మన పురాణాలలో కనిపిస్తూనే ఉన్నాయి. శంతనుడు గంగను వివాహమాడాడు. వారి కుమారుడే భీష్ముడు.

వసుచరిత్రకారుడు శుక్తిమతీ కోలాహల వృత్తాంతాన్ని అత్యంత ప్రతిభతో నిర్వహించాడు. గిరికా జన్మవృత్తాంతాన్ని మంజువాణిచే చెప్పించేటప్పుడు నదీ పర్వతాలను నాయికా నాయకులను చేసి వారి శృంగారాన్నీ, వారికి కలిగిన ఆ గిరికయెడల ఆ తల్లిదండ్రులు చూసిన వాత్సల్య విశేషాన్నీ, నదీ పర్వత స్మృతిని అనుక్షణమూ కలిగిస్తూ ఎంతో చాకచక్యంగా వర్ణించాడు.

> సుమనోధివాస భాసుర శిఖోన్నతి వాఁడు
> ఘన సార తిలక వాసనల వాఁడు
> ఘన సంకు మద సాంద్ర గిండభాగమువాఁడు
> నవ పద్మ రాగ దంతముల వాఁడు
> కవితోపకంఠ నక్షత్ర మాలికవాఁడు
> హరి చందనచ్ఛాయ నమరువాఁడు
> తపనీయ మేఖలా ధాళధళ్యమువాఁడు
> మణిపాద వలయ ధామంబు వాఁడ
> నర్ఘ్య రత్నావళీ విచిత్రాంబరాభి
> రామ శృంగారముల వాఁడు హైమగర్భ
> గేహమున కేగువాఁడు కోలాహలాఖ్యుఁ
> డొక ధరాధీశుఁ డెదురయ్యె నుదిద కపుడు॥
> వేణి చలింపఁ, గంపిత నవీన మృణాళ భుజాగ్ర కంకణ
> శ్రేణి నటింప, లోల శఫరీ నిబిరీస కటాక్షకాంతి వి

స్వాణము చూప, హంసక గణ క్వణనమ్ములు మీఱ, సైకత
శ్రోణి వివర్తితాబ్జ ముఖశోభితయై కడు సంభ్రమించినన్॥

ఓహో! ఎంత అందంగా ఎదురయ్యారు ఒకరి కొకరు! ప్రవేశమే ఇంత పరమోచితంగా ఉన్నప్పుడు ప్రవర్తన మరింత రమ్యంగా ఉంటుంది. అదంతా అక్కడ చూడవచ్చు.

పోతనగారు గోవర్ధనాన్ని వర్ణించడంలో గాని, పెద్దనగారు హిమవంతాన్ని వర్ణించడంలో గాని వాటి చైతన్యాన్ని చెప్పవలసిన అవసరం వారికి లేకపోయింది. ఇంద్రయాగాన్ని మాన్పించి పర్వత పూజ చేయించేందుకు కృష్ణుడు శైలాకారాన్ని ధరించి గోపాలకులతో గూడి గోవర్ధనాన్ని పూజించి అర్పించిన నైవేద్యాన్ని తానే స్వీకరించి శైలమాహాత్మ్యాన్ని ప్రకటించినట్లు భాగవతంలో ఉన్నది.

సకలాభీరులు నీడె కృష్ణుఁడను నైజంబైన రూపంబుతో
నకలంక స్థితినుండి శైలమిదె మీ రర్చింప రండంచు దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో
పక దత్తాన్నము లారగించె విభుఁడా ప్రత్యక్ష శైలాకృతిన్॥

వినుఁడీ శైలము కామరూపి, ఖలులన్ వేధించు, నాజ్ఞాన్నముల్
మన మొప్పించిన నాహరించె, మనలన్ మన్నించెఁ జిత్తంబులో
నను కంపాతి శయంబుసేసె మనపై నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారు మందారుఁడై॥

యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు చెయ్యలేని దేముంటుంది? తర్వాత ఇంద్రుడు ప్రళయవర్షం కురిపిస్తే ఈయన గోవర్ధనాన్ని పూగుత్తిలా పైకెత్తి పట్టాడు, అది మహాఛ్ఛత్రంలా సర్వ గోకులన్నీ రక్షించింది.

పెద్దనగారికి మాత్రపు చైతన్య ప్రసక్తి గూడా తేవలసిన అవసరం లేకపోయింది. కళ్లకు కట్టేటట్లుగా ఆయన అక్కడి దృశ్యాల నెన్నింటినో చిత్రించాడు. అవన్నీ హిమవంతానికి కావు పెనుగొండ కొండలే అనే వాళ్లు చాలామంది ఉన్నారు. హిమవంతాని కావనడానికి ఎవరి కెంత అధికారమున్నదో వారే తేల్చుకోవాలి గాని వానలు కురుస్తున్న రోజులలో పెనుగొండ కొండను చూచిన వాళ్లకు మనుచరిత్రలో దృశ్యాలు స్మృతికి రావడం తప్పనిసరి.

ఒక ఆధునిక కవి అహల్యా వృత్తాంతాన్ని మనసులో పెట్టుకుని శిలాహృదయ భావన చేశాడు. గౌతమ మహర్షి శాపంతో అహల్య శిలాత్వాన్ని పొందింది. కాని ఆ శిలకు హృదయ మున్నది. అది రామదర్శనాన్ని కాంక్షించి పరితపిస్తూనే ఉన్నది. ఆ తపస్సు ఫలించినప్పుడే రామదర్శనం అయింది ఆమెకు. అయితే మహర్షి హృదయం బండవలె కఠినమైనందువల్లనే అట్టి శాపం పెట్ట గల్గె

గాడు అది ఆమె శ్రేయస్సు నపేక్షించిన శిక్షా కాఠిన్యమేగాని నాశనాన్ని కోరిన హింసాకాఠిన్యంకాదు. అందుచేతనే ఆమెకు శాపవిమోచనాన్నీ అనుగ్రహించాడు.

నా పతిగుండె బండయయి నన్నును బండగు మన్నమాట నా
లోపల గంటువెట్టి కదలున్ గలచున్ మఱివేచు నిత్యమున్
ఏ పలుకాడలేను కదలింపను చేతులు కాళ్లు నూరకే
లోపల తాపకుండములలోఁబడి కొట్టుక చత్తునంతియే !

*   *   *

రాముని స్పర్శయిచ్చు సకలమ్మని వింటిని క్రోధచాలనా
త్తామిత శీఘ్రవేగమున నామడ దూరముపోయి యెందుకో
యీమెయి మేనుద్రిప్పి మదధీశుఁడు పల్కిన సన్నవాక్కులో
రావ ! ప్రచండ వేగమున రావుగదా నను దన్నసైనమన్॥

'భారతి' 1944

శ్రీ విశ్వనాథ తమ చిన్నప్పటి ప్రణయ కవిత్వమంతా గిరికుమారుడన్న మారుపేరుతోనే రచించారు ఆ పేరు పెట్టుకోవడంలోనే ఆయన ఋషిత్వం గోచరిస్తుంది. అందులో సామాన్య స్త్రీ పురుష ప్రణయం లేనేలేదు. గిరి కుమారుడు కవి స్థానీయుడు. అతని ప్రియురాలు కవిత. కవికి కవిత్వం ప్రియపుత్త్రిక కావాలిగాని ప్రియురాలేమిటి ?

కవితా కన్యకు నలువురు
కవి జనకుడు, బట్టు దాది, గణుతింపంగా
నవరస రసికుడె పెనిమిటి
యవివేకియె తోడబుట్టు నవవేమ నృపా!

అన్నప్రసిద్ధోక్తిలో అసత్యంలేదు. కాని ప్రతికవిలోనూ రసికుడున్నాడు. సృష్టించేటప్పుడు తండ్రి ఇతరుల కవిత్వాన్నిగాని, తన కవిత్వాన్ని గాన్ని ఆనందించేటప్పుడు రసికుడే ! అందుచేతనే బ్రహ్మ తనకుమార్తెనే వరించాడన్న మాట బయలుదేరడమూ, పిల్లలమర్రి పినవీరభద్రుడు 'వాణి నా రాణి' యనడమూ సమర్థనీయా లవుతున్నాయి. కావచ్చును గాక. కవికీ కొండకూ సాదృశ్యమేమిటి? అది వాల్మీకి నడిగితే తెలుస్తుంది.

వాల్మీకి గిరి సంభూతా
రామ సాగర గామినీ
పునాతు భువనం పుణ్యా
రామాయణ మహానదీ।

కవులూ కొండలూ సుస్థిరచిత్తం కలవారు. గాలికి కొట్టుకుపోయే చెత్త కాగితాలు కారు. ఊర్ధ్వముఖ ప్రసరణం కలవారు. వారందుకోలేని ఔన్నత్యం ఉండదు. చుట్టుపక్కల జరుగుతూ ఉండే సంక్షోభాలకు చెక్కు చెదరక తాము ఆకాశమంత ఎత్తు పెరిగి ఆ ఎత్తునుండి అన్ని వైపులా నిదానించి చూచి మంచికి సంతోషిస్తూ చెడ్డకు కుమిలిపోతూ తమ హృదయాలను ఓడ్చి దివిజగంగల నందించే మహానుభావులు. దివ్యపయస్సులు వారి మీదికే దూకి వారిచేత ప్రభావితమై జనానికందుతాయి. గిరికుమారుని ప్రేమ గీతాల్లోనే తరువాత మూర్తి కట్టబోయే కవి విశ్వనాథుడు తొంగిచూచాడు. వినయం కొద్దీ కుమారుడన్నాడు గాని అప్పుడే ఆయన మహాప్రౌఢుడు. అదీకాక చైతన్య వంతుడెప్పుడూ కుమారుడే !

ఆయన తన కిన్నెరసాని పాటలలో చేసిన కల్పనా ఈనదీ పర్వత తత్త్వాన్ని పురస్కరించికొన్నదే! 1923 ప్రాంతాల్లో తమతండ్రి గారితో పాటు ఆయన కొన్నాళ్ళు భద్రాద్రి ప్రాంతాల్లో ఉండడం తటస్థించింది. అప్పుడు కిన్నెరసాని వాగునూ దానిచుట్టు ప్రక్కల ఉన్నగుట్టలనూ నిత్యమూ చూస్తూ ఉండేవారు. విజయవాడ మొగల్రాజపురం కొండలో బోర్లగిరి పడుకొని పడమటనున్న దుర్గ కొండను చూస్తున్న మహాపురుషుని ముఖాన్ని గుర్తుపట్టి తమ 'స్వర్గానికి నిచ్చెనలు' నవల మొదట్లో వర్ణించినట్లే ఏ గుట్టలోనో పురుషాకారం చూచి ఉంటారు. చటుక్కున ఆ కల్పనతోచి ఉంటుంది.

కిన్నెరా, కిన్నెరభర్త గాథ ప్రేమగల ప్రేయసీప్రియులు. అత్తపెట్టే కోడంట్రికాన్ని ఒక దుర్బలక్షణంలో సహించలేకపోయింది కిన్నెర. తల్లిని మందలించలేని భర్త భార్య నోదార్చి ఇంటికి తెచ్చుకునే ప్రయత్నం చేశాడు. ఎంత భర్తృప్రేమ కలిగిన దైనా ఆ పడుచుపిల్ల అభిమానాన్ని చంపుకోలేక దుఃఖించి దుఃఖించి భర్త చేతుల్లోనే కరిగి నీరై వాగై పారింది. అలా వాగై పోయిన ప్రియురాలికై దుఃఖంతో ఘనీభవించిన గుండెతో భర్త బండయై పోయాడు. ఇప్పటికీ ఆ బండ దగ్గర కిన్నెర మెల్లగా పారుతూ ఈ కల్పనలోని ఔచిత్యాన్ని ప్రదర్శిస్తూ ఉంటుంది.

విశ్వనాథ వారి సతీర్థులు, వేలూరి శివరామశాస్త్రి గారు 'ఏకావళి' అనే తమ ఖండకావ్యాల సంపుటిలో

నా కొక్కతోట, యొక్క త
టాకం. బొకకొండ, యొక్కమడవియు, మేలౌ
నేకాంతం బేటును, నివి
కా కొక నౌకయును దప్పకయ కావలయున్॥
కొండ నాతండ్రి, తోట నాకూర్చు తల్లి,
యడవి మిత్రంబు, వాఁగు పిన్నమ్మ, చెఱువు
వాని చెల్లెలు, నావ నా వాహనంబు
అల్ల యేకాంతమో యంతరంగ సఖుడు॥

ఏ యొకరుండు లేని యొక యేటి సమీపతలంబునం, దర
జ్యాయతనంబు నందును, దటాకతటంబున యందు, దోటయం
దాయతశైల శృంగమున యందు జనించు మహావనీ జమం
దూయెలయొండు నాసనము నొండును దప్పక నాకుఁగావలెన్॥

అందు నిర్మల భావనోద్యానమందు
గూరుచుండి యథేచ్ఛముగా రచింతు
ఛందమునకును యతికి ప్రాసంబునకును
నవల నలరారు రసవారు కవిత మమత॥

వట్టి పొడి పొడి మాటలతో కోరికల జాబితా ఏ కరువు పెట్టినట్లే ఉన్నా సర్వ వాంఛలకూ అతీతమైన వైరాగ్యాన్ని వ్యంగ్యం చేస్తూ పరమోన్నత లోకానుగ్రహాన్ని ప్రదర్శించాడు తత్త్వ వేత్త ఇందులో! ఈ పద్యాలు చదువుకుంటూ నేనెన్ని సార్లో ఉపనిషద్వీధుల్లో విహరించాను అత్యుత్తమ కవిత్వానికి కావలసింది అచ్ఛమైన హృదయం కాని ఆడంబరం కాదు.

ఉత్తమ కవిత్వ విర్భావానికి ఇట్టి వాతావరణాన్ని కోరుకునే వాళ్లను ఆధునికులు 'ఎస్కేపిస్టుs' అంటూ ఉంటారు. అంటే 'బాధ్యతలను తప్పించుకుని పారిపోయే పిరికిపందలని' వారి తాత్పర్యం. సమాజ జీవితం సమర్పించే భోగాలకు మోహితులు కాక ఆ సమాజం మీది ప్రేమచేతనే దాన్ని సర్వోత్కృష్టం చేయడానికి దానికి దూరంగా ఉన్నప్పుడే అందరి మంచి చెడ్డలు తెలుస్తాయని, మహాధైర్యవంతులు మాత్రనే అట్లా వెళ్లగలుగుతారని పూర్వు లనుకునేవారు. 'కశ్చిద్ధీరః' అని ఉపనిషత్తు ఇట్టి వారినే అభినందిస్తోంది. వీరే సాహిత్య వీరులు!

తాను భవపరాఙ్ముఖుడనని కంఠోక్తిగా చెప్పుకొన్న ధూర్జటి మహాకవి తన కావ్యంలో సమాజాన్ని తక్కువేం వర్ణించాడు? వివిధ వ్యక్తిస్వభావాలను ప్రస్ఫుటంగా చిత్రించడంలో ఆయన దరిదాపుల్లో నిలవగలగడం నేటి వాళ్ళల్లో ఎవరికి సాధ్య మవుతుంది? ఆ మహానుభావునకు శ్రీ కాళహస్తి నగరమే ముక్తి కాంతగా కనిపించినది. అందులో —

శమనాశా రజతాద్రి సీను, శిరమూ శంభుండు, దుర్గాద్రి నీ
ల మహాద్రుల్ చనుదోయి, పొన్నుఖరి లీలావేణి, గాహంద్రఘుటం
ద్ర మయూరాఖ్య సహస్ర లింగ పద భారద్వాజ తీర్థంబులై
యమరున్ ముక్తి వధూటి, కన్నగర మాహాత్మ్యంబు సామాన్యమే!

ముక్తి వధూటికి శ్రీ కాళహస్తి యందలి శ్రీమద్దక్షిణ కైలాస పర్వతమే శరీరము. శ్రీ కాళహస్తీశ్వరుడే శిరస్సు. దుర్గాల నీలాచల లేస్తన ద్వయం సువర్ణ ముఖరీ వాహినియే లీలా వేణి! ఇంద్రమయూర తీర్థాలూ, వేయి లింగాల కోన భారద్వాజ తీర్థాలూ కాళ్లూ చేతులూ! జగద్భావాన్ని పొందక తత్త్వభావాన్ని పొందడమంటే ఇదే కాబోలు!

ఉదయ గ్రావము పానవట్ట, మభిషే
 కోద ప్రవాహంబు వా
ర్ధి, దరీ ధ్వాంతము ధూప ధూమము, జ్వల
 ద్దీప ప్రభారాజి కౌ
ముది, తారానివహమ్ము లర్చిత సుమం
 బుల్గా, దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తి బింబ శివలిం
 గం బొప్పె ప్రాచీదిశన్॥

ధూర్జటి నాటికి రాయల వారి మంటపం నిర్మాణమయిందో లేదో! ఆ ప్రాంతంలో నిలబడి తూర్పుముఖంగా ఉన్న కైలాసగిరిని చూస్తూ పూర్ణిమ నాడు కొండపైన సగముదయించిన ఎంద్ర దర్శనం వల్ల కలిగిన అనుభవంతో ఈ పద్యం వ్రాసిఉంటాడు మహాకవి అని నా కనిపిస్తూ ఉంటుంది. ఎన్నో పున్నమలలో చంద్ర దర్శనం అక్కడ నిలబడి చేస్తూ ఈపద్యాన్ని స్మృతికి తెచ్చుకున్నాను గుళ్ళో! ఎవరైనా ఆ అనుభూతిని పొందవచ్చు.

సర్వం శివమయం జగత్.

# రాత్రి

## డా. తంగిరాల

భయం ఆముదం పూసి
 కాలం వ్రేళ్ళ మెదిపిన
మెత్తని కాటుక
కటికి చీకటి!

ప్రకృతి పురుషుల
సంయోగానందంలో
కరిగిన ఆత్మ
నా పుట్టుక!

రక్తం మడుగులో
ఈత

ఈ పయనం
రోత ...

ప్రేవుల నాచు
కాళ్ళకు బందాలు
నేను
ఖైదీని

రాత్రి చెరసాల
బతుకు సంకెళ్ళు
జన్మ
శిక్ష ...!

శ్రీ జి. జవహర్‌లాల్

# ఆంధ్రదేశంలో జైనమత ప్రవేశప్రచారములు - ఒక పరిశీలన

జైనమతం బౌద్ధమతంవలె నిరీశ్వరవాద మతముగా వర్ధిల్లినది. ఇవి రెండును వేద ప్రామాణ్యమును అంగీకరింపవు కాననే బ్రాహ్మణులు ఈ మతాలను అప్రామాణికాలైన భిన్నమతాలుగా భావించినారు. భారతదేశంలో ప్రాచీన శ్రమణ సంస్కృతికి ప్రాతినిధ్యం వహించి సజీవంగా నిలిచిన అత్యంత ప్రాచీనమతంగా జైనమతం భావింపబడుచున్నది. జైనమత సన్యాసిని తెలుపు విశిష్టమైన పదము శ్రమణ శబ్దం. ప్రాచీన నిర్మాణాలు, శాసనాలు, సంస్కృతి సంప్రదాయాలు కూడా ''ప్రాచీన కాలంలో దేశంలోని అనేక రాజవంశాలవారును, మేధావులైన రాజోద్యోగులును, జైనమత ప్రభావానికి వశులై జైనమత నియమ నిబంధనాలను శ్రద్ధాభక్తులతో అనుసరించినారు'' అను విషయాన్ని వివరించుచున్నది.

ఆంధ్రదేశంలో బౌద్ధమత చరిత్రము సర్వులకు విదితమై ఉండగా జైనమతాన్ని గూర్చి చాల కొంచెంగా మాత్రమే తెలియవచ్చినది. తెలుగునాడును చారిత్రిక దృష్టితో పరిశోధన కావించిన సూ్యయల్ దొర[1] ఆంధ్రదేశం నలుమూలలా జైనావశేషాలు కనిపించుచున్నవని వెల్లడించినాడు. కాని తర్వాతి పరిశోధకులు వీనిని గుర్తించి పరిశోధనకు పూనుకొన్నట్లు తెలియబడలేదు. క్రమబద్ధంగా వైజ్ఞానిక దృష్టితో ఆంధ్రదేశంలోని జైనావశేషాలను గ్రామ ప్రాంతాలవారిగా పరిశోధించుటకు పూనుకొన్నచో తప్పక జైనమతానికి చెందిన అనేక నిగూఢ విషయాలు ప్రపంచానికి వెల్లడి కాగలవని నా దృఢాభిప్రాయము. నాకు తెలియవచ్చిన కొన్ని విషయాలను ''ఆంధ్రదేశంలో జైనమత ప్రాచీనతా అది దేశంలో అడుగుపెట్టి విస్తరించిన'' విధమును ఈ వ్యాసముఖాన పరిశీలింపబూనుకొన్నాను --

క్రీస్తుకు పూర్వం 6వ శతాబ్దంనాటికి దేశంలో అంతవరకు అమలులో ఉండిన వైదికమత సంప్రదాయం, కర్మకాండ, ఆచార వ్యవహారాలతో విసిగిపోయిన జనం క్రొత్త పద్ధతుల రాకను కోరుచుండినారు. బ్రాహ్మణీకాలను ద్వేషింపసాగినారు. అట్లు తిరుగుబాటు చేసిన వారిలో ప్రధానులు 'క్షత్రియులు' అని శ్రీ బి. ఎన్. తానే[2] గారు సరిగానే నిర్ణయించినారనవచ్చును. క్షత్రియులు నూతన విధానాలను ఆరంభించి సంఘంలో సరిక్రొత్త కట్టుబాటులను నెలకొల్పినారు. ఇట్లారంభించిన నూతన విధానాలలో ఒకటి జైనమతం. కాననే జైనమతం క్షత్రియమతంగా పేరు పడినది.[3] క్రీస్తుకు పూర్వం ప్రథమ శతాబ్దంలోనే జైనమతం రెండు భిన్నవర్గాలుగా శ్వేతాంబరులనీ దిగంబరులనీ ఆ మతానుయాయులు విడిపోవుటతో రెండయినది. ఈ భేదం ఆ కాలానికె జైనంతో సమానంగా దేశంలో విస్తరిల్లి ఉండిన బౌద్ధం హీనయానమనీ, మహాయానమనీ, వైదికం శైవమనీ, వైష్ణవమని విడిపోయినట్లుగనే జైనమతంలో కూడ ఏర్పడినది.

జైనమత ప్రాదుర్భావము, దాని ప్రాచీనతా, ఆ మత పరిణామ ఫలితాలను తొలుత పరిశీలింపదగినవి. బుద్ధ భగవానుడు ప్రబోధించిన బౌద్ధమత శాఖయే జైనమతమని కొందరు ప్రాచీన పండితులు, పాశ్చాత్య విద్వాంసులు భావించినట్లుగా బౌద్ధమత శాఖయు కాదు, హిందూమత శాఖయుకాదు. వైదికము అసలే కాదు. క్రీ॥ శ॥ 1879 లో జాకోబి పండితుడు జైన బౌద్ధాలు దేనికదే విశిష్టతా ప్రత్యేకతాకల విభిన్న మతాలని నిర్ధారణచేసి యున్నాడు. బౌద్ధమత గ్రంధాలు తరచుగా జైనులను తమ ప్రత్యర్థులనుగా పేర్కొనుచు, వారిని ''నిగంధ''అను పాతపేరులతో తెలుపుచుండును. సంస్కృతంలోని ''నిర్గ్రంధ''పదమే ప్రాకృతంలో ''నిగంధ'' అయినది. వర్ధమాన మహావీరునికి బౌద్ధులువాడు విశేషణము నేత– 'నేతి పుత్త'. దీనినిబట్టి జైన మహా పరివర్తకుడు మహావీర వర్ధమానుడు బుద్ధునికి సమకాలీనుడో, కొంత పూర్వీకుడో అయినట్లు తెలుచున్నది.

మహావీరుడు బుద్ధభగవానునివలె ఒక నూతన మతానికి ప్రారంభకుడు కాడు. జైనమత గ్రంథాలేవియు ఆ విధంగా తెలియ చెప్పవు. ఈ పరిచయ వాక్యాలతో జైనమత ప్రాచీనతను గూర్చి తెలిసికొందము. జైనమతం చాలప్రాచీనమైనదిగా పౌరాణిక యుగానికి పూర్వం నుండి క్రమంగా 24 తీర్థంకరులచే బోధింపబడి ప్రచారంలో ఉన్నట్లు ఆ మత సంప్రదాయాన్ని బట్టి తెలియుచున్నది. కొందరు తీర్థంకరులు యజుర్వేదంలో పేర్కొనబడినారు. (IX, 25) అందొకని పేరు ''అరిష్టనేమి.'' తైత్తిరీయారణ్యకంలో సైతం (IV – 17–V4) ''అర్హత''అను పేర ఒక తీర్థంకరుని ప్రస్తావన కలదు. మహాభారతంలో జైనమునులను గూర్చియు, వారి ప్రబోధాలను గూర్చియు కొంత వివరణ కలదు. క్షపణక అను పేరు ఆదిపర్వంలో, శాంతి పర్వంలో కూడ వచ్చినది. వ్యాఖ్యాతలు

ఆ శబ్దానికి "దిగంబర జైన సన్యాసి" అని వివరణ మిచ్చినారు బాదరాయణ సూత్రాలలో (11 – 33) స్యాదవాద ప్రస్తావన కలదు. తీర్థంకర పదం బ్రహ్మాండ, శివ, నాగ పురాణాల్లో ప్రస్తావించబడినది చూడగ జైనమత ప్రాచీనత వెల్లడి కాగలదు.

పైన పేర్కొన్న పరిశీలనచే క్రీ॥పూ 599-527లో ఉండిన వర్ధమాన మహావీరుడు జైనమత ప్రారంభకుడు కాడనియు, ఆయన ఆ మతానికి నూతనోత్తేజాన్ని కలిగించినవాడు మాత్రమే అనియు, ఆయన కంటె పూర్వం భారత భూమిలో క్రీస్తుకు పూర్వం 877–777 సంవత్సరాలలో, దాదాపు వర్ధమానునికి 250 సం॥ పూర్వం పుట్టి జైనమతాన్ని తన అగాధ జ్ఞానంతో ప్రకాశింపచేసిన వాడు పార్శ్వనాధుడను తీర్థంకరుడు 23వ మత ప్రవర్తకుడనియు నిర్ధారణ అయినది దీనితో కలిపి ఆధునిక చారిత్రక పరిశోధన సైతం 'బుద్ధుని కాలాని కంటె పూర్వీకులుగా మహావీర పార్శ్వనాధులను వారు ఉండినారనీ, ఆ యిరువురు పురాణ పురుషులు గాక చారిత్రక వ్యక్తులనీ నిస్సంశయంగా నిర్ధారణ చేసినది — ఇందుకు తార్కాణంగా వ్యాహప్రన్నటి (1–9–3–77) పార్శ్వనాధుని శిష్యుడు కాలాస్యవైశిక పుత్రునితో మహావీరుని శిష్యులు అనేక విషయాలు చర్చించు చుండినట్లు వివరించుచున్నది. 'ఉత్తరాధ్యయన మను ఆగమ గ్రంథం'లో ఇంద్రభూతితో పార్శ్వనాధ శిష్యుడగు కేశి అనువాడు కావించిన చర్చలు సంగ్రహింపబడి ఉన్నాయి. ఆయార(II,S401) మను జైనమత గ్రంధం మహావీరుని తల్లిదండ్రులు పార్శ్వనాధుని భక్తులని తెలియజేయుచున్నది. స్యాదవాద (II, 7)మను గ్రంథంలో పార్శ్వనాధ శిష్యుడైన ఊదకునితో ఇంద్రభూతి కావించిన చర్చలు ఉల్లేఖింపబడి ఉన్నాయి. అది మొదలు అనేక జైనమతగ్రంథాలు పార్శ్వనాధ శిష్యులకు, మహావీర శిష్యులకు నడుమ నడిచిన పెక్కు చర్చలను పరమప్రామాణిక విషయాలుగా గ్రహించి వివరించు చున్నాయి. ఇందులో జైనమతంలో ప్రాచీన నవీన భావనల సమ్మేళనం జరిగినట్లు నిర్ధరింపవచ్చును. దీనినిబట్టి మహావీర వర్ధమానుడును, పార్శ్వనాధుడును పౌరాణిక వ్యక్తులు గాక చారిత్రక పురుషులుగ బుజువగుచున్నది. "త్రిషష్టిశలాక పురుషచరిత్ర" మను జైనగ్రంధం (పర్వం 8, అధ్యాయం 4) ఇరువది రెండవ తీర్థంకరుడైన అరిష్టనేమి కృష్ణభగవానునికి మేనత్త కొడుకని తెలుపుచున్నది. ఈ ప్రసిద్ధులగు యిరువురతో రుక్మిణీ కృష్ణుల పుత్రుడు ప్రద్యుమ్నుడు కూడ హరివంశము నందును, జైనగ్రంధాలలోను పలుమార్లు పేర్కొబడినారు. కృష్ణుడు చారిత్రక పురుషుడుగా నిర్ణయింపబడినపుడు అరిష్టనేమి ఎట్లు పురాణ పురుషుడగును? కాని ఇందును గూర్చి సప్రమాణంగా నిరూపించు ఆధారాలు లేనపుడు ఊహలపై ఆధారపడి మనము ముందుకు పోవుట సాహసమే కాగలదు.

ఇచ్చట మనము జైనమతానికి చెందిన వ్యాఖ్యానాలను, సిద్ధాంతాలను, పద్ధతులను, లోతుగా పరిశీలింపబనిలేదు. ఒకటి మాత్రము నిర్ధారణగా చెప్పవచ్చును జైనమతము సంపూర్ణము, విశిష్టమైన ఒక ప్రత్యేకమతము అనుటకు కావలసిన అన్ని విధములైన పద్ధతులతో, శాఖోపశాఖలతో, నియమనిబంధనలతో సుసంపన్నమైన మతమిది. తత్వవిచారణ, ధర్మాలు, వేదాంతము, నీతి, పురాణగాథలు, ఆచారము మొదలైన అన్ని శాఖలయందును తనదైన ఒక నిశ్చిత పద్ధతిలో పూర్ణతను సాధించుకొన్నది. జైనమతంలో అత్యంతప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న "జంతువుల యందు మిక్కిలి దయార్ద్ర హృదయాత్వ" మను అహింసావిధానం ఆ మతంపై ఒక ప్రత్యేక ముద్రనువేసినది. అహింస; సజ్జన సేవ ఆ మతానికి ముఖ్య లక్షణాలు. తక్కిన మతాలలో అత్యున్నత స్థానంలో నిలిచే దేవతలతో పోల్చిచూచినచో జైనమతస్థులు మహా భక్తితో పూజించే తీర్థంకరులు 24 గురు జైనుల పాలిటదేవాది దేవులు[4] అయ్యేదరు. ఈ విధానం హైందవంనుండి జైనానికి సంక్రమించినదనవచ్చును. హైందవంలో సామాన్యస్థానంలో నిలుచు దేవీ, దేవతామూర్తులకంటె జైనతీర్థంకరులు సర్వోన్నత స్థానం వహిస్తారు. జైనమతానుసారంగా తీర్థంకరులు హైందవంలోని పరబ్రహ్మయొక్క విలక్షణములైన సర్వగుణాలుకలవారు [5] – విష్ణువునకు పది అవతారాలు ఉండగా జైనంలో ఇరువది నలుగురు తీర్థంకరుల మహిమలు విస్తరించి ఉన్నాయి.

జైనమత ప్రాచీనతా స్వరూప పరిశీలనకు తర్వాత అది ఆంధ్రభూమిలో ప్రవేశించి విస్తరించిన విధం గమనింపదగియున్నది. జైనమతం ఆంధ్రదేశంలో పది పండ్రెండు వందల సంవత్సరాల కంటె ఎక్కువ కాలమే సర్వజనులచే విస్తారంగా అవలంబింపబడి ప్రముఖ స్థానాన్నాక్రమించి ఉండినదనుటలో ఎట్టి సందేహములేదు. కొందరు పండితులు ఆంధ్రదేశానికి జైనం కర్నాటకం నుండి ప్రవేశించి తెలుగు నాడున ఒక ప్రధాన మతంగా ఆరాధింపబడినదనుచున్నారు. కీర్తిశేషులైన శ్రీ పి.బి దేశాయిగారు క్రీ॥ పూర్వం 5వ శతాబ్దానికి ముందే ఆంధ్రదేశంలో జైనంప్రవేశించి ప్రచారం పొందినదని చెప్పినారు. వర్ధమాన మహావీరుడు తన నూతన పద్ధతులతో జైనమతాన్ని సంస్కరించి క్రొత్తచైతన్యం పూరించినవాడు స్వయంగా కళింగదేశంలో సంచరించి ప్రచారం చేసినట్లు నిశ్చయింపబడినది. కళింగరాష్ట్రం ఆంధ్రభూమికి ఉత్తరాన సన్నిహితమైన సరిహద్దు రాష్ట్రం. కావున పరిమితము అల్పమునైన ఈ చర్య చారినంత ప్రబల ప్రమాణంగా నిలువ జాలదని త్రోసివేయరాదు. కళింగం ద్వారా ఆంధ్రానికి జైనం చేరి ఉండుననవచ్చును. ఇది శ్రీ పి.బి. దేశాయిగారి నిశ్చితాభిప్రాయము. ఈ విషయమునే "హరిభద్ర వృత్తి" [6] అను జైనమత గ్రంథం బలపరుచుచున్నది. వర్ధమాన మహావీరుడు తన తండ్రికి ప్రియమిత్రుడైన ఒకరాజు కళింగదేశాన్ని పాలించుచుండినందున కళింగానికి వచ్చి తన మతాన్ని ప్రచారం చేసినట్లు ఆ జైనమత గ్రంధం వివరించుచున్నది. ఇందుకు తార్కాణంగా ఆ రాష్ట్రంలోని కుమారాచలంపై వర్ధమానునిచే విజయ చిహ్నంగా ఒక చక్రం "సుపవతవిజయచక్ర" (సుపర్వత విజయచక్రం) అను శిలా చిహ్నం ప్రతిష్ఠింపబడినది. కుమారాచలం కళింగ రాష్ట్రంలో

దక్షిణపు చివర నున్నది. అదియే ఆంధ్రదేశానికి ఉత్తరాన హద్దు అగుచున్నది. [7]

ఈ విషయంలో మరొకజైన కథనం ఇట్లున్నది : ప్రాచీన కాలంలో ప్రథమతీర్థంకరుడుగా పేర్కొనబడుచున్న ఋషభునకు ''భరతుడు,'' ''బహుబలి'' అని యిరువురు కుమారులు కలరు. ఈ భరతుని పేరుతోనే మనదేశానికి ''భారతదేశం'' అనిపేరు కలిగినది. బాహుబలియే తర్వాత ''గోమఠేశ్వరుడు'' అనబడినాడు బాహుబలి బోధన నగరం రాజధానిగా ఒక రాజ్యాన్ని స్థాపించినాడు. ఈ బోధన నగరమే నేడు నైజాం రాష్ట్రంలోని ''బోధన్'' గా గుర్తింపబడినది. మరియు ఇచట పెక్కు జైనావశేషములు ఉన్నట్లు కనుగొనబడినవి. నేడు ఈ ప్రాంతం ఆంధ్ర రాష్ట్రంలోని నిజామాబాదు జిల్లాలో ఉన్నది. భద్రబాహు చంద్రగుప్త వృత్తాంతంలో మౌర్య చక్రవర్తి చంద్రగుప్తుడు ఒకమారునిద్రలో పన్నెండు తలలమహా సర్పమొకటి తన్నాక్రమించినట్లు కలగని లేచి తన గురువైన జైన భద్రబాహువునకు నివేదింపగా ఆయన త్వరలో ఉత్తర భారతంలో పన్నెండేడుల మహాక్షామము రానున్నదని ఆ కలఫలితం చెప్పి తన రెండువేల మంది జైన శిష్యులతో దక్షిణ భారతానికి వలసవచ్చి ఇంద్రగిరి, చంద్రగిరి అను కొండల ప్రాంతాన నివసించినట్లు చెప్పబడినది. భద్రబాహువు నిలిచిన ప్రాంతమే నేడు ''శ్రావణబెళగోళ'' అను మైసూరు రాష్ట్రంలోని తావుగా గుర్తింపబడినది. ఇంకొక జైన కథనం ప్రకారం మౌర్యచక్రవర్తి అశోకుని మనుమడు సంప్రతి అనువాడు జైన మతం స్వీకరించి ఎనలేని సేవచేసినట్లు తెలియుచున్నది. అశోకునికి తర్వాత చక్రవర్తి అయిన సంప్రతి జైనమతమందు గాఢమైన అభినివేశం కలిగి తన తాత అశోకుడు బౌద్ధం స్వీకరించి జైనులకు గావించిన అపచారాలకు ప్రాయశ్చిత్తంగా జైనులకు పెక్కు ఉపకారాలు చేసి జైన రచయితలచే ''జైనమతాశోకుడు''గా ప్రశంసలందుకొన్నాడు.

జైనమతవాఙ్మయం శాతవాహనరాజులను గూర్చియు, వారు జైనులకు గావించిన సేవలను గూర్చియు పెక్కుచోట్ల ప్రస్తావన చేసియున్నది. పైఠను నగరాధిపతి అయిన ఒక శాలివాహనరాజు జినదేవుడను జైనముని శిష్యుడని ''అవశ్యక సూత్రములు'' అను జైనమత గ్రంథం పేర్కొన్నది. శాతవాహనులు ఆంధ్రులే అని శాసనాల వల్లను, శాతవాహనుల నాణెముల వల్లను సప్రమాణంగా ఇప్పుడు ఋజువైనది. ఇటీవలే కరీంనగర జిల్లా కప్పారావుపేట దగ్గర కొండగుట్టలలో ఒక సహజమైన జైన గుహలో [8] శ్రీ పి. పరబ్రహ్మశాస్త్రి గారికి శ్రీముఖ శాతవాహన చక్రవర్తి నాణెములు కొన్ని లభించినవి.[9] ఈ అపూర్వ వస్తుసంపాదన శాతవాహనులు తెలుగు వారన్న పురాణోక్తిని నిర్ధారణ చేసినది. అంతేకాక శాతవాహన ప్రథమ చక్రవర్తి శ్రీముఖుడే అనియు, జైనుల వాఙ్మయంలో ఈ మహారాజు జైనమతంలో మిక్కిలి భక్తి విశ్వాసాలు కలవాడయి జైన సన్యాసులకు ఎన్నో బసదులు నిర్మించి పెట్టినాడనీ, పూజకై ఎన్నో చైత్యాలు కట్టించి పెట్టినాడనీ చెప్పినవన్నియు యథార్థమే అన్న విషయం ఇవి నిరూపించుచున్నవి. దీనినిబట్టి జైనమతం ప్రథమ శాతవాహను కాలానికే ఆంధ్రదేశంలో రాజాదరణ పొందినదనుట నిస్సందేహం.

ఇక శాసనాధారములు పరిశీలింతము ఆంధ్ర దేశంలో జైన మత ప్రవేశాన్ని నిరూపించు అత్యంతముఖ్య సాక్ష్యాధారాలలో ఖారవేల్లుడు అను జైనమతంలో గాఢాభిమానం గల కళింగ దేశాధిపతి వేయించిన హాథిగుంఫ శాసనము[10] అను ప్రసిద్ధ శాసనము ప్రథమ గణ్యమైనది. కుమార గిరిపై వర్ధమాన మహావీరుడు ప్రతిష్ఠించిన సుపర్వత విజయచక్రం వార్త ముందే మనకు తెలిసియున్నది గదా! ఈ కుమార గిరియే ఖారవేల్ల చక్రవర్తి వ్రాతలతో గూడిన ఉదయగిరిగా నేడు చరిత్రకారులు గుర్తించినారు. వీనికితోడు హాథిగుంఫ శాసనముతో గూడ ఉదయగిరి,స్కంధగిరి (ఖండగిరి) కొండ గుహలలో గూడ జైనమత విషయాలను తెలుపు శాసనాలు అనేకం లభించుటతో ఆంధ్ర దేశానికి జైనమతం కళింగ రాష్ట్రం ద్వారా ప్రవేశించి విస్తరించినట్లు స్పష్టంగా నిరూపించినట్లయినది.

పై విషయాలకు సమ్మతింపక శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు[11] ''ఖారవేల్లుడు గాఢజైన మతాభిమాని అనుటకు సందేహం లేదుగాని అతడు తక్కిన ప్రాంతాలలో జైనమత ప్రచారానికి జైన గురువులను, సన్యాసులను పంపినట్లు మనకు దాఖలా లేద'' ను చున్నారు. మరియు ఆంధ్ర దేశంలో ఉదయగిరి, ఖండ గిరులవంటి జైన గుహలు ఉత్తరాంధ్ర సీమలో కనిపించకున్నాయి. అంతేగాక నయసేనుడను జైన రచయిత వ్రాతలనుబట్టి ఆంధ్ర దేశంలో జైనమతం ఇక్ష్వాకురాజుల పాలనకాలంలో అంగదేశం నుండి వలసవచ్చిన ఒక జైన క్షత్రియుని వలన తొలుత భట్టిప్రోలు ప్రాంతంలో జైనమతప్రచారం ఆరంభమయినట్లు ఆయన భావించుచున్నారు. ఈ సందిగ్ధావస్థలో పడమర గోదావరి జిల్లా గుంటుపల్లి కడకొండ గుహలో బ్రాహ్మిలిపిలో ఒక శాసనం[12] బయల్పడి ఆంధ్ర దేశంలో జైనమత ప్రవేశాన్ని గూర్చిన సందేహాలను పటాపంచలు చేసి క్రొత్త వెలుగు ప్రసరింప చేసినది — ఇది శ్రీ గోపాల కృష్ణమూర్తి గారి సందేహాలను ప్రక్కకు నెట్టివైచి శ్రీ పి. బి. దేశాయిగారి వాదాన్ని బలపరిచినది. —

గుంటుపల్లె పశ్చిమగోదావరిజిల్లాలో ఏలూరునకుపడమరగా 30 మైళ్లలో ఉన్న ఒక చిన్న పల్లెటూరు క్రీ॥శ॥ 1889లో రేగారిచేతను 1916, 17 లలో లాంగ్‌హర్స్టు అను పురాతత్వ శాస్త్రజ్ఞునిచే ఈ స్థలం గుర్తింపబడి త్రవ్వకాలు సాగింపబడినాయి. సమర్థులైన ఈ ఇద్దరు శాస్త్రజ్ఞులుకూడ ఈ ప్రాంతం ఒక ప్రాచీన బుద్ధమతావశేషాలు కలదిగా విశ్వసించినారు ఈ అవశేషాలు క్రీస్తుకుపూర్వం రెండవ శతాబ్దం నాటివని వారు భావించినారు. కాని ఇపుడు ఇచట లభించిన బ్రాహ్మిలిపి శాసనం ఆ శాస్త్రజ్ఞుల భావాన్ని, విశ్వాసాన్ని, ధ్వంసివైచినది. ఈ గుంటుపల్లి శాసనాన్ని పరిశీలించిన శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఇందు పేర్కొన్న ''మహామేఘ వాహనస'' అను బిరుదాన్ని ఉదయగిరి, ఖండగిరులలోని మహామేఘ వాహన బిరుదంతో పోల్చి ఆ కాలంలో కళింగ దేశాధిపతి అయిన ఖారవేల్లునికి ఈ బిరుదమున్నట్లు నిరూపించినారు. హాథిగుంఫ

శాసనంలో ఖారవేల్లుడే మహామేఘవాహన బిరుదంతో స్పష్టంగా చెప్పబడి యున్నాడు.

గుంటుపల్లెలో లభించిన రెండు శాసనాలలో ఒక దానిలో కళింగాధిపతి మహామేఘవాహనుని రాయల వ్రాయసకాడు చుళుగోము డనువాడు ఒక మండపమును కట్టించినట్లు స్థిరపరచుచున్నది. శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యం గారు "మన ఊహ సరియైనచో గుంటుపల్లిలో లభించిన ప్రాచీనావశేషాలు జైనులకు చెందినవేగాని ఇంతకు పూర్వం పురాతత్వ శాస్త్రజ్ఞులు భావించినట్లు బౌద్ధమతావశేషాలు గావని" చెప్పి సమన్వయం చేసినారు. ఈ సందర్భంలో లాంగ్ హర్స్టుగారు సంపాదించిన రెండవ శాసనం క్రీస్తుకుపూర్వం రెండవ శతాబ్దినాటిది ఒక స్త్రీకి సంబంధించినది. ఉపాసిక అను ఆమె తన గురువు సుయజ్ఞనాధుని ఆజ్ఞపై సోపానాలు కట్టించినట్లు ఈ శాసనం తెలుపుచున్నది. సుయజ్ఞనాధుడను పేరు బౌద్ధగురు పరంపరకు చెందినదిగాక జైన సంబంధమైనదని ఆ పేరే వెల్లడిచేయుచున్నది. దీనినిబట్టి గుంటుపల్లె కొండ గుహలు ఆదినుండి జైనులకు చెందినవేగాని బౌద్ధులవికావని నిర్ధారణ అగుచున్నది. ఈనాడు గూడ గుంటుపల్లె పరిసరాలలో జిలకరగూడెం, అసినిగూడెం మొదలగు చోట్ల పెక్కు జైనావశేషాలను మనము చూడగలము. ప్రఖ్యాత భారత చరిత్రకారుడైన స్మిత్ "కంకాళితేల"అనుదానిపై వ్రాయుచు "కొన్ని స్థలాలలో మనం బౌద్ధావశేషాలని పొరపాటున భావించినవి బౌద్ధులవిగాక జైనులవే" అని తెలుపుకొన్నాడు.

గుంటుపల్లెలో లభించిన రెండు బ్రాహ్మీలిపి శాసనాలను బట్టి, ఆంధ్ర దేశంలో జైనమతం ఖారవేలుని కాలాని కన్న చాలా ముందుగనే ప్రవేశించి, ప్రజల అభిమాన మతంగా పెంపొంది యుండినదని ఖారవేలుని వ్రాయసకాడైన చులుగోముడు జైనుల సౌకర్యం కోసరం ఒక మండపాన్ని రాజాజ్ఞపై నిర్మింపగా ఒక ఉపాసిక తన గురువు సుయజ్ఞనాధుని అనుమతిపై ఆ మండపానికి సోపానాలు నిర్మించి ఉండుటవలన నిస్సంశయముగా చెప్పవలసి యున్నది. దీనినిబట్టి ఖారవేల్లుడు గుంటుపల్లెలో జైనమతాన్ని ప్రవేశపెట్టినాడని గాని, స్థాపించినాడని గాని చెప్పజాలము గదా! అతడు తనకు గల జైన మతాభిమానాన్ని ఈ మండప నిర్మాణం ద్వారా వెల్లడించుకున్నాడు మాత్రమే. అందుచే జైనమతం ఆంధ్ర దేశంలో ఖారవేల్లుని కంటే ఎంతో ముందు కాలంనుండి ప్రవేశించి చక్కగా ప్రచారం పొంది ఉండినది చెప్పకనే తెలియుచున్నదన్న నా అభిప్రాయము సరియైనదే అగుచున్నది. ఇటీవల శ్రీముఖ శాతవాహనుని నాణెములు ఒక జైన సహజగుహలో దొరకినట్లు తెలిపి యుంటిని. శ్రీముఖ శాతవాహనుడు గొప్ప జైన మతాభిమానియని జైన గ్రంథాలు తెల్పుచునే యున్నవి. కావున ఖారవేలుని ముందే ఆంధ్ర దేశములో జైనమతం రాజాదరణ బడిసిన దనుటకు యీ ప్రథమ శాతవాహనుని నాణెములు జైన గుహలో దొరుకుటయే తార్కాణం. కాగా వర్ధమాన మహావీరుని జీవితకాలంలోనే క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దికే ఆంధ్ర దేశంలో జైనం కాలూనియుండునన్న శ్రీ దేశాయిగారి భావము సమంజస మేమో! ఆంధ్ర సీమలో జైనమతానికి చెందిన ప్రాచీనావశేషాలు దాగి ఉండినవి ఇపుడిపుడే లభ్యమగుచున్నందున లభించిన ఆధారాలను బట్టి మహావీరుడు కళింగ దేశంలో ప్రచారం కావించుట సత్యమే అని తెలుటచేత ఆంధ్రలో జైనమతం కళింగ భూమినుండి ప్రవేశించినదను విషయాన్ని ఒప్పుకొనుట మన పవిత్ర ధర్మము. అదియునుగాక, కళింగ భూమిలో పూజలుగొన్న జైన తీర్థం కరుడు శీతలనాధుడు తీర్థంకరులలో పదవవాడు. కొందరు ఈ శీతల జన్మభూమి బాదల పురము లేక భద్రపురం అన్నారు ఈ భద్రపురం గోదావరి గట్టున ఉన్న నేటి భద్రాచలమని గుర్తించినారు. [13] పైన వివరించిన విషయాలు శ్రీ పి. బి. దేశాయిగారి భావాలనే బలపరచుచున్నవి

కాని జైనమెంత త్వరగా ప్రవేశించినదో అంత త్వరగా ప్రముఖ స్థాన మాక్రమించలేదు ఇందుకు ముఖ్య కారణము ఆ మతములోని అసహజమైన దిగంబర పద్ధతి అననచ్చును: జైన సన్యాసులు, తత్వవేత్తలు, సర్వాభిమానములు విడుచుటకు గుర్తుగా వస్త్రధారణం నిషేధించినారు. సాంఘికంగా రోత కలిగించు దిగంబరత్వంతో జైన మునులు నలుగురిలో ఉండ నొల్లక కొండ గుహలు ఆశ్రయించినారు. దిగంబరత్వం నాగరికతకు నాడునూ వ్యతిరేకమే. ఈ విషయంలో శ్రీ బి. ఎన్. ఎల్. హనుమంతరావుగారు "జైనం చాలకాలం మరుగుపడిన స్థితిలో ఉండుటకు ముఖ్యకారణం ఆ మత ధర్మాలు, నియమ నిబంధనలు చాల కఠినంగా ఉండుటయు, జైన గురువుల ఆచార నిష్ఠురతయు అయి ఉండుననియు, ఈ కారణాల చేతనే ఆ సన్యాసులు మానవ నివాసములలో ఉండలేక ఏకాంతవాసం పేర అడవులు, కొండలు పట్టిపోయినారనియు, బౌద్ధ సన్యాసులవలె జైన సన్యాసులు సంఘ క్షేమమునకై పాటుపడలేక పోయిరనియు" తమ "ఆంధ్రదేశము-మతములు" అను గ్రంథంలో వివరించినారు. జైనంలో శ్వేతాంబర విధానం వచ్చిన తర్వాతనే వారు సంఘంలో ప్రవేశించి ఉందురని నా అభిప్రాయము.

ఖారవేలునికి పిమ్మట, కళింగంలోను, ఆంధ్రలోను జైన మతావశేషాలు పూర్వం విస్తారంగా ఉండినవన్నియు పాడుబడినాయి. ప్రజలు వానిని మఱచిపోయినారు ఇందుకు కారణాలు చాలా ఉన్నాయి అందొకటి ఆ మతం బౌద్ధం మొదలయిన విరోధమతాల తాకిడికి తట్టుకొలేక తిరుగుమొగం పట్టినది. కాని దానితో అంతయు ముగిసిపోలేదు అనుటకు వారి రచనలు, శాసనాధారాలు, నిర్మాణాలు ఒక కాలంలో జైనం ఆంధ్ర భూమిలో మూలమూలలా ప్రాకి 12వ శతాబ్దం దాకా నిలిచి ఉండినట్లు సాక్ష్యమిస్తూ ఉన్నాయి. ఆంధ్రదేశంలో జైనంచే ప్రభావితంకాని ఒక్క గ్రామం కూడా లేదు. విశాఖపట్నం జిల్లాలోని రామతీర్థం, తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపుర ఆర్యవటులు, పశ్చిమ గోదావరి జిల్లాలోని గుంటుపల్లె, భీమవరం, పాలకొల్లు, గణపవరం, కృష్ణాజిల్లాలో బెజవాడ, గుడివాడ, నిడమర్రు, గుంటూరు జిల్లాలో ధరణికోట, ధర్మవరం, సత్తెనపల్లె, నెల్లూరు జిల్లాలో ఆత్మకూరు, మాలకొండ, కడప జిల్లాలో దానవులపాడు, పెద్ద ముడియం నాయకల్లు, యాచవరం, గంగ పేరూరు, పెనికలపాడు, అనంత

పురం జిల్లాలో కొనకండ్ల, పెనుగొండ, రాయదుర్గం, రత్నగిరి తెలంగాణాలో వేములవాడ, కొలనుపాక, బోధన్, కప్పారావుపేట, గొల్లత్తగుడి మొదలైన పెక్కు స్థలాలు జైన పవిత్ర యాత్రా స్థలాలుగా, ప్రచార కేంద్రాలుగ పేరుపొంది ఉండినాయి. పరిశిష్ట పర్వంలో ఉదహరించినట్లు గాంగులు, రాష్ట్రకూటుల, చాళుక్యులు, తొలి విజయనగరరాజులు. హొయసలులు మొదలయిన పెక్కు రాజ వంశాలవారు, జైనమతాన్ని ఆదరించి తమ ఏలుబడిలో జైన మతాభివృద్ధికి ఎన్నో విధాల దోహదం చేసినారు. రాజాదరంపొంది రాజబంధువులచేత, రాజోద్యోగులచేత అవలంబింపబడి జైనమతం సర్వజనామోదంపొంది బలంపుంజుకొని క్రమక్రమంగాసర్వోచ్చస్థితికి చేరినదై క్రీ॥ శ॥ 12వ శతాబ్దిదాక ఆంధ్రదేశంలో ఎనలేని గౌరవ ప్రతిష్ఠలను అనుభవించినది. ఆ తర్వాత తెర మరుగున పడిపోయినది, గాని పూర్తిగా నశించిపోలేదు

## పరిశీలించిన గ్రంథములు

1. Topographical lists of the Antiquities in the Madras Presidency.
2. Evolution of Indian Culture·
3. జైన తీర్థంకరులందరూ పరిశీలించి చూడగా క్షత్రియులే.
4. హేమచంద్రుని అభిధాన చింతామణి.
5. శిల్ప రత్నాకరము, పుట 270.
6. ఆగమోదయ సమితిచే ముద్రితమైన 'హారిభద్రీయ వృత్తి' పుట 218-220.
7. డాక్టరు పి. బి. దేశాయి : దక్షిణ భారతంలో జైనమతము మరియు కొన్ని జిన శాసనములు.
8. జైన గుహ అనుటకు కారణాలు లేకపోలేదు. జైనులు అంతిమ దశలో 'సల్లేఖనము, సన్యాసన' పద్ధతులలో ఆత్మాహుతి చేసుకొందురు. అట్లు చేసుకొనుట కనువుగా పెద్ద బండలను పరుపుల (beds) వలె చెక్కి వాటిపై పరుండుట కనుకూలంగా చేసుకొందురు. ఇటువంటి రాతి పరుపులు (Stone beds) మద్రాసులోను, కర్నాటకలోను గల గుహలలో కనుగొని చారిత్రకులు వాటిని జైన గుహలగా నిర్ధారణ చేసియున్నారు. ఇటువంటి ఐదు రాతి పరుపులు కప్పారావుపేట వద్దగల మునుల గుట్టలో గూడా వుండుటచే, జైన గుహగా పరిగణించ యుంటిని.
9. ఇటీవలి మద్రాసులో జరిగిన "Epigraphical Society Conference" లో శ్రీ పి. పరబ్రహ్మశాస్త్రిగారు శ్రీముఖ శాతవాహన నాణెములపై చక్కటి వ్యాసము చదివియున్నారు· వచ్చిన వక్తలందరూ ప్రశంసించినారు.
10. ఎపిగ్రాఫియా ఇండికా, నెంబరు–20, పుట–71.
11. ఆంధ్రదేశంలో జైనావశేషాలు, పుట, 12.
12. గుంటుపల్లె శాసనం : APGES, No. 3.
13. Indian Antiquary, Vol. II., P. 136.

# పునరంకితమ్

## శ్రీ మధుర్ జీ

సాయంకాలపు నీరెండ నీడలా
చిక్కిన సామాన్యుడి ఎండిన ఎదలో
మబ్బుల్లో మిణుకుమను చుక్కల్లాంటి ఆశ.

సమస్యల ఎడారుల వాడికి వేడికి
కనలిన కమలిన శుష్కవదనంలో
కాలయవనికను చీల్చి చూస్తున్న కళ్ళు

తూరుపు అరుణారుణ రాగం కోసం
క్షణక్షణం కత్తుల వంతెనల మీదుగా
సాగే అరని నెత్తుటి పారాణి కాళ్ళు.

చర్మాన్ని తొడుక్కొన్న అస్థిపంజరపు వేళ్ళు
రక్తంలాటి ఎర్రమట్టితో వ్రాస్తున్నాయి
మరో జనహృదయ నినాదాన్ని!!

# అభివృద్ధికి మారుపేరు ఆంధ్రప్రదేశ్

వింధ్యకు దక్షిణాన, ప్రకృతిమాత ఒడిలో ప్రగతి వీణగా వెలుగొందే మన తెనుగు నాడులో ప్రతిభావంతులైన కవులు, పరాక్రమశాలురు, శాస్త్రవేత్తలు, సాంకేతిక విజ్ఞానవేత్తలు, ఎంతో మంది కృషి చేసి దశాబ్దాల తరబడి నిత్యనూతనంగా వర్ధిల్లే మనదేశ ప్రగతికి బాసటగా నిలిచారు. కీర్తిబావుటాల నెగుర వేశారు.

దేశం నడిబొడ్డున నిలిచిన మన రాష్ట్రానికి అపారమైన వనరులతో ప్రకృతి ఎనలేని వరాలు ప్రసాదించింది. కొత్తపాతల మేలికలయికగా, సమగ్రమయిన సమ్మిశ్రిత సంస్కృతికి పుట్టినిల్లుగా పరిశ్రమల అభివృద్ధికి పట్టుగొమ్మగా నిలిచే భాగ్యనగరం రాజధానిగా వెలుగొందే ఆంధ్ర ప్రదేశ్ నేడు అందరి దృష్టి ఆకర్షిస్తూంది.

దక్షిణాది ధాన్యాగారంగా పేరు పొందిన మన రాష్ట్రంలో ప్రగతిశీలురైన మన రైతాంగం **1977-78** లో **86.60** లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పండించారు. ఈ సంవత్సరం **98** లక్షల టన్నుల వరకూ ఉత్పత్తిని పెంచేందుకు రైతులకు అన్ని సౌకర్యాలు కల్పించబడ్డాయి. జాతీయ నిల్వలకు మన రాష్ట్రం **10** లక్షల టన్నులకు పైగా ధాన్యం అందించింది.

జాతిని కొరతలకు దూరంగా వుంచేందుకు మన రైతులు అహరహం కృషి చేస్తున్నారు. అందుకే అభివృద్ధికి మారు పేరు ఆంధ్రప్రదేశ్.

---

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు.

27/78–79



శ్రీ సుమతీంద్ర నాడిగ్

# వేళ్లు

"చెట్లను చూస్తే నాకు మహా అసూయ. ఎందుకంటే అవి వేళ్లు తన్ని ఒకచోట నిలవాలని ఉంటాయి. అయితే నేను ఎక్కడా ఒక్కచోట ఉండకుండా ఒంటరి తనంతో అలమటిస్తూ, ఏ విషయం మీదా మనస్సు కేంద్రీకరించ లేకపోతున్నా''నని మొత్తుకుంటున్నాడు కవిశేఖరుడు చంద్రశేఖర్. తన పద్యాన్ని గద్య రూపంలో రాయడం, తన నవలల్లోని పాత్రలు తమ చుట్టూ తామే తిరుగుతూ పాఠకుల్ని బోరుకొట్టించడం, తన నాటకాలు అసంగతం కావడానికి బదులు అసంబద్ధమవడం – వీటన్నిటికీ అతనిచ్చే కారణం ఒక్కటే ! తన పరకీయతాభావం. దాన్నే మరోలా చెప్పాలంటే అతను వేరు తన్న లేకపోవడం.

బెంగుళూరువాసి చంద్రశేఖర్ ఒక సాయంత్రం లాల్‌బాగ్‌లో గ్లాస్‌హౌస్ పక్కనున్న ఒకచెట్టుకింద కూచున్నప్పుడు ఒక గేయం రాశాడు.

'వేళ్లు తన్నినుంచున్న ఓ వృక్షమా!
నేను పరదేశిని–
ఒక ఊరనిలేక, ఒక ఇల్లనిలేక
గాలికి తిరుగుతున్నాను!
కనీసం ఒక ఆడదానికూడా
అంటిపెట్టుకు నుండలేక పోతున్నాను.
అందుకే నేనిప్పుడు వేళ్లు లేనివాణ్ణి.
ఓ వృక్షమా!
నీ జీవితం సుఖమయం,
అది నాకు మృగ్యం.'

ఉన్నట్టుండి "శేఖరం!" అని ఎవరో పిలిచినట్టయింది. చుట్టూ ఎవరూలేనందువల్ల ఇది దయ్యమో, భూతమో, పిశాచమో అని భయమేసింది. ఒంటిపైని వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. వెన్నులోంచి చలిపుట్టుకొచ్చింది. ఒళ్లంతా చెవులు చేసుకుని కూచున్నాడు. మళ్లీ ఒకసారి "శేఖరం!" అని పిలిచినట్టయింది. చుట్టూ చూశాడు. దూరంగా పార్కుకు వచ్చిన జనం కనబడుతున్నారు. అంత మందిలో ఎవర్నయినా సహాయానికి పిలుద్దామనిపించింది. "ఎవరూ?" అన్నాడు. "నేను, నీ వెనకనేవున్న చెట్టుని" అని జవాబొచ్చింది. తిరిగి చూశాడు. ఆ చెట్టుకి కళ్లూ, చెవులూ, ముక్కూ వగైరా అవయవా లేవీ కనబడలేదు.

"భయపడకు" అన్నది చెట్టు.

చంద్రశేఖర్ "శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం"తో మొదలెట్టి తనకు వచ్చిన దండకాలన్నీ వల్లించడం మొదలెట్టాడు. పైకి మాత్రం "చెట్లకు మాట్లాడ్డం వచ్చా?" అన్నాడు.

ఆ చెట్టు "రాకేం! చెట్లకూ ఎన్నో భాషలన్నాయి. మనుషులకు మనుషులు మాట్లాడిందే అర్థం కానప్పుడు, ఇక చెట్లభాష ఎలా అర్థమవుతుందిలే!" అన్నది.

"మరి నీకెలా అర్థమవుతుంది నాభాష?" అడిగాడు శేఖరం.

"నేను కన్నడం నేర్చుకున్నాను. విజయనగర రాజులు కాలంలో మా ముత్తాత తాతకు తాత – నరసింహశాస్త్రి అనే ఆయన– ఆంధ్రదేశం నించి వచ్చి ఇక్కడ వేళ్లు విడిచాడు. తెలంగాణాలో ఆవర్, ఇంద్రగంటి అని రెండూళ్లున్నాయి తెలుసా? అక్కణ్ణించే మా పూర్వీకులు ఇక్కడికి వచ్చారు. వాళ్లనించే మా వంశ వృక్షం ప్రారంభమౌతుంది" అని ఊరుకుంది చెట్టు.

"అయితే నీకు తెలుగు వచ్చా?" అని అడిగాడు శేఖర్.

"రాదు! మా యింట్లో ఎవరికీ రాదు."

"మీదే కులం?" చంద్రశేఖరం భయపడ్డప్పుడు అతని నాస్తికత్వం, కులాతీత భావనలూ అన్నీ మటుమాయ మవుతాయి.

ఆ చెట్టు ముసిముసి నవ్వుతూ "జనప కులం" అన్నది.

"మీ కులంలో యింకా తెగలున్నాయా?"

దానికా చెట్టు "నీ మనసులో వున్నది తెలిసింది. కులం మనుషులు నిర్మించిందా, లేక ప్రకృతి సిద్ధమా అనికదూ నీ అనుమానం?" అన్నది

'అబ్బ! ఈ చెట్టుకెంత తలతిక్క!" అనిపించింది శేఖరానికి. అయితే ఎం. ఏ. పాసయిన తననే పల్టీలు కొట్టిస్తోందే యీ చెట్టు! ఇదేదో శాపగ్రస్తుడయిన ఋషి కాబోలునని అనుమానం వేసింది. "నీవేం చెబుతావో విందామనీ·····" అన్నాడు.

అప్పుడా పక్కనే వున్న మరో చెట్టు "ఏయ్, ముసలిపీనుగా! నాకు నిద్దరొస్తోంది చాలించు నీసొద!" అని అరిచింది.

ఈసారి మాట్లాడింది చెట్టే అని శేఖరానికి రూఢీ అయింది. రానురాను చీకటి ఎక్కువవుతోంది. మొదటి చెట్టు రెండో చెట్టును "నోర్మూసుకు పడుండవోయ్, చవలాయ్!" అని

శేఖరంతో ''బాబూ శేఖరం! నీవేం భయపడకు! ఆ చెట్టు ఇక్కడికి లేచిరాలేదు. ఊరికెనే తిట్టుకుంటూ వుంటుందంతే! ' అన్నది.

అతను గడియారం చూసుకున్నాడు. అప్పుడే ఏడయింది. చుట్టూ చీకటి ఆవరిస్తోంది. పార్కులో దీపాల కాంతి ఎక్కువ అవుతోంది.

''నువ్విక్కడెన్నేళ్లనించీ వుంటున్నావ్?'' అనడిగాడు శేఖరం.

''నువ్వు పుట్టడానికి ముందునుంచీ'' అన్నదా చెట్టు.

అతను ''నాకీరోజుకు సరిగ్గా నలభై సంవత్సరాలు'' అన్నాడు.

''నాకు ఎనభై'' అన్నదా జనప చెట్టు.

''మరి నువ్వింత హాయిగా వున్నావే!'' ఆశ్చర్యపోతూ అడిగాడు శేఖరం.

''ఒకరి జోలీ, శొంఠీ లేకుండా వున్నాను. అప్పుడప్పుడు కొందరు కుర్రాళ్లు నాపైన తమ పేర్లు రాసుకుంటుంటారు. ప్రేమికులు తమ ప్రియురాళ్ల పేర్లు చెక్కుతుంటారు. నాజిమా, ముంతాజ్, సరోజ, హేమ ఆ పేర్లన్నీ నీకు కనబడుతూనే వున్నాయిగా! వాళ్లలా చెక్కినప్పుడు కొద్దిగా బాధనిపించినా తర్వాత త్వరగానే మానిపోతుంది'' అందా చెట్టు.

అయ్య చెట్టుగారూ! నాకూ ఓ చెట్టులాగా వుండాలని వుంది!'' అన్నాడు చంద్రశేఖర్.

' తథాస్తు! నీ ఆశ ఇప్పుడే నెరవేరుతుంది!''

చంద్రశేఖర్‌కి ఉన్నచోటనే వేళ్ళు మొలవడం ప్రారంభించాయి. అతని రెండు కాళ్లకూ వేళ్ళు మొలిచాయి. ఆ రెండు వేళ్ళూ నేలలో చొచ్చుకుని ఒక తల్లివేరు పుట్టుకొచ్చింది దాన్నుంచి ఎన్నో చిన్నచిన్న వేళ్లు నేలలోకి పాకి పోతున్నాయి అతనికి అపారమైన ఆనందం! రోమాంచంగా వుంది. నేలలోకి తల్లివేరు దిగుతుండగా, మిగిలిన వేళ్లు పాకుతుండగా ఒక రకమైన చల్లదనం, హాయి, ''ఆహా హా,'' ''ఓ హో హో!'' అని సుఖంతో మూలిగాడు. వెచ్చగా, నున్నగా, తెరిపిగా ఫీలయ్యాడు చలి కాలంలో తన ప్రియురాలు ఛార్లెట్‌ను కౌగిలించుకున్నట్టు ఒళ్లు గగుర్పొడిచింది. అమెరికా నుంచీ వస్తూనే మాతృభూమి సామీప్యంలోని మధుర భావనతో తన్మయుడైనట్టు ఇప్పుడూ తన్మయుడయ్యాడు ఆ క్షణంలోనే హాయిగొల్పే బాధతో 'అమ్మా' అని మూలిగాడు. మూడేళ్లు వినని తన మాతృభాషను మొట్టమొదటి సారిగా విన్నట్టు, తన సరోజ సాంగత్యంలో మరువలేని సుఖాన్ననుభవించినట్టు, క్షణ క్షణానికీ మాటలలో యిమడని విచిత్రమైన భావాలు అతని అణువణువునా వ్యాపించాయి. 'అమ్మా, అయ్యో, ఆహా, ఓహో' అని మధురయాతనని అనుభవించాడు. ఆ అసామాన్యమైన అనుభవంలో మునిగివున్నప్పుడు, తల్లి గర్భంలో మళ్లీ చేరినట్టు, ఒక రకాలైన అనుభవాల్లో అంతులేని సుఖపునిధి దొరికినట్టు సంతోష పడ్డాడు ఆ సమయంలో ఉన్నట్టుండి శేఖరానికి తనయిల్లు గుర్తుకొచ్చింది.

అతని పిల్లల బూట్లు చిరుగులు పడ్డాయి. ఎన్నోసార్లు స్కూలు వాళ్లకి ఏదో నెపం చెప్పి తప్పించుకున్నాడు. అమెరికా నించి వచ్చినప్పట్నించీ పనిదొరక్క పూటగడవడమే కష్టంగా వున్నదిప్పుడు. పిల్లలకి కొత్తబూట్లు కొనివ్వకపోతే వాళ్ళని క్లాసు నుంచి బయటకి పంపడం ఖాయం. ఈ రోజు ఏదోలా ఎక్కడైనా అప్పయినా చేసి వాళ్లకి బూట్లు తీసుకురావాలనుకున్నాడు. అప్పుడు కిరాణా కొట్లో మూడు నెలల్నించీ పేరుకుపోయిన బాకీ గుర్తుకొచ్చింది. అమెరికాలో వున్నన్నాళ్లూ తనభార్య పైన ఇంటి బాధ్యతలన్నీ పడ్డాయి. కొట్టువాడు తనని అడగలేడనే ధైర్యం వున్నా ఆమెను ఇబ్బంది పెడ్తాడేమోననే బాధ ఉండేది మనసులో. రేషనుకూ, ప్రతిరోజూ డైరీపాలకీ డబ్బు సర్దడం కష్టమై భార్యని విసుక్కోవడం, కసురుకోవడం ఎక్కువయిందీ మధ్య. ఇదంతా ఒక్కసారిగా గుర్తుకొచ్చి, ముఖ్యంగా పిల్లల బూట్లకేదయినా ఒక ఏర్పాటు చేసి తీరాలని యింటికి బయలుదేరుదామనుకున్నాడు.

కానీ పైకి లేవబోతే అతనికి మొలచిన వేళ్లు అడ్డం పడ్డాయి. అప్పటికే అతని వేళ్లు ఆ పెద్దచెట్టు వేళ్లకు అల్లుకుపోయున్నాయి. ఎన్నో అడుగులు లోపలకి కూడా పోయివుండవచ్చు. శేఖరం అన్ని వేపులా కాళ్లని లాగిచూశాడు. వంగి వేళ్లని బయటకి పెకలించడానికి ప్రయత్నించాడు. ఆ చెట్టువేపు దీనంగా చూస్తూ ''అయ్యా చెట్టుగారూ! నే నిప్పుడింటికెళ్లకపోతే నాభార్యాపిల్లలూ చాలా ఇబ్బంది పడిపోతారు. దయచేసి నన్ను పోనివ్వండి'' అని వేడుకున్నాడు. అయితే ఆ చెట్టు ''ఏం మనిషివయ్యా నువ్వు! ఇప్పుడో మాటా, కాసేపటికి మరోటీనా? ఉన్నది వద్దంటావు. కావాలన్నది దొరగ్గానే దాన్ని వెంటనే వద్దంటావు. లేనిది అడిగినప్పుడంతా దొరుకుతుందనుకున్నావేంటి? ఎలాగైనా తగలడు. ఇక నీతో మాట్లాడ్డం నాదే బుద్ధితక్కువ. మాట్లాడి ప్రయోజనమూ లేదు ఈ క్షణంనించి నీ మాటలు నాకూ, నా మాటలు నీకూ అర్థంకావు, అంతే!'' అని మౌనం వహించింది.

చంద్రం వేడుకున్నాడు, పొగిడాడు, అంగలార్చాడు, గింజుకున్నాడు, ఏడ్చాడు. అంతా నిష్ప్రయోజకం.

''నేను చెట్టునైపోయాను. ఇక మనిషిగామారనే మారను'' అనే భయంతో వజవజా వణికిపోయాడు. ''ఇక్కడెవరూ లేరా! చస్తున్నాను! నే చచ్చిపోతున్నాను,'' అని అరిచాడు.

లాల్ బాగ్ తలుపులువేసే టైమైంది. ఒక తోటమాలికి ఇతడి అరుపులు వినబడి అక్కడికి వచ్చాడు బోరున కన్నీరు కారుస్తున్న శేఖరాన్నిచూసి ''ఏం బాబుగారూ! ఏ దైనాకరిచిందా'' అనడిగాడు.

చంద్రశేఖరం తన వాచీ తీసి అతనికిస్తూ "చూడు నాయనా' నా దగ్గర డబ్బేంలేదు. నేను చెట్టునైపోతున్నాను. ఈ వాచీ నీవే వుంచుకో. గాంధీ బజార్లో కెనరాబాంక్ పక్కనున్న యింట్లో నా స్నేహితుడు మహేశ్ అని వున్నాడు. వాణ్ణి వెంటనే పిలుచుకొస్తావా ? లేకపోతే నేను చచ్చిపోతాను" అన్నాడు ఏడుస్తూ.

"ఏం విచిత్రంగా మాట్లాడుతారు బాబూ! ఇంటికెళ్ళండి. నేను గేటుకి తాళం వెయ్యాలి" అన్నాడు తోటమాలి.

"నిజం ! నా కాళ్లకు వేళ్ళు మొలిచాయి. కావలిస్తే నన్ను లాగిచూడు' అన్నాడు చంద్రం. తోటమాలి లాగిచూశాడు. కాళ్ళు కదల్లేదు.

"ఎప్పుడూ నేనిలాంటి విచిత్రం చూసెరగను. మీ స్నేహితుణ్ణి పిల్చుకొస్తానుండండి !" అని అతను పరుగు తీశాడు. ఆ నిర్జనమైన లాల్ బాగ్‌లో గ్లాస్‌హౌస్ దగ్గర చెట్టు పక్కన వేళ్ళు మొలిచి నుంచున్న చంద్రం మళ్లీ ఆ చెట్టును పరిపరివిధాలా వేడుకున్నాడు. అయితే చెట్టు కిమ్మనలేదు. అతను తన్ను తాను తిట్టుకున్నాడు. వెయ్యి దేవుళ్లకు మొక్కుకున్నాడు. ఆ తోటమాలి వచ్చేలోపలే తనవేళ్ళు ఇంకెంత దూరం భూమిలోకి వెళ్లిపోతాయోనని భయపడ్డాడు ఇంకానయం ! కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ ఇంకా మొలవలేదు పూర్తిగా చెట్టునైపోతే తనకు మాట్లాడ్డం కూడా చాతకాక పోవచ్చు. నలభై ఏళ్లు బతికి తనుసాధించిందేమిటని ప్రశ్నించుకున్నప్పుడు కలత పడిందతని మనస్సు... ...

* * *

అలా ఎంతసేపున్నాడో చంద్రశేఖరం. ఒక యుగం గడిచిందనిపించిందతనికి. స్నేహితుడు మహేశ్ వచ్చాక తన గోడంతా వినిపించాడు. మొదట అతను యీ కథ నమ్మలేదు. మాలి సహాయంతో చంద్రాన్ని పైకి లాగాలని చూశాడు. అయితే కాళ్లని కూడా కదిలించలేకపోయాడు. అప్పుడు మహేశ్ కూడా చంద్రం చెప్పిన దాన్ని నమ్మి తీరాల్సివచ్చింది. అతనికా పెద్ద చెట్టు దగ్గర నిలవడానిక్కూడా భయమేసింది.

"ఏం చేసేదిరా యిప్పుడూ ?" అని అతను చంద్రాన్నే అడిగాడు.

"మీరిద్దరూ కలసి నా కాళ్లని కత్తిరించెయ్యండి" అన్నాడు చంద్రం.

"అలా వీల్లేదు. అలాచేస్తే రక్తంకారి చచ్చిపోతావు" అన్నాడు మహేశ్.

"అయితే నువ్వు వెంటనే వెళ్లి ఎం.ఎల్.ఏ. శంకరప్పకు చెప్పు. అతనూ, నువ్వూ — మీకున్న ఇన్‌ఫ్లుయెన్సునంతా ఉపయోగించి, మంచి సర్జనును త్వరగా తీసుకురండిక్కడికి" అని వేడుకున్నాడు చంద్రం.

మహేశ్ తన చిన్ననాటి స్నేహితుడికెలాగైనా సహాయం చేయాలని, తోటమాలి నక్కడే వుంచి, అక్కణ్ణించి పరుగెత్తాడు.

* * *

నమ్మ శక్యంగాని యీ విషయాన్ని ప్రతివాడికీ వివరించి చెప్పి,డాక్టర్నిపిలుచుకువచ్చేటప్పటికి అర్థరాత్రయింది. విక్టోరియా ఆస్పత్రిలోని పెద్ద పెద్ద డాక్టర్లూ, అనెస్తీషియావాళ్లూ, నర్సులూ వాన్‌లో ఆపరేషన్‌కి కావలసిన వన్నీ తీసుకువచ్చారు. అక్కడే, చంద్రం పైనే ఒక టెంటు వేసి, రక్తపరీక్ష చేసి, బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్‌కి ఏర్పాటుచేసి అనెస్తీషియా యిచ్చి, చంద్రం కాళ్లని కత్తిరించేశారు.

మరుసటి రోజు పత్రికలనిండా అతడిమాటే. అతనికి మెలకువ వచ్చిన వెంటనే అనెస్తీషియా ప్రభావంవల్ల ఏంజరిగిందో తెలియక పోయినా క్రమేణా కాళ్లనెప్పి, బాండేజీలవల్ల తన కేమైందీ అర్థమైంది. అతని భార్యాపిల్లలూ ప్రతిరోజూ అతణ్ణి చూడ్డానికి వస్తూండేవారు. ఒక నెలరోజుల తర్వాత కుంటుతూ ఊతకర్రల సాయంతో ఇంటికి వచ్చినప్పుడు అతని భార్య అన్నది: "అక్కడే ఇంకొన్నాళ్లుంటే మీ సొమ్మేం పోయేది ? ఎంతోమంది మిమ్మల్ని చూడ్డానికని టికెట్టుకొని వచ్చేవాళ్ళు. ఆ డబ్బుతో మన బతుకులు గడిచేవి. ఇప్పుడు చూడండి ! అప్పుచేసుకున్నాం. తినడానికి గతిలేదు. కాళ్ళూ పోగొట్టుకున్నారు."

చంద్రశేఖరానికి "తానక్కడే చెట్టుగానే మిగిలిపోయుంటే!" అనిపించింది.

కన్నడానికి శ్రీ ఎస్. రమేశ్
అనువాదం శ్రీ దేశెట్టి కేశవరావ్



# రాళ్ళపల్లి పీఠికలు - ఒక సమీక్ష

రాళ్ళపల్లి పీఠికలు ; సంపాదకులు : ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ, ఆర్వీయస్ సుందరం; ప్రచురణ : రాళ్ళపల్లి అభినందన సమితి – బెంగళూరు ; వెల రు. 15/– డెమ్మి 1/8 XX + 382 పుటలు; ప్రతులకు : రాళ్ళపల్లి అభినందన సమితి, 53,2వ బ్లాక్, త్యాగరాజనగర్, బెంగళూరు–560028 లేదా ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికందరాబాద్ – 3.

'ఎవరురా నిను వినా ?' అంటూ త్యాగయ్య రామచంద్ర మూర్తిని ప్రస్తుతించినాడు అట్లే సంగీత సాహిత్య తత్త్వ నిష్ణాతులైన మహనీయులలో శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి స్థానం అద్వితీయమైనదనటం సత్యదూరం కాదు.

తెలుగు సాహిత్య విమర్శకు మార్గదర్శకులైన రాళ్ళపల్లి వారు పీఠికా రచనలో కూడ అగ్రగణ్యులు.

సాహిత్య సేవావ్రతులైన శ్రీయుతులు ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ, డా॥ ఆర్వీయస్ సుందరం, శివలంక శ్రీరామచంద్ర మూర్తిగార్ల సంపాధకత్వములో యిదివరలో 'అనంతరాగం' అన్న రాళ్ళపల్లి అభినందన గ్రంథము సర్వాంగ సుందరంగ వెలువడింది. రాళ్ళపల్లి వారి బహుముఖ ప్రతిభకు దర్పణంగ వెలువడిన ఆ గ్రంథము సాహితీ ప్రియుల మన్ననలందుకొన్నది. ఆ అభినందన సమితి వారే సాహిత్యాభిమానులకు అందజేసిన మరో మనోజ్ఞమైన సంపుటి 'రాళ్ళపల్లి పీఠికలు.'

'శతాధికములైన 'రాళ్ళపల్లి పీఠికలు' రమణీయములు, కమనీయములు ఆలోచనామృతాలు' అంటూ ఈ పీఠికాసంకలనమునకు 'పీఠికార్చనము'ను ప్రవేశికలో ఆచార్య జి.యన్ రెడ్డిగారు శర్మగారి పీఠికా రచనలలోని కళాస్వరూపమును ఆవిష్కరించినారు. వారి మాటల్లోనే "అవి విషయ ప్రధానములు· విమర్శ తత్త్వ సమన్వితములు, సమీక్షా ప్రాయములు, వైయక్తిక వచన రచనా శిల్ప విలక్షణములు. ఎవరో ఒక రచయిత కోరికను మన్నించి మర్యాద కోసమో, మొహమాటానికో నాల్గుమాటల్లో తన అభిప్రాయాన్ని వ్రాసినా అందులోనూ ఒక మెలకువో, ఒక మురిపెమో, ఒక చిన్న మెరుపో ప్రతిబింబితమై వుంటుంది. పెద్ద పీఠికల్లో విషయౌన్నత్యం, అభిప్రాయ గాంభీర్యం, పటుత్వం తప్పని సగసవాక్కు, శైలీ సంపన్నత ప్రధాన లక్షణాలు· నిజానికి రాళ్ళపల్లి వారి పీఠికలు ఒక నిర్మితి కన్న సుందరంగ, శిల్ప శోభితంగ రూపొంది వుంటాయి' అనటం ప్రత్యక్షరసత్యం.

ఈ గ్రంథములో ప్రాచీన కవిత్వం, ఆధునిక కవిత్వం, నాటకాలు, నవలలు–కథలు, వ్యాసములు–విమర్శలు–పరిశోధనలు ఇతరములు అను విభాగములలో రాళ్ళపల్లివారు వివిధ రచనలకు అందజేసిన తొలిపలుకులు, ఆశీర్వచనాలు, మంగళాశంసలు, సంపాదకీయాలు, పరిచయాలు, అభిప్రాయాలు సంకలనమొనర్చబడినవి.

ప్రాక్పాశ్చాత్య సమీక్షా సిద్ధాంతములను ఆకళించుకొన్న శర్మగారి సాహిత్య సమాలోచనారీతి విశిష్టమైనది. వారి దృష్టి సత్యనిష్ఠమైనది. రచనలోని దోషములను నిష్పక్షపాతముగ వెలువరించు నిర్భీకత వారి ప్రత్యేకత. శర్మగారు సాహిత్యమర్మవేది. "తత్త్వమును తెలిసికొనవలెనను నాశ, తెలిసిన వానిని నిర్భయముగ ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి నిబంధనమై యిరు ప్రక్కల యందు మలుగులేని మంచి పదునుగల మరకత్తి వంటి 'రచనా శక్తి' దానిని మెలుగిచ్చునట్టి సూక్ష్మదృష్టి 'గాయపు మందు కత్తికే పూసికొట్టినట్లు, తిట్టుచునే నవ్వించు హాస్యకుశలత రాళ్ళపల్లివారి సాహిత్య విమర్శనా మూలసూత్రాలు. ఈసూత్రాలు పీఠికా రచనలో అనుస్యూతములై చోటు చేసుకున్న తీరు విలక్షణమైనది. వాటిలో కొన్నిటిని నివేదించటం సముచితం

వావిళ్ళ వారు 1917లో ప్రచురించిన 'వేమన పద్యములు' పీఠికలో : '...ఎంత కొంచెము మాటలలో నెంత యర్థమిమిడింప వచ్చునో యితనికి గాని యితరులకు దెలియదు. తిక్కనకీ గుణము కలదుకాని యీ సౌలభ్యమతనియంద పూర్వము ఏ మాటనేచోట నుపయోగించిన హృదయమున నాటునో యితడే యెఱిగినవాడు· సంగ్రహశక్తి యందలి సత్త్వ యితనివలె జూపగలవాడు లేడు. వీనికి దోడు సహజమైన హాస్య ప్రియత్వమొకటి నిండియున్నది. ఖండించు సమయములందెల్ల బ్రాయికముగ రోషావిష్టుడై జిహ్వ నుపయోగించెను కాని, యెందైన హాస్యమునుపయోగించెనేని తలచుకొని తలచుకొని కడుపులు చెక్కలగునట్లు నవ్వజేయగలడు. 'తిట్టినను సరే బాగుగా తిట్టినాడురా' యని తిట్టించుకొన్న వారే మెచ్చవలసి యుండును. ఇదియే యితనియందలి ఇంద్రజాల విద్య!" (చూ. పు 19)

తిరుమల తిరుపతి దేవస్థానము వారు పద కవితా పితామహుడగు అన్నమాచార్యుల సంకీర్తనముల సంపుటములను పరిష్కరించు మహత్తర కృషిని రాళ్ళపల్లి వారికి అప్పగించటం అత్యంత ప్రశంసనీయం. అన్నమయ్య పాడిన ఆధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్తనల సంపుటములో పెక్కింటిని శర్మగారు పరిష్కరించారు.

కీర్తి కోసం, కూటికోసం రాజులను, రాజోద్యోగులను ఆశ్రయించిన కవులు నాడు నేడూ వున్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించిన పాండురంగ మాహాత్మ్యమునకు వ్రాసిన ఉపోద్ఘాతములో: "......కృతిని నరాంకితము చేయుట నరకహేతువని రోసి ఇష్టదేవతాంకితము చేసిన పోతన్న, సంకుసాల నరసయ్య వంటి వారును కొందరు గలరు. ఇంకను కొందరు ఆత్మాపహారమునకైనను ఒడబడి తమ కర్తృత్వమును ప్రభువులకు తర్పణము

విడిచిన వారున్నారు. సంస్కృత సారస్వతమున మహోన్నత ప్రజ్ఞా పండితులగు చెరుకూరి లక్ష్మీధర పండితుడు, అప్పయ్య దీక్షితులు, గోవింద దీక్షితులు మొదలగు వారు ఆ పని చేసినారు. వారిలో బుద్ధిమంతులు కొందరు తమ కృతులను తమ పేర కొన్ని, తమ ప్రభువుల పేరకొన్ని ప్రతులను వ్రాయించి యథానుకూలముగా ఇంటను బైటను ప్రకటించి నెమ్మదిపడిన వారును గలరు! తెలుగులో రంగనాథుడు, అల్లసాని పెద్దన మొదలగు వారు ఇట్టిపని చేసినారని యూహింప నవకాశము గలదు. కాని ఆ మాట చెప్పినచో నేడు అభిమానా వేశముతో, ఆగ్రహముతో మీదికి దూకు చరిత్ర వానదూకులు గలరు! పెద్దల యెడ అభిమాన గౌరవములు తమకు మాత్రమే యున్నట్లు ఆ పెద్దల అంతరంగ బహిరంగ ప్రవృత్తు లన్నియు తామే యెరిగినట్లు! పోగా, ఇది బ్రాహ్మణేతరులకు వచ్చిన కీర్తి నోర్వక బ్రాహ్మణులు పన్నిన యెత్తుగడయని వింతయక్కసు పడు మర్మజ్ఞం మన్యులున్నారు.' ఈ వ్యవహారములో నిజముగా, కర్తృత్వమును అమ్మిన వారిది కడుపు కక్కుర్తి, కొన్నవారిది పేరు పేరాస; ఇంతేకాని ఇద్దరి పనియును అల్పమే, అసహ్యమే. సత్య శ్రద్ధ గలవారు ఈ నాటక రంగమందలి వన్నెల తెరను దూరము నుండి చూచి తృప్తిపడక సమీపించి చూచినచో దాని చిరిగిన తూట్లలో ఎన్నో వెనుకటి రహస్యములు కంటి కందును'' (చూ. పు 109).

రాళ్ళపల్లి వారు 1912లో రచించిన 'మీరాబాయి' ఖండ కావ్యములో మీరాను అభాగినుల ప్రతినిధిగా చిత్రించినారు. తమ రచనకు వారే రచించిన పీఠికలోని వాక్యాలు ఆలోచింపదగినవి. ఓపిన కొలది శోధించియున్నాను. నా కన్ను మీరిన దొసంగులిందే వైనను సహృదయాగ్రగణ్యులగు పండితులు కరుణించి నాకు దెలిపిన సాధ్యమైనంత సవరింతునని సవినయముగ విన్నవించెద. పీఠికాలేఖన పద్ధతిననుసరించి ప్రార్థించితిగాని యిందువలనం బ్రయోజనముగానను. ఎఱిగిన సహృదయులు దోషములు మన్నింతురు. కాని కవికి తెలియజేయరు. ఇకనెఱుగని దుర్హృదయులు గుణములనే దోషములుగ గ్రహించి వషట్కారముల కుపక్రమింతురు. ఇక మాకు గరుణించి తప్పులదెల్పువారెవరు?(చూ. పు 123)

మహా కావ్యములకు, ఖండ కావ్యములకు గల లక్షణములను వివరిస్తూ వాటికి విస్తరము స్వాభావికమైతే వీటికి సంగ్రహము స్వభావ లక్షణమన్నారు శర్మగారు. ఖండ కావ్యములు కారణము తొలగిన వెంటనే నశించును అంటూ గాంధీ మహాత్ముడు ఖద్దరు ప్రచారము చేస్తున్నపుడు వందల కవులు రాట్నములపై కావ్యములు రచించినారు. కాలక్రమములో రాటములటుకెక్కడముతో కవులు రాటమును విస్మరించడమూ జరిగింది తాత్కాలిక ఉద్రేకములకు లోనై రచించిన కవితలకు శాశ్వతత్వముండదు 'క్రొక్కారు మెఱుగు' (1934) అను కవితా సంపుటి ప్రస్తావనలో వెల్లాల ఉమామహేశ్వరుడు గారి 'ఆంధ్ర వీరుడా!' అను కవితను గురించి వ్రాస్తూ ''ప్రచలితమైన ఆంధ్రోద్యమమునకు ఫలముగా ఆంధ్రులను ప్రోత్సాహ పరుపవలెనని అందరివలె కవిగారికిని నుద్రేకము కల్గినది. కాని యెంత నిజమైనను ఆకస్మికముగా పైబాఱిన తెఱవంటిది గావున ఈ భావము తీవ్రముకాదు. విమర్శ సహము గాదు. కావున స్థిరమును కాదు. లేపవలసిన వాడిప్పుడు మనదేశమున ఆంధ్రు డొక్కడేనా? అఱవలు, కన్నడులు మొదలుగా అందఱును కూర్చుండియో, నిద్రించుచునోయున్న వారి నడుమ వీడొక్కడు మాత్రము లేచి గంతులు వేసినచప్పటి భరత ఖండముద్ధారమగునా? ఆ వీరుల కన్న నీ వీరుడెందులో ఎక్కువ? ఏమిట దక్కువ? ప్రాతకాలపు పల్నాటి వీరులవలె కత్తి దీసిదూసి లెమ్మని కవి పురికొల్పును ఏల? ఎవరిని నఱుకుటకు? పాశ్చాత్యులనా? లేక ఆంధ్రులు కాని వారినం దరినా? అదియుగాక ఆంధ్రులలోనే 'వీరు'లు కాని వారందఱినా? కత్తి నెత్తుటయనగా నిజముగా నట్లేయని అర్థము కాదు' కార్య శూరత్వమునకు ప్రేరేచు అతిశయోక్తి మాట-అని యందురేమో! నేనును అదే చెప్పవచ్చినది. అసలు తక్కువైనప్పుడే అతిశయోక్తి మార్గము.'' (చూ. పు. 126)

స్వభాషాభిమానము మెచ్చుకోదగినది కాని పరభాషీయులను వారి వారి భాషను విడిపించి తమ భాషను బలవంతముగా నేర్పుట నింద్యమని శర్మగారి అభిప్రాయము. కోలారు జిల్లాకు చెందిన గుమ్మరాజు రామకవిగారి '(శ్రీ) చౌడేశ్వరీ మాహాత్మ్యము'(1935) నకు వ్రాసిన ప్రస్తావనలో పూర్వకాలమున బహుభాషా పాండిత్యము నకై యవకాశము గల చదువరులందఱును ప్రయత్నించుచుండిరి. గాని పరభాషా నాశనముచేత తృప్తిపొంద ప్రయత్నించిన వారెవరునూ గానరారు. వందల కొలది భాషలుగల భరత ఖండములో ఇట్టియన్య భాషా ద్వేషమును పెరుగనిచ్చినచో చిత్త సంస్కారమునకు గల్గు నష్టమట్లుండగా అసలు భారతీయుల సంఘీభావమునకే మూల చ్ఛేదము గలిగి యనర్థముగా పరిణమించును ఇన్నాళ్ళును భరత ఖండము వారియైక మత్యము లేమికి భాషాభేద మొక కారణముగా నుండలేదు. ఇప్పుడు తక్కిన వానికిదోడు అది యొక ప్రబల కారణ మగు సూచనలున్నవి. దానిని విఱుచుటకు శాభిమాను లందఱును ప్రయత్నింపవలయును. (చూ పు. 134)

కవులు సహజముగా ప్రచారమునకై వెంపరలాడరు. ఆత్మానందమే ప్రధాన లక్ష్యంగా వ్రాసే కవులు 'ఆకుచాటున పిందెవలె' వుందురు. భాస్కరాచార్య రామచంద్రస్వామిగారి 'యాత్రికుడు' (1942) ఖండకావ్యానికి వ్రాసిన తొలి నోములో :

''పుట్టలిని వట్టివని తాకబోతి గాని
ఫణ మణీ రశ్మియొకటి కన్నులం బొడిచె
వెలికి రాబోక తమ వెలుంగులకె తనిసి
ఎన్నియే వున్నవో లోన నెవరి కెరుక! '

అన్నారు శర్మగారు. (చూ. పు. 136)

మతము మంచితనాన్ని పెంచుట కుద్దేశింపబడినది. కాని అచట గూడ సంకుచితత్వ మావేశించినది. డా॥ సి. నారాయణరెడ్డి గారి 'నాగార్జున సాగరం' కావ్యానికి మంగళాశంసలు తెలుపుతూ రక్తిలోను విరక్తిలోను సౌందర్యమున్నది వికారము గూడ

రెంటను గలదు. రెండును పరస్పర సంస్కారకములుగ, పోషకము బుగ వుండగలవు, వుండవలయును ఈ తత్వమును గమనింపక పోవుటచేతనే మన దేశమందు చార్వాక మతముతో గూడ బౌద్ధ మతమును నశించిపోయినది. గురుదేవుడు, పద్మదేవుడు ఇద్దరును శుష్క హఠవాదులే. వీరిరువురి నడుమ పరవశముగా నలిగినది శాంతిశ్రీ. (చూ. పు. 164)

రాళ్ళపల్లి వారి పీఠికలలో సమకాలీన సామాజిక చిత్రణ ముతో పాటు రాజకీయ, చారిత్రక పరిణామాలు కూడ చోటు చేసు కొనుట యొక ప్రత్యేకత. రాయలసీమ పెద్దచిన్న కొండలు, అడ వులు గలిగి అపారమైన గోధనమును బోషించు సర్వసమృద్ధమై యొకానొకప్పు డుండినది...... ఆ వైభవ పరిశేషము క్రమముగా మావంటి వారి కన్నుల యెదుటనే అంతర్ధానమైనది. అక్కడి లెక్కలేని చెరువులలో ఎన్నో తెగిపోయినవి. ఉన్నవి ముప్పాతిక పూడి పోయినవి.

అడవులన్నియు వంట చెఱకులై పొగబాఱి పోయినవి. ఇక మనుష్యులమాట చెప్పనేల? ఆంగ్లేయుల దొరతనములో ఈ సీమ ఎన్ని విధముల ఎండవచ్చునో అన్ని విధముల ఎండినది. ఎండింప బడినది. ప్రజల పరవశత అధికారుల అలక్ష్యము ఇరుగు పొరుగుల వారి స్వార్థపరత వీనికి తోడు దైవము దయదప్పట. ఇన్ని కలసి నేటి రాయలసీమ రూపుగొన్నది మీదు మిక్కిలి ఇది రాళ్ళసీమయని, అరణ్యమని ఇక్కడి వారికి చదువు సంతలు లేవని, వారు అనాగరికులని పరిహాసమును, ఆక్షేపమును చేసిన వారును కొందరుండిరి, నేడును లేకపోలేదు. (విద్వాన్ విశ్వంగారి 'పెన్నేటి పాట' పీఠిక చూ. పు. 166)

అనువాద రచనమొక స్వతంత్ర కళ. దాని విశిష్టతను తెలుపుచూ "మూలరచన యందలి సారమైన భావమును, ఆర్జవ ముతో ననుభవించు సహృదయత దానిని తమదిగా తమ భాషలో పునశ్చరణగా భావించు శక్తి, స్వభావ మర్యాదలు చెడనీయక దానిని పునస్సృష్టిచేయు స్వతంత్ర కావ్యకౌశలము ఇవి గలవారికి మాత్రమే అట్టి రచన సాధ్యము (తెనుగు మీరా—ఓరుగంటి రామచంద్రయ్య. మా. పు. 177)

శ్రీ కుంటిమద్ది శేషశర్మగారి 'సుధాబిందువులు' (1956) కావ్యమునకు వ్రాసిన తొలిపలుకులలో "రాజుల యాశ్రయమున నెమ్మదిగా బ్రదికిన కాలమున తెలుగు కవుల లేఖిని శృంగార భావ లహరిలో తల మున్కలువేసి తేలగండ్లు వేసినది. పాశ్చాత్యుల దాస్య మున నీరసమై నిలచిన నాళ్ళలో విప్లవాత్మకమైన అల్లకల్లోలములు చెలరేగించి ఆవేశము ననుభవించినది. స్వతంత్రత సిద్ధించిన తరు వాత త్రివర్గ మార్గముల మూటను నడవలేక కాళ్ళీడ్చవడుచుండగా చేయునది లేక సహజముగ సర్వశక్తుడగు శ్రీనివాసుని శరణుజొచ్చి హృదయావేదనను ఆయన పాదాలపై ధారవోయచొచ్చినది అట్టి కవితలలో యీ లఘు స్తోత్ర మొక్కటి! (చూ. పు 184)

నీతి సార్వకాలికము. సార్వజనీనము. సుందరపాండ్య విరచిత ఆర్య అను తమ రచన (1970)కు వ్రాసిన ప్రస్తావనలో రాళ్ళ పల్లివారు "...నీతుల పుస్తకమనగానే డైడాక్టిక్—శుష్కోప దేశము అనుకొని వానిని తాకకుండుట మనలో సామాన్యము. అనేక నీతి పుస్తకము లట్టివే యగుట నిజమే. అట్టి వానిని ప్రకటిం చుట మొదలు చెఱచు బేరమేయగును. మఱి నీతి కావ్యకళకు వస్తువు కాజాలదను సామాన్య చాదస్త మొకటి మనలో వ్యాపించి నది" (చూ. పు. 237).

మహాభారతములో ద్రోణాచార్యుడొక విచిత్ర వ్యక్తి. దీపాల పిచ్చయ్యగారి 'ద్రోణ ప్రశస్తి'కి వ్రాసిన పండితాభిప్రాయములో ద్రోణాచార్యుడు గొప్పవాడే. అసాధారణ వ్యక్తియే. మేధావియే కాని ఆదర్శమూర్తి కాదు. కనుకనే మన ప్రాచీనులెవరును అతనిని ఆరాధ్యమూర్తిగా గ్రహింపలేదు. భీష్మునికి మనలోగల గౌరవము, ఆధ్యాత్మికోన్నతి ద్రోణునికి లేదు. గొప్పవారందరును మంచివారు కారు అను తత్వమును మహాభారతము ద్రోణపాత్ర మూలమున మనకు తెలిసినది. (చూ. పు. 253)

పానుగంటివారి 'సాక్షి' వ్యాసములు 1913లో 'సువర్ణ రేఖ' పత్రికలో కొన్ని వెలువడినవి. కాని కొంతకాలము నిలిపివేయ బడి 1920నుండి ధారావాహంగ 'ఆంధ్రపత్రిక'లో ప్రచురింప బడినవి 'సాక్షి' వ్యాసములవలె 1917లో వదరుబోతు వ్యాసములు అనంతపురంలోని 'స్వామీ విలాస ప్రెస్సు'లో ముద్రితమై పక్షమున కొకతూరి క్లుప్తముగ నాలుగైదు పుటలలో వెలువడేవి. 50 వ్యాస లలో 22 మా తము పుస్తక రూపమున వెలువడినవి (1932లో). ఈ రెంటి విశిష్టతను తెలుపుచూ శర్మగారు "సాక్షి" సంఘమందలి

ప్రముఖపాత్రమగు జంఘాల శాస్త్రికి నోరు తప్ప మరియేమైనా నవయవములుండెనా? యను సందేహము చదువరులకు గలిగినను అది సహజముగానే తోచును. 'వదరబోతు' మార్గము కొంతవరకు మృదువైనది. ధ్వని ప్రధానము. ఇరువురును తిట్లలో మేటులై నను 'సాక్షి' తిట్లలోని తెగువ 'వదరబోతు' తిట్లకులేదు. (చూ. పు 286).

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి 'ప్రబంధనాయికలు' అను వ్యాస సంపుటికి (1942) వ్రాసిన ఉపోద్ఘాతములో ఆచార్యుల వారి వైశిష్ట్యమును తెలుపుతూ ''నారాయణాచార్యుల వాక్కు వణకులేనిది. స్వతంత్రమగు భావనాబలము, తీవ్రములైన భావములు,అడకువలేని యభిప్రాయములు,అనుభవశూరుల లక్షణము లన్నియు నిండుగలవు. తోచిన పొగడ్తను కాని తెగడ్తను గాని వెను దీయక విసరి చెప్ప నార్జవ మీతనికి గలదు. ముఖస్తుతిగాని ముఖ నిందగాని విద్యగా నేర్చిన పాతకమున బోనివాడు. అనుభవమునకు మితిలోపము వుండవచ్చు. కాని అది ఆరోపితము మాత్రము కాదు. భావోద్రేకముతో కావేరి వలె అతని వాగ్ధార తెగదూకులు దూకు చుండును. ఆ వేగములో కొన్ని యభిప్రాయములు అందదుకులు గానవచ్చును కాని వానికి కారణము చారుదత్తుడు చెప్పినట్లు ''యౌవనమ్మత్రా పరాధ్యతి న చారిత్రమ్ (మృచ్ఛ కటిక)......... ఇటీవలి సాహిత్యము బ్రదుకు నుండి బయటపడి ఉపన్యాస వేదికలను, ఉపాధ్యాయ పీఠములకును అంటుకొని యాత్ర గడుపుచున్నది. మరల దానిని నిత్యజీవితముతో మేళవించి స్వతంత్రానుభవ తత్త్వ మును ప్రసాదించునట్లు చేసికొనమేని బ్రదుకులలో బండతనము తప్ప మరేమియు మిగలక పోవును. ఈ వ్యాసముల వంటి రచన లట్టి పునరుజ్జీవనమునకు చాలతోడుపడునని నిస్సంశయము.'' (చూ. పు. 291)

సురవరం ప్రతాపరెడ్డిగారు రచించిన ''ఆంధ్రుల సాంఘిక చరిత్ర'' (1949) పై తమ యభిప్రాయమును వ్రాయుచు ఒకచోట ''యథార్థముగా బ్రాహ్మణుల యందే అన్ని విద్యలు కేంద్రీకృతములై యుండెను'' అన్న ప్రతాపరెడ్డి గారి అభిప్రాయ మునకు సమాధానముగ 'ఇది తమ వంటివారు చెప్పవలసిన అతి శయోక్తి కాదని మనవి.' ఇట్టి వాక్యములను అక్షరశః గ్రహించే అల్పబుద్ధు లెందరో యుందురు. కాన సంస్కృతి, తత్త్వము వీనికి సంబంధించిన విద్యలు తప్ప తక్కిన వ్యావహారిక విద్యలన్ని అందరికీ అందుబాటులో నుండినవే. కనుక రాజులు అపవాదభాగులు కావలసిన దెప్పుడూ లేదని తలంతును (చూ పు. 296)

ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యం' ఎనిమిదవ సంపుటము నకు వ్రాసిన పీఠికలో 'మన కవుల చరిత్ర చాల భాగం వేర్లు చేతికందకుండా పెరిగిన శీగిపాద. ఎక్కడ వేలుపెట్టినా కథల కింవదంతుల, అభిమాన ముండ్లు కుచ్చుకోక తప్పదు.' (చూ. పు. 311–32)

డా॥ దోణప్పగారి 'ఆనంద కళా సంపద' (1973)కు తొలిపలుకులు వ్రాస్తూ కోస్తా మలకసీమల భాషా మాండలికాలను కాదనకుండా రాయలసీమ బాసవట్టి వాతలు పెట్టుకుంటూ విసర్గ మైన నింపు సొంపులను దారబోసుకుంటూవుంది......ఇప్పుడిప్పుడు అక్కడక్కడ స్వ స్వీయాభిమానాలు తలచూపుతున్నందుకు మెచ్చుకో వలసియున్నది. (చూ. పు 328)

వేమరాజు భానుమూర్తిగారి 'శబ్ద ప్రపంచం' (1954) గ్రంథానికి తిలకం దిద్దుతూ 'మనదేశంలో కర్ణాటకం–హిందూ స్థానీ' అనే రెండు సంగీత కళా సంప్రదాయాలున్నవి. ఈ భేదం చాలా యిటీవల ఏర్పడింది. రెంటికీ మూలము అంతరంగము ఒకటే. వేష భాషలవంటి బహిరంగాలలో మాత్రం కొంత భేద మున్నది. శుద్ధనాదంతో ఇంద్రియ తృప్తి చేయడంలో హిందూ స్థానికి ప్రయత్నమెక్కువ శుద్ధలయంతో, గమక బద్ధమైన వింత నాద వాక్యాలతో హృదయం తాకే ప్రయత్నం కర్ణాటకలో ఎక్కువ. దానికిదీ, దీనికదీ త్యాజ్యమూ కాదు, అనావశ్యకమూ కాదు. (చూ. పు. 365)

సామాన్యుల నాలుకపైని నడయాడే పలుకులలోని సహజ సౌందర్యాన్ని, సునిశిత హాస్యాన్ని ప్రకటించుటతో పాటు కొత్త పద బంధములను కల్పించి ప్రయోగించుట శర్మగారి విశిష్టత. వాటిలో కొన్ని కప్పుకొన్న వైష్ణవం; ముఖనింద; పట్టి పుట హరణం, మైల పలుకులు, ముద్రాక్షర శోధనము (Proof Reading)చిప్ప గుర్తులు (Brackets) పగులు మొగ్గలు (Blooming Buds) భిత్తరి కవిత్వము (దిగంబర కవిత్వము) అంగడి కవులు మొ॥.

మనం స్వతంత్రులం కాకముందే 'రేడియో'కు 'ఆకాశవాణి' అన్న నామకరణం చేసిన శాబ్దికులు శర్మగారు.

రచించిన పీఠికలలో కావ్యగత గుణదోషములను చూపుటయే కాక రచయితను ప్రోత్సహించటం శర్మగారి వ్యక్తి త్వములోని ప్రత్యేకత.

రాళ్ళపల్లి వారి పీఠికలను వెలువరించుటలో సంపాదకులైన శ్రీ ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ, డా॥ ఆర్. వి. యస్. సుందరంగార్ల కృషి ప్రశంసనీయము. ఎన్నో గ్రంథములను సేకరించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, తిరుమల తిరుపతి దేవస్థానం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,సంగీత నాటక అకాడమి లూ ప్రచురణకు తోడ్పడుట సంతోషము.

మైసూరులోని అరవింద ముద్రణాలయం వారు సర్వాంగ సుందరంగా (తప్పొప్పుల పట్టిక వుందను కోండి) ముద్రించడం మెచ్చుకో తగినదే. శ్రీ పి. ఆర్. తిప్పేస్వామిగారు రచించిన ముఖచిత్ర రచన మనోజ్ఞంగా వుంది.

సాహిత్యాభిమానులందరూ విధిగా, చదవవలసిన ఉత్తమ గ్రంథమిది.

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

# భావ విహంగాలు

## శ్రీ పి. నరసింహారెడ్డి

నా భావ విహంగాలు
శబ్ద పత్రత్రాలు విదిలించి
రసిక జన మనో విహాయసంలో విహరించనీ
కవిగా, నా కన్న కలలు ఫలియించనీ

రిక్కల రెక్కలెక్కి
అనంత విశ్వపథంలో
రివ్వున ఎగిరిపోనా !!

కరుణ అనేది ఎందుకు ?
అష్టకష్టాల ననుభవించే దరిద్ర దామోదరులకు
నవ నిధులూ పంచేందుకు !

అర్థానికి అర్థం లేదు
ఆర్తుల నాదుకొనేందుక్కాకపోతే.

వెన్నెల వాకనే వీక్షిస్తున్నా
చకోరాల కోసం చక్షుః కవాటాల్ని తెరచి
కనిపించలేదు వెన్నెల పులుగులు
వైశాఖ పున్నమ రాత్రి వేకువ జాములోనూ !

ఏ పూర్వ జన్మలో ఎందరి నిద్రానిధుల్ని
కొల్లగొన్నానో !
ఈ జన్మకు నిద్ర పట్టేట్లు లేదు.

నా మనసు కవాటాలు తెరిచాను
అర్ధరాత్రి ఉషోదయానికి.
కవితోషస్సు సుమించింది
సవితా విర్భావానికి ముందే

కన్నె వలపు కోసం కన్ను గలిపావా
కల్యాణ ఘడియను గుర్తుంచుకో

జగమంతా పండు వెన్నెల
మనసంతా నిండు చీకటి

ఆశా సూర్యు డుదయిస్తాడా !
భవిష్యత్తు బంగారు బాట చేస్తాడా !!

నా మదిలో వేదన
హృదిలో యాతన
ఏ కావ్య కన్యను కనేందుకో !
ఏ భావ సౌధ వినిర్మాణానికో !!

గంటల తిమింగలాలు
సెకండ్ల చిరు చేపల్ని మింగి
యుగ పురుషుడి మత్స్యావతారంలో
లీన మవుతున్నాయి.

కను చేపలు భాష్ప కడలిలో
పొర్లేడు (ఈదులాడు) తున్నాయ్
గుండె నెత్తుర్లో కొటక లాడ్తోంది

ఎన్నో రాత్రులు నిర్గమించాయి నిశ్శబ్దంగా
యుగాల కౌగిల్లోకి,
జగాల లోయల్లోకి.
ఈ రాత్రి వచ్చింది
నా భావ వీణా తంత్రుల్ని నిక్వాణించేందుకు.

కట్టేలకు మూల్యం చెల్లించా.
వాని చెమట చమురుకూ !
పాద రక్షలు (కొన) లేని పాదాలు
జొటా జొటా కార్చిన నెత్తుటి బొట్లకూ !!
విలువ చెల్లించగలనా ?

సగలంతా గాలి కోసం
గోల చేసిన ప్రజ
మూడో జాము పిల్లగాలుల హాయిలో
మైమరిచారు, రాత్రి ఒడిలో.

పంకా చుట్టూ మనుసులూ
ఆశల చుట్టూ మనసులూ
నా కలంలో భావ తోరణాలు
కాగితంపై కవితా క్షర కిరణాలు

ఆరు బైట వెన్నెట్లో
శాంతి దొరకదు
మనసు గుహలో అనాది చీకటి
తొలగితే తప్ప

ఈ వెన్నెల ఎందరి ఊహల్ని కన్నదో
ఎందరి ఊహల్ని దోచుకొందో
ముందు తరాల కవులకు దాచుకొందో
ఎవరి కెరుక ? — దానికే తప్ప.

ఈ దేశంలో
ఎండకూ, రేయెండకూ
వడ గాడ్పులకూ, సుడిగాలులకూ
తుఫానులకూ, తుపాకులకూ
బీభత్సానికీ, బీదతనానికి
కొరత లేదు —
ఆకలికి అన్నం తప్ప.

'సిరా' చీకటి నుంచీ అక్షర జ్యోతి వెలిగిస్తున్నా
మసిపాత మానికంలా,
దారిద్ర్యంలో శీలంలా.

నాడు కమలాలకూ, కత్తులకూ కొదవలేదు.
నేడు కలాలకూ, కులాలకూ అంతులేదు

ఎన్నో కష్టాల యుగాలు పడిన
భావావేశపు నొప్పుల్తో
అనంత కవితా సంతానా విర్భావం
దీనికి నియంత్రణ లేదు —
కుటుంబాలకు తప్ప.



హాన్స్ క్రెబ్స్

# వయస్సు - శాస్త్రవేత్తల సృజనాత్మక కృషి

నలుబది ఆరు సంవత్సరాల క్రితం—అంటే 1929లో—సెవెరో ఓకోను బెర్లిన్‌లో తొలుత నేను కలుసుకొనాను. అప్పుడు మేమిరువురం ఒకే పరిశోధనాలయంలో సుమారొక యేడాది పని చేశాము. ఓటో మెయర్‌హాఫ్ పరిశోధనాలయంలో సెవెరో పని చేస్తూండినాడు. ఆ అంతస్థుకు రెండు అంతస్థులపైన ఉన్న ఓటో నార్–బర్గ్ పరిశోధనాలయంలో నేను పనిచేస్తూండినాను. అపుడు మేమిరువురం కాలమంతా వినియోగించి, పరిశోధనలు చేస్తూండినాము. ఇతర వ్యాపకాలు ఎన్నో అడ్డం వచ్చినా, ఇతర విధులను నిర్వర్తించవలసివచ్చినా శాస్త్రవేత్తలుగా పనిచేసినంతకాలం మేమిరువురమూ పరిశోధనలు కొనసాగించాము. ఇక యిప్పుడు ఉద్యోగబాధ్యతల నుంచి తప్పుకొన్నప్పటికీ పరిశోధనలపట్ల ఆసక్తి ఎంతమాత్రం తగ్గలేదు. మా సమకాలీనులలో—యువకులుగా వున్నప్పుడే పరిశోధనల ద్వారా ప్రయోజనకరమయిన ఫలితాలను సాధించినవారు కూడా వారిలో కలరు· పోల్చుకొన్నప్పుడు వారిలో చాలామంది ఇంకా యువకులుగా వుండగానే ప్రయోజనకరమయిన ఫలితాలను సాధించే పరిశోధనలు మానివేశారని గమనించాను. అలాంటి వారితో పోల్చితే చాలా కొలదిమంది మాత్రమే సమధికోత్సాహంతో యిప్పటికీ పరిశోధనలు కొనసాగించుతున్నారు. అందుచేత వయస్సు వచ్చినకొద్దీ శాస్త్రవైజ్ఞానిక కార్యకలాపాలపట్లా, ప్రయోజనకరమయిన పరిశోధనలపట్లా ఆసక్తి దెబ్బతినడానికి దోహదపడే కొన్ని అంశాలను గురించి పరిశీలన జరపడం, యీ సందర్భంలో సమంజసంగా వుంటుందనుకొంటాను.

కొంతమంది శాస్త్రజ్ఞులు ప్రయోజనకరమయిన (ఉత్పాదక) పరిశోధనలు ఇంకా కొనసాగించుతూండగా, మరికొంతమంది ఇలాంటి కృషి మానివేయడం అనే వాస్తవం సైన్సుకు మాత్రమేకాక, సృజనాత్మక కృషిలో నిమగ్నులయ్యే ఇతర వృత్తుల వారికి కూడా వర్తించుతుంది. అయితే కళల విషయంలో ఈ లక్షణం అంత కొట్టవచ్చినప్పుడు కనిపించదు. సృజనాత్మక రచనలు చేసే రచయితలూ, చిత్రకారులూ, సంగీత విద్వాంసులవంటి వారిలో ఎక్కువమంది వారి వృద్ధాప్యంలో ప్రథమశ్రేణి కళాఖండాలను సృష్టించారు. అతని ఓపెరా లన్నింటిలో ఉత్తమమయినదని కొందరు పరిగణించే ''ఫాల్‌స్టాఫ్‌ను'' వెర్డి 80 యేళ్ళ వయస్సప్పుడు పూర్తిచేశాడు. అలాగే టిటియన్ తన ఉత్తమ కళాఖండాలలో కొన్నింటిని 80 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత సృష్టించాడు గెతే తన 81వ యేట మరణించేవరకూ ప్రతిభా వ్యుత్పత్తులనూ, ఊహాశక్తినీ, భావవ్యక్తీకరణశక్తినీ ప్రదర్శించాడు. ఇక మన తరంలో పి. జి. వోడ్‌హౌస్ 1975లో తన 95వ యేట మరణించేవరకూ కూడా అధికాధికంగా అమ్ముడుపోయిన రచనలు చేశాడు. రాబర్ట్ బ్రౌనింగ్ తుది కవితా సంపుటి 77వ యేట ఆయన మరణించిన రోజున ప్రచురితమయినది. ఆయన వ్రాసిన కవితలన్నింటిలోనూ అది ఉత్తమమయినది; మనోజ్ఞమయినది. ఇలాంటి రచయితల నుంచి రొస్సినీని మినహాయించాలి. 37 సంవత్సరాల వయస్సు వచ్చేప్పటికే 30 సంగీత నాటికలు (ఓపెరా) ఆయన వ్రాయగలిగాడు. ఆ తర్వాతి 33 సంవత్సరాలూ ఆయనేమీ వ్రాయలేదనవచ్చు.

## వయస్సు-సృజనాత్మక కృషి

ఈ విధంగా, సృజనాత్మక కళాకారుల విషయంలో వయస్సు వచ్చినకొద్దీ సృజనాత్మకశక్తి విధిగా క్షీణించాలనేమీ లేదుగాని, శాస్త్రవైజ్ఞానిక రంగంలో మాత్రం ఒకానొక వయస్సులోగా అధిక ప్రయోజనకర ఫలితాలనిచ్చే కృషి జరుగుతుందనే అభిప్రాయం వున్నది. ఈ కృషి జరిగే వయస్సు ఆయా అంశాలనుబట్టి రకరకాలుగా వుంటుంది. గణితశాస్త్రంలో యీ వయస్సు చాలా చిన్నతనంలోనే పూర్తవుతుందంటారు. జి. హార్డి తన జీవిత చరిత్ర ''ఎ మాథ్‌మాటిషియన్స్ అపాలజీ'' అనే గ్రంథంలో శాస్త్ర వైజ్ఞానిక రంగంలో—సృజనాత్మక కృషికీ, వయస్సుకూ ఉండే సంబంధం గురించి వ్యాఖ్యానించాడు. గణిత శాస్త్రజ్ఞుల విషయంలో ఇది చాలా ప్రధానమయినదని ఆయన అన్నాడు. హార్డి యిలా వ్రాసాడు : ఇతర కళలూ, సైన్సులకంటే గణిత శాస్త్రం అనేది యువకులు కృషి చేయవలసిన రంగం అనే సంగతిని గణిత శాస్త్రజ్ఞులు విస్మరించరాదు. ఇందుకు ఉదాహరణగా న్యూటన్ కృషిని హార్డి పేర్కొన్నాడు. 24 సంవత్సరాల వయస్సప్పుడు న్యూటన్‌కు గురుత్వాకర్షణ (భూమ్యాకర్షణ—గ్రావిటేషన్) సిద్ధాంతం తోచినది. అటు తర్వాత ఆ సిద్ధాంతానికి ఆయన మెరుగులు దిద్దాడే కానీ, కొత్త సిద్ధాంతమేమీ కనిపెట్టలేదు

ఆంగ్లేయ గణిత శాస్త్రవేత్త లందరిలో గొప్పవాడుగా హార్డ్ని (1887 – 1947) ఆయన సమకాలీనులు గుర్తించారు. **ఈ** శతాబ్దం **మొదటి** అర్థభాగంలో అలాంటి హార్డ్యే సొంత పరిశోధన పత్రాలను ప్రచురించడం తన 58వ యేటనే మానివేశాడు. వాస్తవానికి గణిత శాస్త్రజ్ఞులకు అది పెద్ద వయస్సే సుమా!

మరొక ప్రముఖ గణిత శాస్త్రవేత్త (భౌతిక శాస్త్రవేత్త **కూడా**) పి. వి. ఎమ్. డిరాక్ ఇదే అభిప్రాయాన్ని ఈ కిందివిధంగా వెలిబుచ్చాడు:

వయస్సు, నిజం సుమా, ఒక వణుకు జ్వరం. దాన్ని గురించి ప్రతి భౌతిక శాస్త్రవేత్తకి భయం. ముప్పది వత్సరాలవయస్సు దాటిన అతను బ్రతకడం కంటే చావడం మేలు.

డిరాక్ ప్రముఖంగా కొత్త సిద్ధాంతాన్ని తన 26 వ ఏటనే కనిపెట్టాడు. రాయల్ సొసైటీ సభ్యుడుగా 28 సంవత్సరాల వయస్సున అతను ఎన్నికయినాడు. 31 సంవత్సరాల వయస్సప్పుడు నోబెల్ బహుమతి గెలుచుకొన్నాడు.

గణిత శాస్త్రం విషయంలో సత్యమయినది. ప్రయుక్త భౌతిక శాస్త్రానికీ, రసాయన శాస్త్రానికీ వర్తించదు. శరీర శాస్త్రాల విషయంలో అది అసలు నిజం కానే కాదేమో.

## కళలకూ శాస్త్రాలకూ తేడాలు

సృజనాత్మక కృషికి కొన్ని ప్రధానాంశాలు అవసరం. శాస్త్ర వైజ్ఞానిక రంగంలో కృషికీ, కళల విషయంలో కావలసిన అవసరాలకూ కొన్ని మౌలిక వ్యత్యాసాలున్నవి. ఏ రంగంలోనయినా సరే సృజనాత్మక, ఉత్పాదక కృషికి మూలం ఊహాశక్తి; కృషిచేసే తీరు.

శాస్త్ర వైజ్ఞానిక రంగంలో కృషి తీరులో రెండు ప్రధానాంశా లుంటవి. అవి- ప్రయోగాలు చేయదగిన–వీలయిన పద్ధతి. సిద్ధాంత సంబంధమయినది. వీటిలో మొదటిది ప్రయోగాలలో అనుసరించదగు పద్ధతులకు సంబంధించినట్టిది. ప్రయోగాలు చేసే వారు కొన్ని ప్రశ్నలకు సమాధానాలు కనిపెట్టాలి గదా! ఆ ప్రశ్నలకు సంబంధించినది సిద్ధాంత సంబంధమైన శాస్త్రవిజ్ఞానం. శాస్త్రవిజ్ఞానం ప్రత్యేక లక్షణం యేమిటంటే – ప్రయోగాలు చేసే పద్ధతులూ, ప్రశ్నలను రూపొందించే పద్ధతీ కూడా ఇంతకు ముందెన్నడూ ఎరుగనంత త్వరగా మారుతున్నవి పద్ధతులకూ, సిద్ధాంతాలకూ **కూడా** కాలదోషం పట్టి – వర్తమానానికి ఉపయోగపడకుండా పోయే ప్రమాదం ఇందులో ఉన్నది. చాలా శ్రమించి పని చేయడానికి శాస్త్రవేత్త సిద్ధపడాలి. లేకపోతే వెనకపడిపోతాడు. నిరంతరం అధ్యయనం చేసి, కొత్త అంశాలను నేర్చుకొనడం అవసరం.

దీనితో పోల్చదగిన లక్షణం కళలలో కూడా ఉన్నది- **అయితే** అంత ప్రస్ఫుటంగా ఉండదు. శాస్త్రవైజ్ఞానిక రంగంలో పద్ధతులూ, మారిపోయినంత వివిదాంశాలనూ పరిశీలించే తీరూ కళారంగంలో (అంత త్వరగా) అవి మారిపోవు. పనిచేసే పద్ధతులనూ, పరిశీలించవలసిన అంశాన్ని చూచి, దాన్ని విశ్లేషించే పద్ధతీ కలిస్తే శైలి అవుతుంది. గమనించవలసిన విషయం ఏమిటంటే కళారంగంలో శైలి ఒక తరంలో మారకపోవచ్చు. పెయింటింగ్ చేసే పద్ధతులూ, రీతులూ, శిల్పరీతులూ, కవితా రీతులూ, నాటక రచనా పద్ధతులూ, వచన రచనా పద్ధతులూ క్రమంగా మారినప్పటికీ, కళారంగంలో ప్రముఖ స్థానం వహించిన కళా ఖండాలకు శాశ్వత మనోజ్ఞత, రమణీయకత ఉంటవి. వాటికి కాలదోషం ఎన్నటికీ పట్టదు.

న్యూటన్, పాస్టియర్ వంటి శాస్త్రవేత్తలూ, వర్తమాన శతాబ్దం మలుపులో ప్రసిద్ధి చెందిన ఎమిలీ ఫిషర్, నెర్‌నస్ట్ వంటి శాస్త్రవేత్తలు సాధించిన విజయాలను కూడా యీనాడు చారిత్రక కారణాలవల్ల, చారిత్రికాంశాలంటే ఆసక్తిగలవారు మాత్రమే వారి గ్రంథాలు చదివి తెలుసుకొంటూంటారు. ఆయా ప్రముఖ శాస్త్రవేత్తలు సాధించిన ఫలితాలను ప్రామాణిక పాఠ్య గ్రంథాలలో చేర్చినప్పటికీ కొందరు, వారి గ్రంథాలను **ఈ** దృష్టితో చదవడం జరుగుతున్నది.

సృజనాత్మక కళాకారుడు తన పరికరాలలో మార్పులు చేసుకొని, అభివృద్ధి చేసుకొన్నప్పటికీ, శాస్త్రజ్ఞుని వలె వాటికి ఎప్పటికప్పుడు కొత్త రూపం ఇచ్చి, నిరంతరం వాటిని మార్చుకొంటూండవలసిన అవసరం లేదు. అంతేకాదు. కళాకారుని సరంజామా అయిన మానవ స్వభావం, తన చుట్టూ వుండే ప్రకృతికి అతని ప్రతిస్పందనలూ ఎన్నటికీ మారవు. హారేస్, సోఫాక్లిస్, హోమర్, బైబుల్, షేక్స్పియర్, బెర్నార్డ్‌షా, రినైజాన్స్ కాలం నాటి చిత్రకారులూ, బాబ్ సంగీతం – ఆ కళలు తొలుత వెలువడినప్పుడు ఎంత మనోజ్ఞంగా వుండినవో ఈనాడు మనకు కూడా అంత మనోజ్ఞంగా ఉండడానికి కారణం ఇదే.

శాస్త్రవేత్తలు తమ ఉత్పాదక కృషిని నిరంతరం (నిలబెట్టుకొనలేక) కొనసాగించలేకపోవడానికి, "కాలదోషం" ఒక పెద్ద అవరోధం. లెవిస్ కరోల్ వర్ణించిన అద్దం వంటి దేశం స్పైన్సు. అందులోని రెడ్‌క్వీన్ అన్నట్లు "ఉన్నచోటనే ఉండదలుచుకొంటే పరుగెత్తగలిగినంత వేగంగా పరుగిడితే చాలు. అలాకాకుండా ఏదో ఒక చోటకు పోదలిస్తే "ఉన్నతిని సాధించదలిస్తే ఇప్పటి కంటే రెట్టింపు వేగంగా పరుగెత్తాలి." అందుకు ఆలిస్ చెప్పిన "ఇక్కడ ఉండడమే నాకు తృప్తిగా వున్నది. చాలా దాహంగా వున్నది. అందువల్ల నేను ప్రయత్నించక పోవడమే మంచిది" అన్న సమాధానం పట్ల పెక్కుమంది శాస్త్రవేత్తలకు సానుభూతి ఉంటుంది.

## అవాంతరాలు:

శాస్త్రవేత్తలు నిరంతరం ఉత్పాదక కృషిని కొనసాగించడంలోని కష్టాలలో ఒక అంశం గురించి ఇంతవరకూ నేను చర్చించాము.

ఇంకా కొన్ని చిక్కులున్నవి. శాస్త్రజ్ఞులలో ఎక్కువ మంది శాస్త్ర పరిశోధనల కృషిని వదలివేసి ఇతర రంగాలలోకి ప్రవేశించేట్టు చేసే ఆకర్షణలు ఎప్పుడూ ఉంటాయి. నిర్వహణాధికార వ్యవస్థలో పదవులూ, తరగతులలో బోధించడం వంటివి అట్టి ఆకర్షణలు. ఇలాంటి పదవులలో పనిచేసేవారికి యజమానులు వేతనాలు చెల్లిస్తారు. కాబట్టి శాస్త్రజ్ఞులు ఆ పదవులలో సమధికోత్సాహంతో పని చేయాలని యజమానులు ఆశించుతారు ఈ బాధ్యతల నిర్వహణకు శాస్త్రజ్ఞులు తమ కాలంలో చాలా భాగాన్ని వినియోగించవలసి వుంటుంది. ఫలితంగా, యీ నాడు మామూలుగా పనిచేసే వారం రోజుల వ్యవధికంటే ఇంకా చాలా వ్యవధి అవసరమయ్యాక పరిశోధనలు చేయడానికి శాస్త్రవేత్తలకు వ్యవధి లేకుండా పోతున్నది. సృజనాత్మక కళాకారులకు (ఒక నిబంధనగా) ఇలాంటి బాధ లేదు. వారి ఇష్టం వచ్చినంత కాలం పని చేయవచ్చు ఎవరూ అభ్యంతరపెట్టరు. శాస్త్రజ్ఞుల దృష్టిని పెడదోవనిపట్టించే అంశాలలో విదేశాలలో పర్యటించడానికి రమ్మని వచ్చే ఆహ్వానాలు, ఉపన్యాసాలు (ప్రసంగాలు) చేయవలసిందిగా కోరుతూ వచ్చే ఆహ్వానాలూ, సభలకు హాజరు కావలసిందిగా వచ్చే ఆహ్వానాలూ, ఆయా సందర్భాలలో జరిగే విందులవంటి ఆడంబరాలు కూడా వస్తవి.

శాస్త్రజ్ఞుల దృష్టిని పెడదోవన మళ్లించే అంశాలలో నోబెల్ ప్రయిజులు ప్రముఖమయినవి. వీటిని గురించి చాలా రచనలు వెలువడినవి. ఈ అవార్డు లభించిన తర్వాతి అయిదు సంవత్సరాలలో ఒక శాస్త్రజ్ఞుడు ప్రచురించే పరిశోధన వ్యాసాల సంఖ్య సాలుకు నూటికి 3 వంతున తగ్గినట్టు హేరియట్ జుకర్‌మన్ (4.5) అభిప్రాయపడినాడు. ఇది ఇలా జరగదనీ, నోబెల్ ప్రయిజ్ వల్ల కలిగే అన్యవ్యాపకాలేమంత గణనీయమయినవి ఓటో హార్‌లగ్స్, ఓటో మెయర్‌హాఫ్, సెవెరో ఓకో అంతకుముందు అభిప్రాయపడినారు. నోబెల్ ప్రయిజ్ వంటి వాటివల్ల మనస్సు పెడదారిన పోకుండా నివారించుకొనగల స్థిరచిత్తులు వారు. కొత్త అంశాన్ని ఏదో ఒకటి కనిపెట్టాలనే వారి కుతూహలం ఏ కారణంగానూ, ఎన్నడూ తగ్గలేదు. అది ఆయా శాస్త్రజ్ఞుల విలక్షణ శీలం.

ఇతర ప్రముఖ శాస్త్రజ్ఞుల కంటే, అధికంగా నోబెల్ ప్రయిజ్ విజేతలకు ఆహ్వానాలు వచ్చేమాట నిజమే. ఆటోగ్రాఫ్‌ల మీద సంతకాలు చేయవలసినదిగానూ, అభిప్రాయాలు ప్రకటించవలసినదిగానూ, ఇంటర్వ్యూలు ఇవ్వవలసినదిగానూ, వారికి అంత నైపుణ్యంలేని పెక్కు అంశాలను గురించి వ్యాసాలు వ్రాయవలసినదిగానూ, కమిటీలలో సభ్యులుగా ఉండవలసినదిగానూ, ప్రత్యేక సందర్భాలలో ప్రసంగాలు చేయవలసినదిగానూ నోబెల్ ప్రయిజ్ విజేతలకు అభ్యర్థనాలు వస్తూంటవి.

నా అనుభవంలో ఒక విశేషం. నోబెల్ ప్రయిజ్ లభించిన తర్వాత కొన్ని నెలలకు జేమ్స్‌ఫ్రాంక్ అనే భౌతిక శాస్త్రవేత్త నన్ను హెచ్చరించాడు. ''అలంకరణ''గా వుపయోగపడే నిమిత్తం చాలా కమిటీలలో సభ్యుడుగా వుండవలసినదిగా నాకు ఆహ్వానాలు వస్తవని ఆయన అన్నారు. అమెరికాలో ఒక సలహామండలిలో సభ్యుడుగా వుండవలసిందిగా ఇటీవల నన్ను కోరినారు ఏదో ప్రత్యేక సామర్థ్యం వున్న కారణాన తాము నన్ను సభ్యుడుగా ఎంచుకొనలేదనీ, నోబెల్ ప్రయిజ్ వల్ల గొప్ప వాడినయ్యాను కనుకనే ఎంచుకొన్నామనీ ఆ సంస్థవారు కల్లాకపటం లేకుండా చెప్పారు.

## వయస్సు-పరిశోధనల నాణ్యత

గణిత శాస్త్రాన్ని దృష్టిలో పెట్టుకొని, వయస్సు వచ్చిన కొద్దీ శాస్త్రజ్ఞులు చేసే పరిశోధనల నాణ్యత తగ్గుతుందని హార్డ్ చెప్పిన అంశాన్ని పరిశీలించుదాము. ప్రయోగాలు చేసే శాస్త్రవేత్తల జీవిత చరిత్ర సూచించుచున్నట్టు వారి విషయంలో కూడా ఇది నిజమే.

కొత్త అంశాలను కనిపెట్టే (ఉత్పాదక) శాస్త్రవేత్తల జీవిత చరిత్రను పరిశీలించితే, ''కొత్త అంశాల గని'' ఖాళీ అయ్యే ప్రమాదం యేర్పడినప్పుడు ఇలాంటి శాస్త్రజ్ఞులలో పెక్కుమంది కొత్త పద్ధతిలో పరిశోధనలు ప్రారంభిస్తారని వారి జీవితచరిత్ర సూచించుతుంది. ఒక సమస్యను గురించి ఒక ప్రత్యేక కాలంలో ఇంకా వివరంగా పరిశోధనలు జరపడం ఒక్కొక్కసారి అసాధ్యమవుతుంది. వివిధ రంగాలలోని పరిజ్ఞానమూ సమన్వయమై, కొత్త పద్ధతులు రూపొందినప్పుడు, ఒక శాస్త్రజ్ఞుడు పాత సమస్యనే తీసుకొని, కొత్త పద్ధతిలో, కొత్త దృష్టితో దాన్ని పరిష్కరించ వచ్చు.

ఒక శాస్త్రజ్ఞుడు ప్రయోజనకరమయిన పరిశోధనలు చేయలేకపోవడానికి వూహాశక్తి కొరవడడం తరచు కారణం అవుతూంటుంది. చాలా మంది శాస్త్రవేత్తల దృష్టిలో ఒకేఒక ఆలోచన ఉంటుందని వారు ప్రచురించిన పరిశోధన వ్యాసాల పట్టిక సూచించుతుంది–ఆ ఆలోచనను ఆయా శాస్త్రజ్ఞుల పి.హెచ్.డి., పరిశోధనలను పర్యవేక్షించే శాస్త్రవేత్త తరచు సూచించుతూంటాడు.

పరిశోధనలుచేసే శాస్త్రవేత్తకు ప్రధానంగా కుతుహలం ఉంటుంది.దాని కారణంగానే పరిశోధనలను ప్రారంభిస్తాడు. గౌరవ ప్రతిష్ఠలు, ధనం, వృత్తిలో భద్రత వంటివి చాలామంది శాస్త్రవేత్తల ''కుతూహలాన్ని'' అధిగమించుతూంటవి. ధనం వంటివేమో తరచు పరిశోధనల రంగం బయట అధికంగా లభించుతూంటవి. అధిగమించడానికి వీలులేనంత ప్రగాఢంగా ''కుతూహలం'' ఒక శాస్త్రవేత్తలో పాదుకు పోతేనే గాని ప్రయోజనకర పరిశోధనలు (ఉత్పాదక) సైన్సులో వర్ధిల్ల జాలవు.

అన్ని గౌరవ సత్కారాలూ, ఇహలోక ప్రయోజనాలూ లభించిన తర్వాత కూడా పరిశోధనలను కొనసాగించుతున్న శాస్త్రజ్ఞులలో సెవెరో ఒకరు. తన కృషి ఫలితాలను హాయిగా అనుభవించుతూ కాలుమీద కాలువేసుకొని, కూర్చొన దగిన

వయస్సులో ఆయన పరిశోధనలు కొనసాగిస్తున్నాడు. సెవెరోలాంటి పరిస్థితులలో వున్న మేమందరమూ కూడా గతంలో సాధించిన ఫలితాల ప్రయోజనాలని అప్పుడప్పుడు కొంచెం ఇరకాటంలో పడయినా అనుభవించుతూండవచ్చు. కాని అంత కంటే ఎక్కువ సంతోషం కలిగించే కృషి, ఎంత చిన్నదయినా సరే ప్రకృతి రహస్యాలను వెలికి తీసేందుకు ప్రకృతితో పోరాటం జరపడం వల్ల లభించుతుంది. సెవెరో నుంచి 1974 నవంబరు 20న నాకు వచ్చిన జాబులోని ఒక అంశంతో నిగూఢంగా వున్న విషయం ఇదే ననుకొంటాను. అందులో ఆయన ఇల్లా వ్రాశాడు : "జులై 1న రోబి ఇన్స్టిట్యూట్‌కు నేను మారాను. పనిచేయడానికి కావలసిన పరికరాలన్నీ ఇక్కడ ఉన్నవి. నాకు అత్యంతాసక్తి ఉన్న అంశం గురించి కృషిచేయడానికి కావలసిన వ్యవధి అంతా నాకు ఉన్నది. ఇష్టం వచ్చినంతసేపు పనిచేసే వ్యవధి వున్నది. ఇవన్నీ నాకు ఎంత సంతోషం కలిగిస్తున్నవో మాటలతో నీకు చెప్పలేను."

## సైన్సులో అవిరళకృషి మూలం

వృత్తి చేసిన రోజులలో తీరిక దొరకని కొందరు శాస్త్రవేత్తలు, తమ సరదాకాలక్షేపాలు కొనసాగించేందుకు ఉద్యోగంనుంచి ఎప్పుడు విరమించి విశ్రాంతి తీసుకొందామా అని ఎదురు చూస్తాంటారు. కానీ, కుతూహలం ఫలితంగా పరిశోధనలు ప్రారంభించే శాస్త్రజ్ఞునికి పని, సరదా ఒకేరకం ఆనందాన్నిస్తవి. 1926లో స్టాక్‌హోమ్‌లో ఫిజియాలజీ కాంగ్రెస్‌లో ఎర్నెస్ట్ హెన్రీ స్టార్లింగ్ చెప్పినట్టు "పరిశోధన చాలా కష్టమయిన, ఉత్తమ క్రీడ."

అయితే మరి వయస్సు వచ్చిన కొద్దీ శాస్త్రజ్ఞుని సృజనాత్మక శక్తిలో యే అంశం దెబ్బతింటుంది? శ్రమపడి పనిచేసే గుణం మాత్రం తగ్గదు. పోతే వూహాశక్తి కూడా వృద్ధాప్యంలో సాధారణంగా ఉంటుందిగాని పరిమితంగా వుంటుంది. ఆ తర్వాత సంపాదించిన అనుభవం, పరిజ్ఞానం అంత విస్తృతంగా వుండవు గాన, వయసొచ్చిన కొద్దీ జ్ఞాపకశక్తి దెబ్బతింటుంది కాబట్టి వారి విజ్ఞానం వర్తమానానికి పనికి రాకుండా పోతుంది. దీనిఫలితంగా కొత్త వివరాలనువారు అంత ఎక్కువగా గుర్తుంచుకొనడం,తాము నేర్చిన విజ్ఞానంతో వాటిని ప్రయోజనకరంగా సంలీనం చేసుకొనలేకపోవడం జరుగుతుంది.

జ్ఞాపకశక్తి క్షీణించిపోవడం పెద్దలోపమే. కొన్ని చర్యల ద్వారా యీ లోపాన్ని సరిదిద్దుకోవచ్చు. రంగస్థల నటుల జ్ఞాపకశక్తి వారి ఎనభయ్యోపడిలో కూడా చెక్కు చెదరకుండా ఉండడం ఆశ్చర్యం కలిగించే విషయమే. నిరంతర అభ్యాసం జ్ఞాపక శక్తిని వృద్ధిచేస్తుందనుకొంటాను.

ఇలా విశ్లేషణ జరిపితే సైన్సులలో ఉత్పాదక శక్తిని నిలబెట్టుకొనలేకపోవడానికి పెక్కు కారణాలు కనిపిస్తవి. కానీ వాటిలో ఏదీకూడా కళారంగంలోకంటే అధికంగా శాస్త్రవైజ్ఞానిక రంగానికి వర్తించవలసిన ఆవశ్యకతలేదు. అయితే మరి వయస్సు వచ్చిన కొద్దీ శాస్త్రవేత్తల సృజనాత్మకశక్తి ఎందుకని క్షీణిస్తున్నదీ? — ఇతర కార్యకలాపాలు వారికి సులభంగానూ, ఆకర్షణీయంగానూ, అధికంగా ధనం లభించేవిగానూ కనిపించడం కారణం కావచ్చు.

సంకల్పం బలంగా వుండడం, శాస్త్ర వైజ్ఞానికరంగంలో అవిరళ పరిశోధనాశక్తికి ప్రధానం. ఈ సంకల్పం ప్రగాఢంగా ఉండాలి. తాము చేసేపని అంటే అధికాసక్తి, అనురాగం కలవారు మాత్రమే తమ కృషిని ఇంకా యింకా కొనసాగించగలుగుతారు. ఈ అనురాగ సంబంధం వారసత్వంగానూ,పరిసరాలకు సంబంధించిన అంశాలనుంచీ, ప్రకృతినుంచీ దాన్ని పరిపోషించుకునే పద్ధతినుంచీ యేర్పడుతుంది. ఏ రంగంలోనయినా సరే పనినుంచి తప్పించు కొనలేని వారందరూ ఈ కోవలోకి వస్తారు. తృప్తికరంగా వుండాలంటే సమధికోత్సాహంతో పనిచేయడం తనకు అవసరమని గెతే పలుమార్లు అన్నాడు. 1781 డిసెంబరు 3వ తేదీన తన మిత్రుడు నెబెల్‌కు వ్రాసిన జాబులో గెతే యిలా అన్నాడు : "ఒక కుగ్రామంలో లేదా నిర్జన ప్రాంతమయిన ఒక దీవిలోనయినా కేవలం బ్రతకడానికి నేను ఇంత ఉత్సాహంగానూ పనిచేస్తాను. ఇది నా విశ్వాసాలలో ఒకటి. ఈ విషయాన్నే మరొక విధంగా చెప్పాలంటే సంకల్పబలం అధికంగా ఉన్న (ఉద్దేశ, పోత్సాహం) శాస్త్రవేత్తకూ, హృదయపూర్వకంగా నిమగ్నులయిన వారికీ పని అనేది ఒక ఉద్యోగం మాత్రమేకాదు—వృత్తి కూడా. ఉద్యోగం అంటే బ్రతకడానికి చేసే పని. వ్యాపకం, వృత్తి అంటే జీవించి వున్నంతకాలం చేసే పని.

మరణించే రోజు వరకూ పని చేసిన సంగీత విద్వాంసులూ, చిత్రకారులు, రచయితలూ ఉన్నట్టే, సౌకర్యాల కొరత యేర్పడి, వృద్ధాప్యం కారణంగా పని చేయలేని స్థితి ఏర్పడితే తప్ప సైన్సులో పరిశోధనలు నిరంతం కొనసాగించినవారు ఉన్నారు.

ఏదో ఒక పని చేస్తూండడం అవసరం అని భావించుతున్నప్పటికీ, సృజనాత్మక కృషి అంత ముఖ్యం కాదని భావించేవారు కొందరున్నారు అయితే వారు పనిచేసే తీరు బయటకు వ్యక్తం కాదు. సంఘటనలను సృష్టించే బదులు అవి తమ విషయంలో జరిగితే బాగుండునని వారు భావిస్తారు. వారి ఉద్యోగాలు వారికి సంతోషం కలిగించవచ్చు. కాని, ఇతరులు ఆటలాడటం, సంభాషణలు జరపడం వంటివి చేస్తుంటే చూచేవారు ఎక్కువగా సంతోషపడతారు. ఈ రెండు రకాలవారూ కాక ఇంకొక రకం (మధ్యరకం) వ్యక్తులన్నారు. ఎందుకనంటే వ్యక్తులందరూ సమానులు కారు. ప్రకృతి వారందరూ సమానంగా ఉండాలని ఉద్దేశించలేదు. వాస్తవానికి వ్యక్తులలో జీవశాస్త్ర వైవిధ్యం ఉండడం శారీరక(ంగా) అవసరం కూడా. ఒకే రకం వ్యక్తులుండే సమాజాలు చిరకాలం మనజాలవు. ఎందుకనంటే ఏదయినా ఒక విపరీత స్థితి యేర్పడినప్పుడు దాన్ని పరిష్కరించడానికి పలు రకాల స్వభావాల వ్యక్తులవసరమవుతూంటారు. ఇలాంటి పరిస్థితులు సమాజంలో ఎన్నయినా, ఎప్పుడయినా రావచ్చు. వివిధ రంగాలలో ప్రతిభావంతులయిన మంచి వ్యక్తులు పుష్కలంగా వుండే సమాజం పదిలమయినదీ, ఆరోగ్యవంతమయినది.

పని అంటే శ్రద్ధాసక్తులున్నంత మాత్రాన చాలదు. సృజనాత్మక కృషికి అవసరమయిన సామర్థ్యం కూడా ఉండాలి. విడవకుండా శ్రమపడగలగాలి. నైపుణ్యం ఉండాలి. ఊహాశక్తినీ, నైపుణ్యాన్నీ, వస్తు నిష్ఠమయిన విమర్శనాదృష్టి అందరకూ ఉండవు. సాహిత్యం, లలిత కళలు, సంగీతం వంటి సృజనాత్మక రంగాలన్నింటికీ ఇది వర్తించుతుంది.

## శిల్పులూ, పనివారూ :

సెవెరో ఓకో వలే అద్భుతాలను సాధించడం సకృత్తుగా జరిగే విషయమే. అంత మాత్రానే ఇతరులు నిరుత్సాహపడ నవసరం లేదు. సైన్సు అనే భవనం శిఖరాన్ని నిర్మించిన శిల్పులతో పాటు ఆ భవనాన్ని నిర్మించేందుకు అసంఖ్యాకమైన పనివారి అవసరం కూడా ఉన్నది. పనివారేమంత తక్కువ ప్రాముఖ్యంగలవారు కాదు. ఇలాంటి ఉపమానమే సైన్సులో పరిశోధనలకు కూడా వర్తించుతుంది.

ఆలోచనలు తగ్గిపోయి నిస్పృహ చెందిన శాస్త్రజ్ఞుడు ఇతరులతో కలసి పంచుకొనడానికి పుష్కలంగా ఆలోచనలున్న ఇతరులను ఉద్దీపింపజేయగల సెవెరో ఓకో వంటి నాయకుడితో పరిచయ మేర్పరచుకొంటే చాలా ప్రయోజనం కలుగుతుంది. ఉత్సాహం కలుగుతుంది. సృజనాత్మక కృషి (ఉత్పాదక) కొనసాగించి, సుఖంగా ఉండడానికి ఇలాంటి శాస్త్రజ్ఞుడు తన 'స్వాతంత్ర్యాన్ని' కొంచెం కుదించుకొంటానని నిశ్చయించుకోవాలి.

[స్పెయిన్ శాస్త్రజ్ఞుడు సెవెరో ఓకోకి అభిమానులు సమర్పించిన సంపుటం నుంచి. అనువాదం : **వి. ఎస్ అవధాని**]

# తెరపై మరకలు

## శ్రీ కలువకొలను సదానంద

మారిపోయాడు
ఫాల్కే ఎత్తి ముద్దాడిన సినీ హరిశ్చంద్రుడు
పోలికే లేకుండా మారిపోయాడు !
ప్రజలలో అడుగంటిపోతున్న దానిమీద
బండపరచి,
వాళ్ళడుగుతున్నదాన్నే యిస్తున్న
సినిమాలు !
కళ్ళలోకి చిలిపిగా చూచే కన్నెపిల్లగా,
మధుపాత్ర చేతబట్టి
మనుగడకు నిర్వచనం చెప్పే మహాభోగిగా,
అర్ధనగ్న నృత్యాలతో అలరించే
అందాల చకోరిగా,
శృంగార కళా చరమ సీమగా —
వేషాలు మార్చి మనముందు
**ఆడిపాడుతుంది సినిమా !**

పతివ్రతా ధర్మాల్ని ప్రబోధించే
వేశ్యామణిలాగా —
చిట్టచివర 'శుభం' అంటూ
ఒక్క మంచి పలుకాడుతుంది.

ఉబుసుపోక కోసం;
గుండె అరలో దాచుకున్న కోరికల్ని
వెండి తెరమీద చూచుకోవటం కోసం;

అభిమాన తారల అందచందాలను చూచి,
అందని ఆనందాలను
ఊహించుకోవటం కోసం
సినిమాకు వెడుతున్నావా భాయీ !

కాలాతీతమై పోలేదుగదా ?
గొంతులో జారిపోయే మత్తుపానీయం లాగా
సినిమాల్లో రసవత్తర ఘట్టాలన్నీ
ఇప్పటికే
తెరమీద ఇంకిపోయి వుంటాయేమో !
వెళ్ళు వెళ్ళు !
వెనక్కి చూడకు !

# ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణం "తెలుగు వ్యుత్పత్తి కోశం"*

## "(అ—ఔ)"

ఆంధ్రా యూనివర్శిటీవారు 'ఆంధ్రభాష, ఆంధ్రము,' అనే ఆరోపాలు నామరూపాలు లేకుండాచేసి, 'ఆంగ్లదేశం, 'ఆంగ్లేయులు' ఆరోపాలుగా గ్రహించి, ''ఆంధ్ర రాష్ట్రావతరణకు అసువు లర్పించిన అమరజీవి పొట్టిశ్రీరాములుగారికి ఈ కోశాన్ని'' అంకితమిచ్చి, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలకు ఈ తెలుగు వ్యుత్పత్తికోశం [అ.ఔ] ప్రథమసంపుటాన్ని అందించారు.

ప్రధాన సంపాదకులు పీఠికలో వాడిన [పుటX II] 'ఆంధ్రీకరించు' అనే ఆరోపాన్నైనా ప్రధాన గ్రంథంలో కనబడక పోవడం చూస్తే పీఠికాకర్తలు అచ్చుపడిన ప్రధానగ్రంథ పాఠాన్ని తిలకించారా అని అనిపిస్తుంది. పోనీ ''ఆంగ్లదేశం,ఆంగ్లేయులు, ఇంగిలీషు, ఇంగిలీషులు, ఇంగిలీషువారు'' అనే ఆరోపాన్న గ్రంథంలో పీఠికలో వాడిన (XVII) 'ఆంగ్లీకరించు' అనే ఆరోపాన్ని కూడా గ్రహించలేదే. పీఠిక XV పుటలో ప్రధాన గ్రంథం లోంచి ఎత్తివ్రాసి [పుట 141 ఉదహరిస్తూ] అందులో ఎన్ని అచ్చుతప్పలున్నాయో, ఎన్ని జారవిడిచారో చూచుకొన్నారా? ''పదాలు కాలానుగుణ్యంగా ఇవ్వబడ్డాయ''ని [XV] చెబుతూ పీఠికలో (XIV) ఉదహరించిన క్రీ. శ. 1278 నాటి ''ఓగిరానకు'' అనే శబ్దార్థం ఇవ్వవలసి ఉండగా ప్రధాన గ్రంథంలో 15వ శతాబ్దంలోని కాశీఖండంనుంచి ప్రయోగం చూపెడతారేమిటి? ఇంత శ్రద్ధారహితంగా పీఠికవ్రాస్తూ ''వ్యుత్పత్తికోశాల గురించి సరియైన అవగాహన పలువురికి లేదని (XV) పండితులూ, పామరులూ శబ్దరూపాన్ని నిఘంటువులో తేలికగా గుర్తించగల్గుతారని'' [XVI] వ్రాస్తే ఎట్లా నమ్మమంటారు?

''ఒక పదానికి ఉన్న యధార్థచరిత్ర చిత్రణాన్ని (పదం యొక్క పుట్టుపూర్వోత్తరాల్ని) తెలపటం, దేశ్యమైతే సజాతీయ పదాల్నివ్వటం, అన్యదేశ్యమైతే ఏభాషనుంచి పదంగ్రహింపబడిందో ఆ భాషాశబ్ద స్వరూపాన్ని అర్థసహితంగా ప్రదర్శించి నిష్పన్నం చేయడం మొదలైన వాస్తవాలైన వివరణ లివ్వడం'' ఆధునిక భాషాశాస్త్రవేత్తలు వ్యుత్పత్తిగా భావిస్తారని, ఆధునిక భాషాశాస్త్ర ప్రమాణాలకు అనుగుణంగా ఈ కోశం నిర్మించబడిందని, అయినా ప్రాచీన పద్ధతిలోకూడా అక్కడక్కడా వ్యుత్పత్తులు ప్రదర్శింపబడ్డాయని తెలుగు వ్యుత్పత్తికోశ నిర్మాణాన్ని గురించి ప్రధాన సంపాదకులు పరిచయం చేశారు.

తెలుగు వ్యుత్పత్తికోశమని పేరుపెట్టినా ఇందులో అన్యదేశ్య పదాలుకూడా గ్రహించడం జరిగింది. దీనికి కారణం ''పదాల చరిత్రను అవగతం చేసుకోవడం ద్వారా ఆయా ప్రజల సాంస్కృతిక చరిత్రను తెలుసుకోవడం సాధ్యమౌతుందని,' నిన్న మొన్నటి ఇంగ్లీషు అన్యదేశ్యాలకుకూడా ఈ నిఘంటువులో ప్రవేశం కల్గించారు. 12,219 ప్రధానారోపాలతో అ—ఔ వరకు ఉండే ప్రథమభాగం అవతరించడానికి ఎంతోకథ ఉంది అయినా క్లుప్తంగా చెప్పుకొందాం.

''తెలుగు వ్యుత్పత్తికోశ పధకం ఆచార్య శ్రీ సోమయాజిగారి చిరంతన సంకల్పశిశువు'' నేటికి శిరోదయం కావటానికి రూ. 7.60 లక్షలు ఖర్చుతోబాటు 21 సంవత్సరాలయింది. శిశువు భూమిమీద పడటానికి 31–3–1979 తేదీని నిర్ణయించారు. ఇక బొడ్డుకోసి, ప్రసూతిశౌచం, నామకరణ, డోలామహోత్సవం, అన్నప్రాసన, చౌలోపన, అక్షరాభ్యాసంచేసి తెలుగుపిల్లలతో కలిసిమెలిసి తిరగడానికి 79 నుండి మరో 5 ఏళ్ళు అవుతుందని (31–3–1984 అని) గ్రహసిద్ధాంత కోవిదులు చెప్పినట్లు, ప్రధాన సంపాదకులు పీఠికలో ప్రకటన చేశారు. అప్పటికి ఈ నిధులు, పెన్నిధులు ఉంటాయో లేవో చెప్పలేం.

21 సంవత్సరాల తరువాత ఆంధ్రా యూనివర్శిటీ 'మస్తిష్కపు లేబొరేటరీ' నుండి వెలువడిన ఈ కోశం ద్రావిడ భాషల్లో ప్రప్రథమంగా నిర్మించబడ్డ ఈ తెలుగు వ్యుత్పత్తికోశం ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ప్రమోదాన్ని, ప్రయోజనాన్ని చేకూర్చగలదనడంలో సందేహం లేదని (XXI పుట) ప్రధాన సంపాదకులు, ''భాషాశాస్త్రజ్ఞులకు నూతనమార్గాలు చూపిస్తుందనటంలో సందేహం లేదని'' నిఘంటువు పూర్తిగా వెలువడకుండానే సలహాసంఘసభ్యులలో ఒకరు నిస్సందేహంగా సర్టిఫై చేస్తున్నప్పుడు ఈ సమీక్షావ్యాసం తొందరలో చేసిన వ్యాసంగమే అవుతుంది. అయినా తలిదండ్రులు పిల్లని అత్తవారింటికి అంపిన తరవాత ఆమె గుణ, శీల స్వభావాదులు చెప్పగలిగినవారు—అత్తింటివారు, బంధువులు, ఇరుగుపొరుగువారు. లోకులు కాని తలిదండ్రులు కారుగదా! ఈ సనాతనమర్యాద ననుసరించే ఈకోశం ఎలాఉందో పరిశీలిద్దాం.

బ్రౌన్, శర, సూని, డిఇడి, టర్నర్, వృత్తిపద, కావ్యపద కోశాలు, ఆంధ్రశర దగ్గరపెట్టుకొని వాటిలోని పదాలు సావధా

నంగా కార్డులపై ఎత్తి వ్రాయించి, తిరకగా ఒకటీ రెండు పరిశీలించి, ఇంతలో మంత్రివర్గంలో మార్పులు వచ్చినట్టుగా ప్రాజెక్టు ప్రభుత్వ యంత్రాంగంలో మార్పులువచ్చి, కొత్తవారికి పాత పద్ధతులు కిట్టక, ఏవేవో మార్పులు చెయ్యాలనో, చేసో కాలం గడుపుతూ, నిధులకొరతవల్ల ప్రాజెక్టుపని నిలిపివేస్తూ, పునఃపరిశీలన సంఘాన్ని నియమించి, వారి సూచనలమేరకు తిరిగి యావత్తు పనిని తోడుతూ, ఎవరిపనులు వారు చూసుకొంటూ తయారుచేసిన కోశం లాగఉంది.

## ప్రాజెక్టు సభ్యుల గ్రంథాలలో ఉండి తె. వ్య కోశంలోలేనివి

'అవధ్యుఁడు' (అంగవికలుఁడు) 'అన్యోన్యం' (అర్థ విపరిమాణం) గంటి జోగి సోమయాజిగారి 'ఆంధ్రభాషావికాసం' పుట 599 (1968).

'ఆయిత్తారాలు' 'ఆదివారాలు' 'ఉభయతోపట్టు' 'ఉరాటం' డా. ఎస్వీ. జోగారావు. 'ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర' పుట 355 (ఆంధ్రా యూ. ముద్రణ 1961) (ఈపుస్తకాన్ని వాడినట్లు వ్య. కోశంలో ఉంది)

'అంటు సొంట్లు' — ఇంప్యూరిటీస్ — ప్రొ.జి.ఎన్. రెడ్డి. 'ఏ స్టడీ ఆఫ్ తెలుగు సెమోంటిక్సు' ఎస్. వి. యు. పుట 56 తిరుపతి (1966) (ఈ పుస్తకంలో అర్థవిపరిమాణానికి ఇచ్చిన పదలు చాలా తె.వ్య.కో. లేవు. పైగా ఈ గ్రంథాన్ని కూడా బిబ్లియాగ్రఫీలో ఇచ్చేరు).

'ఇట్టిదిం', 'ఏమిని', — ఈ పదాలను డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ప్రాచీన ప్రయోగాలతో సహా చూపించారు. (మహాగవేషణా రచన. వైకృత చంద్రిక. పుట LVII. (1975). వైకృత చంద్రికను 'కోశ సంపాదకులు వాడినా దానిలో కొన్ని తద్భవాలు తీసుకోలేదు. ఉదా. అంగడి శబ్దం అంగణానికి వికృతి ఉవితనుక మొ. వి (వె. చ. పుట 118).

## ఆంధ్రాయూనివర్సిటీ ప్రచురణలలో ఉండి కోశంలో లేనివి

ఆంధ్ర విశ్వవిద్యాలయం 1937లో ఆంధ్ర భాషచరిత్రను ప్రకటించింది. గ్రంథకర్త డా. చిలుకూరి నారాయణరావుగారు కొన్ని నెలలూ మచిలీపట్నం రేవు తెలుగు నావికులలో కాలంగడిపి మాలీమ్ శాస్త్రం గురించి పదాలు సేకరించారు వాటిని తమ గ్రంథంలో ఇచ్చారు. అందులో 'అకరాబ్' (రెండు ముఖ్యదిశలకు సరిగా మధ్యనుండు దిక్కు), 'అజ్జ' (లాటిట్యూడ్) మొదలైన పదాలు కోశంలో చేరలేదు. ఇదే విధంగా స్థల నామాలలోని ద్వితీయావయాలను గూర్చి ఆయన పరిశోధించారు. అంగి, (రేలంగి, వోరంగి, మేరంగి) ఆల, (గద్వాల, దుద్యాల, వెల్లాల) ఉట్ల (వోరుట్ల), ఏడు (ఆకులేడు, చిర్యేడు) మొదలైన పదాలకు వ్యుత్పత్తి చెప్పవలసిన బాధ్యత కోశనిర్మాతలపై ఉంది. ఈ నడుమ డా కేతు విశ్వనాథరెడ్డిగారు ''కడప ఊళ్ల పేర్లు'' అనే పరిశోధనా గ్రంథాన్ని ప్రచురించారు. (నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి. 1976.) ఆధునిక కాలంలో గ్రామనామ శాస్త్రంమీద సాధికారికంగా వెలువడిన ఉత్తమోత్తమైన గ్రంథం ఇది. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు అనేక భాషా విషయికమైన ప్రచురణలతోబాటు దేశి సారస్వతోద్యమాన్ని పురిగొల్పే యక్షగానాలను ప్రచురించారు. వాటిలోని మాటలెన్నో ఈ కోశంలో లేవు.

## పూర్వ నిఘంటువులపై వచ్చిన విమర్శనలను పరికించని వైనం

శబ్ద పరామర్శ, అర్థ పరామర్శ, పార పరామర్శ, నిఘంటువు కెక్కని పదాలు, నిఘంటు విమర్శలు మొ. వి. ఎన్నో వ్యాసాలు నిన్న మొన్నటి వరకు వెలువడుతూనే ఉన్నాయి అన్నిటి కన్నా మిన్న గిడుగు రామ్మూర్తి పంతులుగారి ''సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనం''. దీన్ని వారు 'ప్రతిభ' పత్రికలో ప్రచురించేరు. (1939). అటు తరువాత దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి 'సాహిత్య సమీక్ష' (నెల్లూరు 1955) వచ్చింది ఇవిగాక ఏవో లెక్కలేనన్ని వ్యాసాలు తెలుగులోను, ఇంగ్లీషులోను వెలిశాయి.

సూర్యరాయాంధ్ర నిఘంటువు అనుబంధాలు, తప్పొప్పుల పట్టికలు ఉన్నాయి. శర అనుబంధం ఉంది ఈ సామాగ్రిని సేకరించి ప్రతీ పదానికి చరిత్ర సేకరించవలసిఉండేది. వీటిని చూడలేదని చెప్పటానికి ఒకటే తార్కాణ. వీరిచ్చిన ఉపయుక్త గ్రంథపట్టికలో ఈ గ్రంథాలపేర్లు లేవు. పైగా సంపాదకవర్గంవారు మూల గ్రంథాల ముక్కుమొహం చూడనట్టుంది.

(1) ''ఉలుక్కు అశ్వగతి భేదం.'' ఇది 'లుక్కు' గాని ఉలుక్కు కాదని సూ. ని. సవరించుకొంది. దీపాలవారు శర పార బాటుని, మానిపారబాటుని (సా.స. 98) ఎత్తి చూపారు. అయినా తిరిగి ఈ కోశంలో అదేరూపంలో కూర్చుంది.

## అనుఁగు మొగసాల-ఏనుఁగు మొగసాల

(2) ''అనుఁగు మొగసాల ('అనుఁగు' క్రింద) వి. రాజ మందిర సింహద్వారానికి చేరి ఉన్నశాల. భార. ఉద్యో. 3 177, హరి. ఉ. 3.17. శృం.నై 6.86.'' ఇందులో భార. ఉద్యో. 3.177లో ''నారాయణుండు...రాజమందిర ద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలఁ జొచ్చి'' అని

ఉన్నది. అనుఁగు మొగసాల లేదు. హరి ఉ. 3.17లో 'అనుంగు మొగసాల గదనికవ తీర్చుండ్రై' అనే ఉన్నది ఇక శృం.నై. 6.86లో ''అపుడు మొగ సాలఁ'' కాని 'అనుగు మొగసాల' లేదు.

పైన ఇచ్చిన ప్రధానారోపం కనబడే ఎర్రన హరివం. ప్రయోగం తప్ప తక్కిన రెండు ప్రయోగాలు సరిపడవు. అయితే ఈ 'అనుఁగు మొగసాల' తప్పొ రైటా అన్నది కొంచెం విస్తారంగా ఆలోచిద్దాం. 'ఏనుఁగు' అనే ఆరోపం క్రింద 'ఏనుఁగు మొగసాల' అనే ఉప ఆరోపాన్ని శృం.నై (3.85)లో ఉందని చూపేరు గదా! తిక్కన భారతంలో పలుచోట్ల 'ఏనుంగు మొగసాల' అనే సమాసాన్నే వాడేడు. రాజగృహ సుఖశాల ముందు ఏనుగుల గుంపు తీర్చి ఉండటం మహారాజ మంగళ చిహ్నం. ''చివ్వాని వాకిట నిభ మదపంకంబు రాజభూషణ రజో రాజి నడఁగు'' అని తిక్కనే దీని వ్యుత్పత్తిని విరా. 2-191లో సూచించేడు కాబట్టి 'అనుఁగు మొగసాల' ఉప ఆరోపం తప్పు :

(3) అనుఁగు ప్రధానారోపం క్రింద ఉ.హ. 9.214 తప్పే. ఉ.హ. అంటే ఉత్తర హరివంశం అనుకొంటే అందులో 6 ఆశ్వాసాలు కంటేలేవు. గ్రంథ వివరణ పట్టికలో ఉత్తర హరి వంశానికి 'ఉత్త. హ.' అని ఇచ్చారు. ఎర్రన హరి వంశానికి 'హరి' అని యిచ్చారు. అప్పుడీ ప్రయోగం రెండింటికీ చెందకుండా పోతుంది. ఎర్రన హరివంశం. ఉత్తరభాగం9-214లో 'అనుఁగు' లేదు.

(4) అదే విధంగా 'అదవ' క్రింద ఇచ్చిన 'అదవెట్టు' ఆము 6.112 సరిగాలేదు. ప్రస్తుతం లభిస్తున్న వేదం వారి ఆముక్తమాల్యదలో ఈ ప్రయోగం. 7.48గా ఉంది. ఇలా ఎన్నో ఉన్నాయి.

(5) 'అసిఁబోవు' ('అసి క్రింద) రా మా 224 ఇక్కడ 'అసివోవు' అని ఉండాలి. పద్యం యమకబద్ధం (సా.స. 310)

(6) ఆఁబెయ్య ఈ పాఠం అసాధువు (సా.స. 14)

(7) ఆటంకం — — బహిష్టు. లగ్గానికి ఆడవాళ్ళకు ఆటంకం లేకుండా ఉండాలి (వ్యవ).

(8) ఆపసోపాలు—హిందీ. ఆఫ్ సోస్ 'అలాస్' (బ్రౌను). ఇది ఆపు+సోపం కాదు. అందరూ వాడేది 'ఇడ్లీ'. ఈ పదం లేకపోవడం అన్యాయం : ఇది ఇడి + ఇలి➔ఇడ్లీ అయిందేమో ఆలోచించాలి (చిమ్మిలి, ఉప్పిడి, చప్పిడి).

(9) ఇను – ''రెండు రెట్లు శృం నై. 8–61''. 'ఇనువింతలు' అని వేదం వారి ప్రతిలో ఉంది. కాని ఇది తప్పని ఇక్కడ 'ఇసిఱింతలు' ఉండాలని సా.స. పుట 118,120. 'ఇనువింతలు' అనే పదమే లేదన్నారు దీపాలవారు.

(10) ఉద్దుపొడి కాదు ఉద్దిపొడి. (సా.స. 107-109 పుటలు)

(11) ఉప్పందనము – వాడుకలో ఉప్పదనమే ఉంటుంది. బ్రౌన్ ఉప్పదనం అన్నాడు, దీపాల వారు బ్రౌన్‌దే రైటన్నారు (సా.స. 384)

(12) ఊ– బొట్టు ('ఊదు' క్రింద) 'నవనాధచరిత్రలో' ఇచ్చినది 'ఊదు బొడ్డు' కాని బొట్టు కాదు.

## అర్థాలు వ్రాయటంలో విపరీత వైదుష్యం

(1) 'అంకిలి' ''తాలుమూలమందలి కీలు, దౌడకీలు.'' తాలువంటే దౌడకాదు

(2) 'అచ్చ తెలుగు'. ''స్వచ్ఛమైన తెలుగు ?''

(3) 'అడ్డము' విఘ్నం, ఆటంకం, భార ఆది 4.184 ఈ పద్యంలో 'సీవంగిన నడ్డంబె' అని ఉంది. అర్థం ఏమిటి ?

(4) 'అందుగు', 'ఇందుగు' – రెండింటికీ బిల్లచెట్టు అనే అర్థం కుదరదు.

(5) అల్లీస. ''పడవతెడ్డు, పడవతోసే కర్ర...... (బహుశః పడవ నడిచేటప్పుడు తెడ్డు గుండ్రంగా తిరుగుతుంది కాబట్టి)'' పడవ ముందుకు పోవడానికి నీళ్ళను తెడ్డుతో తోస్తారు. అంతే కాని తెడ్డు గుండ్రంగా తిరగదు. దీన్నే బ్రౌన్ 'అల్లీసంతో నీళ్ళుత్రీయుట'' అన్నాడు. అంటే నీళ్ళను పక్కకు నెట్టుతారు ఈ నెట్టేటప్పుడు శ్రమ తగ్గేటప్పుడు 'హైలేసా, 'హైలేసా' అంటారు.

(6) ఆకాశవాణి–త. ఆకాశ్‌వాణి (పుట 141) (తమిళ భాషలో ఇట్లాగే అంటారా).

(7) ఆది ఆంధ్రులు – ''ఆంధ్రులలో మొదటివారు హరిజనులు'' ఆమని – 'వసంతం' అన్నారు. ఋతువు అని కూడా ఉండాలి. 'నీరామని' వర్షఋతువు.

(8) ఆళుగ...''ఉడుమును పోలిన జంతువు''. ఈ రెండు జంతువులు ఒక్క జాతిలోనివి కావు. ఉడుము బల్లిజాతిలోనిది. గుడ్లు పెడతుంది. ఆళువ పిల్లలను కంటుంది.

(9) ''ఇరులదాయ'' ('ఇరులు' ప్రధానారోపం క్రింద) ''(దాయ.శత్రువు). సూర్యుడు శృం.నై. 8.201.'' శృం.నై. పద్యంలో ''ముక్కంటి తల పువ్వు''తో మొదలయి ఇరులుదాయ, చందమామ'' అని ఉంది. ఈ తప్పు గిరీంమూర్తి ఎత్తిచూపేదు. నిఘంటవులు ముందు పెట్టుకొని గుడ్డిగా కాపీ చెయ్యడం వల్ల వచ్చిన ప్రమాదం.

(10) ''ఉప్పుతో తొమ్మిది. వి. ఉప్పుతో కలిసి వంటకు కావలసిన అన్ని పదార్థాలు''. ('ఉప్పు' ఆరోపం కింద) తొమ్మిది పదార్థాలు ముఖ్యమని పై సమాసానికి అర్థం. 'అన్ని పదార్థాలు' అని కోశ నిర్మాతలు రాయవలసింది కాదు. ఆ తొమ్మిది ''ఘటః, పటం, జలం, కాష్ఠం, తండులం, తైలమేవచ; శాక, మగ్ని సమాయుక్తం, లవణం నవ సంయుతం.'' (ప్రభాకరశాస్త్రి తె. మె. పు. 118 (1960)

(11) 'ఉప్పుపిండి' ('ఉప్పన' ఆరోపం కింద). ''రూ. చూ. ఉప్పుంబిండి. రూపాంతరం దగ్గరచూస్తే రూ. ఉప్పిండి. 2 ఉప్పుపిండి. వి. ఉప్పువేసి వండిన పిండి'' అన్నారు. ఉప్పిపిండి 2 వద్ద ''చూ ఉప్పు 2 '' అన్నారు. అక్కడ శుద్ధశ్రోత్రియుడులా 'లవణం' అని అర్థం రాశారు. మొత్తంమీద ఉప్పుపిండి అంటే 'ఉప్పేసిచేసిన పిండి' అని అర్థం అయింది. ఆ మాట కొస్తే ఉప్పేసిచేసిన పిళ్ళన్నీ ఉప్పు పిల్లవు తాయా ? ప్రస్తుతానికిక్కడ ఆపి 'ఉప్పన' అనే ఆరోపం కింద ఇచ్చిన 'ఉప్పిండి' తీసుకొందాం. ''ఉప్పిండి' ఉప్పు 2 + ఇండి. రూ–ఉప్పిడి. విణ. ఉప్పులేనిది. ఉప్పిండి 2 ఉప్పు + పిండి రూ.చూ. ఉప్పుంబిండి. వి. బియ్యపు పిండితో చేసిన అల్పాహారం.'' ఇప్పుడు 'ఉప్పుపిండి' అంటే బియ్యపు పిండితో ఉప్పేసిచేసిన అల్పాహారం స్పష్ట మయింది. ఇక ఉప్పిండి, ఉప్పిడి అంటే ఈ కోశం ఇచ్చిన అర్థాల ప్రకారం ఒకటి ఉప్పులేని ఆహారమని, (ఉప్పు + ఇడి (అభావద్యోతకం ఇడి అంటే లేని అని అర్థం) రెండోది 'బియ్యపు పిండితో' చేసిన (ఉప్పు + పిండి=ఉప్పిండి) అవుతుంది. 'ఉప్పిడి యుపవాస' మంటే శుష్కోపవాసం అని చెబుతూ కాశీ 2.83 చూడమన్నారు. అక్కడ 'ఓర్పుమైనుప్పిండి నుపవాసముండనీ మగనాలి. సరిం బోల్పందగదు విధవ'(కాశీ 2.83) అనిఉంది. ఇక్కడ 'శుష్కోప వాసం' అని అర్థం చెప్పటం సబబుగాలేదు. విధవ ఉప్పిడి అనగా ఉప్పులేని ఆహారము తిన్నా ఉపవాసం ఉన్నా అని అర్థం వస్తుంది గాని 'ఉప్పండి యుపవాసం' అనే విధంగా సమాసం చేసి చెప్పలేం. శ్రీ నాథుడు సమాసం చెయ్యలేదు. 'ఉప్పండినే' 'ఉపవాసము' అన్నాడు. విధవలకు రాత్రిపూట ఆహారము నిషిద్ధం కాబట్టి ప్రత్యామ్నాయంగా ఏదో అల్పాహారంగా సొజ్జ,ఉప్పుపిండి, లేదా తీపితో కలిపిన బియ్యం పిండి తింటారు. ఇక ఉపవాసం అంటే పర్వదినాలలోను, వ్రతాలలోను, యాత్రలలోను పూర్తిగా ఆహారాన్ని విసర్జించటం. దీన్ని 'ఉప్పిడి యుపవాసం' అనడం ఎక్కడా వినలేదు. ఒకవేళ సమాసంగా తీసుకొన్నా ఏదో ఒకపూట ఇంత పిండి తిని ఉండడం. 'ఉప్పిడి యుపవాసం' అవుతుందేమో!

దీన్ని ఇంత సాగదియ్యటానికి కారణం కోశగ్రంథ కర్తల వ్యుత్పత్తి ఉత్పత్తి శక్తిని తెలుసుకోడానికి ఇంతకీ రహస్యం ఏమి

టంటే కోశకర్తలు 'ఉప్పు'ను ఉప్పుగా గ్రహించి ఇంత తికమక పడ్డారు. పై ఉప్పిండి, ఉప్పిడి, ఉప్పుపిండి, ఉప్పుబిండి రూపాలలో ఉన్న 'ఉప్పు' ఉప్పుకాదు. ఉప్పుడు బియ్యానికి కోశకర్తలు ఇచ్చిన 'ఉడికిన' (బాయిల్డ్) అనే అర్థమే ఈ పూర్వపద 'ఉప్పు'కి అర్థం చెప్పాలి, 'డిఇడి' దగ్గర పెట్టుకొని నిధానంగా పరిశీలించక పోతే ఇదే ఇబ్బంది. భేషజం కోసం డిఇడి, ఉదహరిస్తూ కొందరు జంబాలు కొడుతూ ఉంటారు. తెలుగు నిఘంటు పరిశీలనే శ్రమసాధ్యమైనప్పుడు డిఇడి మాటకేం లెండి. డిఇడి ఏమంటుందో చూడండి: 585. Ta Uui (-V-, -nt-) to boil away (-PP-, tt-) to boil (tr); Uviyal a boiled dish, Tel (k) uppu to boil (tr),

ఇక ఉత్తర పదము 'ఇండి' కాదు, 'పిండి' కాదు. అది 'ఇడి' కోశకర్తలే 'పిండితో చేసిన అల్పాహారం' అన్నారు కదా. పిండితార్థం ఏమంటే పిండితోగాని, రవ్వతోగాని, మొరుంతోగాని ఉడకబెట్టిన ఆహారం అని చెప్పుకోవాలి. ఉప్మా కూడా ఉప్పు + మా. ఉడకబెట్టిన పిండి అని అర్థం. చప్పిడి అంటే చప్పనయిన ఆహారం. దీనికి మూలధాతువు చుప్, సుప్...

(12) "ఎత్తువేయు. స. క్రి. తూచు" అన్నారు. చదరంగంలో ఎత్తువేయు, స్కూలు మానడానికి పిల్లడు ఎత్తువేస్తున్నాడు అంటే వచ్చే అర్థాలు ఏవి?

(13) పూర్వ నిఘంటుకర్తలు, అర్థాలు స్పష్టంగా తెలియని చోట "వృక్ష విశేషం, రోగవిశేషం, ఒక రకం వస్తువు" అని రాస్తూ వచ్చేర్శు. ఆ విధానాన్ని పెద్దలు చాలా మంది విమర్శించారు. ఈ కోశంలోకూడా "ఉడవ మత్స్య విశేషం, ఒడ్డిమాను, వివృక్ష విశేషం ఆటవెలది. 3, ఒకరకం పద్యం" అని అర్థాలు ఇచ్చి దాటేశారు.

## "కాలాను గుణ్యంగా ఇవ్వని" ప్రయోగాలు

'అగలించు' నన్నయ 3·2.343 (పాఠాంతరం) 'అగ్గి' క్రీ.శ. 750. (బు·రా.ప్రా.ఆ.శా 207 పుట). 'అంకకాఅ' క్రీ. శ. 1006 (ప్రా. ఆ. శా. 207 పుట) 'అట్టు(అటులు)' భార 1-4-261. 'అనిపించుం' భార 11-1-51. 'అతుయు' భార 3-2-196 'అరవ' 'అరువాహి' (కులప) మారెకొండ శాసనం (క్రీ· పూ. 200), మహదేవశాస్త్రి హెచ్. జి. టి. పుట 23 (1969] విజ్ఞానీశ్వరము. ప్రా. కా. 56 (1977) 'అరివాణం' క్రీ. శ 925 (బు. రా. ప్రా. ఆ. శా. పుట 218) 'అటియ' క్రీ. శ 842 (అదే) 'అణతి' క్రీ. శ. 650 (అదే) 'ఈ' సమీపం, 'ఈయున్న పొష్యప్రోలు' భార 1-1-116. 'వింగులించు' కు. స. 3 108 (వావిళ్ళ)

## కోశంలో చేరని కొన్ని పదాలు

అకస్మాత్–శ. ర "వాడుకలోనిది" అని ఇచ్చింది. జయంతి –రామయ్య (ఉ.రా.ప. నాటకం. పుట111) వాడేరు. అక్కనాచి–క్రీడాభిరామం. పుట 72 (1952) అగుము. – 1-1-220 అంకిచండాలము,అంగలించు–బా. వ్యా క్రియా 63. సూ. అచ్చత బొట్టు – శృం. శా. (?) అడికించు – భోజ. రా. 4. 209(?) అడుగడుగునకు. అడుగు అడుగు క్రీ. శ. 850 (ప్రా. ఆ. శా. పుట 210) అడుగులొత్తు. భార. 3. 2. 77. అడుగులంటు భార 3. 2. 215 అడుక్కొను హంస. 3-142. (1938) అడ్డంపడు. అనారోగ్యం (గుంటూరు, ప్రకాశం జిల్లాల వాడుక) అడ్డిగళిల. కృష్ణామండల వ్యవహారం.(క్రీడా. పీఠిక. 120,121) అంటుసంటు (సొంట్లు)పొందు. 5. 305. తెలుగు సెమేంటిక్స్ 56 (1966) అతిశయం. వాడు పదిరూపాయిలు ఇచ్చింది అతిశయమే. టి. సె. 136 పు. అత్తురాలు. ఓడ పరిభాష, వి. నా. ఆం. భా. చ. పు. 623. అదుపు ఆజ్ఞ తె సె. పుట 57. అధిగమించు. భార. 1-1. 77. అద్దెచాకిరి. అథవా. వరహ. పు. 2-156. అదృష్టం. తె. సె. 98, 136, 142. అధిక్షేపించు భార 3-1.228.అన్మానించు. దశకు. 9,5 అంతలవారు భా.ర 5-2-6 అంతరించు. భార 1. 3· 40. అన్నడు. శివత. సా. 269, అప్పలు పొడుచు పొందు. 3. 18. అప్పర-భీమ.5.30. అబుబరము – హర. 7. 55 అభాసు. (తిరుపతి వెంకటకవుల అనర్ఘనీరదం పుట 24) అమి. (వ్యతిరేకార్థ ప్రత్యయం) 'అమ్మనమ్మ' –అమ్మాయమ్మ... 'అరగమి'. దశకు. 7. 149 'అరకూళ్ళు' ఆముక్త, 7-14 (వేదం. (ప) 'అరవ సామెత' కళా. 1-24 'అరెస్టు' 'అవసరమిచ్చు'. కాశీ 7.222 దర్శనంబిచ్చు. 'ఆగించు'. బాల. వ్యా. క్రియా. 76 సూ. 'ఆమటామట' ఆమటామట మొక్కువారు చంద్రా. 5-41. 'ఆరకూటము'– ఉత్తరావయవం 'కూట' ద్రావిడం. 'ఆరాటంపడు' – చి. సూ నీతి చంద్రిక. 'ఆరోపాలు' – (ఎంట్రీ) ఆలాపు- పానపాత్ర శివ.మ 289. ఇంకా, ఇంకాన్, ఇంజన్, ఇనుప పెనం, ఇనుప పెనము. అప్పకవి. 5. 122 ఇంతసేయు. వి పు. 7. 120. ఇన్నూరెన్ను ఇమిటేషన్. 'ఇలువాడి' వెం. పంచతంత్రం (3 148.)ఇస్కూలు ఇసుకూలు. "ఈ యిసుకూలు బళ్ళకడ యింగిలి పీసులు దాసు శ్రీరాము తెలుగునాడు. 'ఈపరాలు'-వియ్యపురాలు మాండలిక పదకోశం. 'ఈవుత.' శాసన పద్యమంజరి (నెం. 59. మొ. బా. పుట 78) 'ఈసారికి' ఈసారికి వైశాఖపు, మాసానకు. (చా. మ. మ. 2భా. పుట 34(1922) 'ఉచ్చనీచాలు'. వాడికి ఉచ్చనిచాలు లేవు. 'ఉడుంపట్టు', ఉత్తరియించు (శృం. నై. 7.37), ఉత్తరాదివారు. 'ఉద్యోగం', ఉపస్తరించు (భీమ 2-135), ఉపాసెంబు (భీమ 2-100. పా. జే) ఉమ్మలంపడు – చి. సూ నీతి చంద్రిక, బాల? (పూ. ని. విమర్శ) ఊడుకొను. చి. సూ (సూ. ని. విమర్శ) ఊదొత్తులు, ఎగ్జిబిషన్. విదావిదలు కువలయాశ్వ చరిత్ర (2-31) వినకొను శివత, సార. (పద్యం 446) 'ఎఱచేయు' నీలా. సుం (3. 25) 'ఎలక్షన్'- 'ఐనా.' ఐనా కలదొక విన్నపంబునాకు, జయంతి రామయ్యా· ముక్తీశ్వర శతకం. 'ఎనకొను' శివత. సా. (446) 'ఒంటివాడు' 'నల్వకచ్చువంటి యొంటివాని' (పాండు 5-197) 'ఒత్తుకో' తప్పుకో 'ఒహటి.'

సాగారాంధ్రమాండలికము. (భా. చా. వ్యా. 98) 'ఓగ' (హరి ఉ. 3. 231) 'ఓరుగల్లు' ఆం. భా భూ. 'ఓవర్‌సేర్' 'ఓసరేయి' - (హర. వి. VI 20.) (??). 'ఔన్సు'. ఇలా ఇచ్చు కొంటూపోతే ఈ కోశానికి ఒక అనుబంధం తయారు చెయ్యొచ్చు.

## మూల రూపాలు

'అడి' కుదువ. సం. అధి. ప్రా. అడి. 'అబ్బో' ప్రా. అప భ్రంశ. అఉబు, అఉబల. 'అమ్మ, అంబు' అనుప్వ→అన్ప అంపు→అంబు→అమ్మ. 'అరయు'—అరసి—సం. ఆదర్శికా అరసియా→అరసి. 'అరి' సం. హృత. ప్రా. హరిఅ. (చి. నా. ఆ.భా.వ. పుట 483) హరించబడునది కప్పము. 'అలయు' త. ఇళై→అలయు (డి ఇడి 435). 'అలుకు' త. అలంపు. 'అణి' ప్రా. అఢిఅ, అణిఅ—మెల్లైన (చి నా. ఆ. భా శా. పుట 483). 'ఆవి' ప్రా. ఆతప, ఆఅట. 'ఉవ్విళ్ళూరు'. చకి. త క్లాంతయోరు వ్విడం షడ్భాషా చంద్రిక. పు. 1. 7 (సూ.ని. విమర్శ). 'ఊలు' ఇంగ్లీషు మూలపదం ఊల్, రష్యన్ ఓల్నా, విధ్‌లో విల్నా. 'వినుము' – సం. అనూప→ఎనుప. 'ఏహ్యము'. ఇది సం. ఐహిక కాదు, హేయ శబ్దభవం. 'ఐరేని'. దీనికి ప్రా. ఐరాణి. మూలం. శచీదేవి. 'ఒంకె'. సం వంక్యము. 'ఒడ్డు'. పందెంగా పెట్టు. పాలీ. ఒడ్డేతి తత్థాపాసేచ జలానివ ఒడ్డాపేసి. (గిరీమూర్తి) 'ఓము'. సం. ఓమన్ రక్షించు. కాపాడు. M W 'ఓర'. పులి హోర. పుః + ఓర. ('ఓరై' క్రింద డిఇడిలో rice that is mixed with other edibles like tamarind.)

## ఆంధ్ర గ్రంథ సంకేతిక పట్టిక

ఉపయుక్త గ్రంథ సూచికలని. ఈ విషయంమీద చదవదగ్గ గ్రంథాలని, గ్రంథ పట్టిక లివ్వడం సిద్ధాంత వ్యాస రచయితలకు, గ్రంథకర్తలకు సంప్రదాయం. ఆ గ్రంథాలన్నీ ఉపయోగించేయని చెప్పడం కన్నా గ్రంథ పట్టికలను ఇవ్వడం ఒక రివాజయింది. అది శాస్త్రీయంగా జరుగుతోందా లేదా అన్నది అప్రస్తుతం. ప్రస్తుతం సమీక్షకు గురియైన కోశంలో అటువంటి పట్టికలు రెండు ఉన్నాయి. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాన్ని నిఘంటువు క్రింద చేర్చి నిఘంటు కర్తలుగా మామిడిపూడి వెంకట రంగయ్యగారి పేరు, సూర్యరాయాంధ్ర నిఘంటు కర్తలుగా జయంతి రామయ్యపంతులు పేరు ఇచ్చారు. చిన్నయసూరి నిఘంటువు వీరు చూసి వాడినట్లు 'అముద్రితమని' సెలవిచ్చారు. ఇక ఆంధ్ర గ్రంథపట్టిక చూడండి. ముఖ్యంగా ప్రాచీనాంధ్ర రచనలపై కోశ నిర్మాతలకు ఎంత పరి జ్ఞానంతో పాటు అభిమానం ఉందో తెలుస్తుంది.

ఉన్నవారు ఊరుకోకుండా 'గ్రంథ సంకేతాలు', 'గ్రంథ నామాలు', 'గ్రంథకర్తలు' 'శతాబ్దం' అని శీర్షిక లిచ్చారు. మచ్చుకి కొన్ని పరిశీలిద్దాం.

1) ధరణి దేవులరామయ దశావతార శతకం వ్రాశాడట! దశావతార శతకం ఆ.యూ. తాళపత్ర గ్రంథకాంతారంలో ఉందా!

2) చిరుమామిళ్ళ కృష్ణకవి (శకుంతాల పరిణయ గ్రంథ కర్త) చిరుమామిళ్ళ గృహోపనామకులు కమ్మప్రభువులు. ప్రఖ్యాతులయిన వాసిరెడ్డి వంశోత్పన్నులతో సంబంధ బాంధవ్యములున్నవారు. కృష్ణకవి బాపనోడు. కమ్మవారింటిపేరు బాపన కవికి తగిలింప దగునా?

3) ఉద్భటారాధ్య చరిత్ర అనే శైవ గ్రంథాన్ని వ్రాసిన వాడు తెనాలి రామకృష్ణకవి ఘటికాచల మాహాత్మ్యం అనే వైష్ణవ గ్రంథాన్ని వ్రాసినవాడు తెనాలి రామలింగకవి. భలే!!

4) బిల్హణీయం వ్రాసిన కవి వంగిపెద్ది కృష్ణస్వామి (సయం ఏదో జాగ్రత్తగానే రాశారు)

5) వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానాలకు గ్రంథకర్త మూర్తి కవియట. గద్యలో 'రామరాజభూషణుడు'.

6) మర్దనకవి రామలింగేశ్వర శతకం వ్రాసింది అడిదం సూరకవి. కూచిమంచి తిమ్మకవి కాదు.

7) శివరహస్యఖండం–కర్త వెంకటదాస కవికాదు. కోడూరి వెంకటాచల కవి.

8) శివయోగసారం గ్రంథకర్తపేరు తెలియకపోతే చాగంటి శేషయ్యగార్ని పలకరిస్తే కొలని గణపతి అని చెబుతారు.

9) సప్తపదులు—ముద్దుపళని వ్రాయలేదు. "అది శ్రీని వాసాచార్యులు రచనకాని పళని రచన కాదని" బులుసు వేంకట రమణయ్యగారు ఎన్నడో పరిష్కరించారు.(ఆంధ్రకవి సప్తశతి)

10) వక్కలంక వీరభద్రకవి సేతుఖండం వ్రాయలేదు. వ్రాసింది భాస్కర వెంకటాచలకవి, వెలగపూడి కృష్ణయ్య.

11) సుదంతా పరిణయం అముద్రితమయితే కవి సర్ప గారుడం, కార్తీక మాహాత్మ్యం ముద్రితాలా ?

12) కాళహస్తి మాహాత్మ్యము, కాళహస్తి శతకము అని ఏదో శీర్షికలిస్తే సరిపోదు. శ్రీకాళహస్తి శ్రీ (చెలది) కాళహస్తి,, అనే మూడింటి జీవరాసులు సాయుజ్యం పొందిన కధ. శతకానికి శ్రీ చేర్చకపోతే యతి చెడుతుంది. శ్రీకాళహస్తి→తిరుకాళ హత్తి→తిరుక్కాళత్తి→తిరుక్క→త్రిక్క→తిక్క – తిక్కన పదావిర్భానికి ఇదే దారి. తెలుగు వ్యుత్పత్తి పదకోశ నిర్మా తలకు ఇది చాల చిన్న విషయమే కావచ్చు.

13) కవిజన సంజీవని కర్త ముద్దరాజు రామన అంటే కుదరదు. అతని అసలు పేరు రామభద్రకవి. అతని పెద్దన పెద రామ, చిన్నన్న చినరాముడు పెదరాముడు రాఘవపాండవీయ ఆదర్శనామక వ్యాఖ్యాత. ఈ విషయాన్ని రావూరి దొరస్వామిశర్మ గారు ఎన్నోసార్లు గీపెట్టేరు

14) కుచేలోపాఖ్యానం, సురాభాండేశ్వరం వ్రాసిన కవి ఒకడే. ఘట్టుప్రభువు, (గట్టుప్రభువు) ఒకరి 16వ శతాబ్దం ఒకరు 18వ శతాబ్దం ఎలా అవుతారు ?

15) అదేవిధంగా శృంగారమల్హణ చరిత్ర, మల్హణ చరిత్ర కర్త ఎడపాటి ఎఱ్ఱన ఒకడే. ఒకరు 16వ శతాబ్ది మరొక 18వ శతాబ్ది ఎట్లా ?

16) ఇందుపల్లి భవానీ శంకరుడు – ఇంటి పేరు ఈదులపల్లె.

అయ్యా ఇదీ ఈ ఆంధ్ర గంధ సంకేత పట్టికను తయారు చేసిన పద్ధతి. ఏరుదాటిన తరువాత తెప్ప తగలెట్టినట్లుంది. ఇది విశ్వకళా పరిషత్తు సాధికారిక ముద్రణ అని మొహరు వేసి ముద్రించారు ఈ మొహరుతోటే "ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర" అనే శీర్షికతో 1961 లో డా॥ యస్వీ జోగారావుగారు కష్టార్జిత మూర్జితమైనదని చెప్పకొని 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, అని ప్రచురిస్తే 'యక్షగానములు-వాఙ్మయచరిత్ర' అని మారిస్తే ఎట్లా. అందులో 'ప్రొఫెసరు' అని కూడా ఆయన పేరుకి ముందుగా తగిలించేరు అదే విధంగా పీఠికలో 1970–76 వరకు కీ. శే. ప్రయాగ కోదండ రామశాస్త్రి విగతజీవుడై ఎట్లా పనిచేయ గలిగి ఉంటాడు? ఆ పదాలు అక్కడ వాడే టప్పుడు కీ. శే. అనే పొడి అక్షరాలు తొలగించాలి. 'ఈ దశలో పని చేసినవారు' అని చెబుతూ కీ. శే. అంటే ఎట్లా అన్వయం అవుతుంది?

## కోశంలో ఉండి గ్రంథ సంకేత పట్టికలో లేనివి.

సులక్ష. సులక్షణసారము – లింగంగుంట తిమ్మన. 16 శ. ద. హిం. శా. దక్షిణ హిందూ శాసనాలు (South Indian Inscriptions) మించు. ('అప' క్రింద. అపసడి) ఎపి. ఇండి. ఎపిగ్రాఫియా ఇండికా. అభి.రా. అభిషిక్త రాఘవము. వసురాయని చాటువు. (వసురాయ చాటు ప్రబంధము). రామలింగని చాటువు. ఇంకా ఎన్ని ఉన్నాయో!

'బిబ్లియాగ్రఫీ' అని చెప్పి కోశంలో వాడినట్లు భ్రమ కలిగించడానికి, భయపెట్టడానికి ఎన్నో గ్రంథాలు ఇచ్చారు. అదీ తిన్నగా లేదు. అంటే ఇవ్వవలసిన తీరులో (ముద్రణ, పబ్లిషర్ వగైరా) లేదు. గ్రంథకర్త పేరుకి బదులు సంపాదకుని పేర్లు ఉన్నాయి. కిట్టెల్ కూర్చోవలసిన చోట్లో 'మరియప్ప భట్టు' కూర్చున్నాడు.

## ముక్తాయింపు

ఈ సమీక్షా వ్యాసంలో తప్పులే ఎక్కువగా పేర్కోడం జరిగింది నిఘంటువులతో బాగా పరిచయం ఉన్నవారికి తప్పులు కన బడినంత స్పష్టంగా ఒప్పులు కనబడవు. కనబడిందల్లా ఒకటే ఒప్పు. ఆంధ్ర విశ్వ విద్యాలయ ముద్రణాలయం వారు పుస్తకాన్ని ఎంతో చక్కగా ముద్రించారు. ఆ సిబ్బంది, యజమానులు వారి విధ్యుక్త ధర్మాన్ని దీక్షతో నెరవేర్చేరు.

---

* తెలుగు వ్యుత్పత్తి కోశం ప్రథమ సంపుటం (అ – ఔ) ప్రధాన సంపాదకులు : డా. లకంసాని చక్రధరరావు, ఆంధ్ర విశ్వ కళాపరిషన్ముద్రణం. వెల. రు. 60.

*శ్రీ నిడుదవోలు వేంకటరావు*

# ప్రతిబింబాలు

## శ్రీ గడియారం శేషఫణి శర్మ

ఎక్కడో,
ఇన బింబం క్రుంకితే,
ఇక్కడ ఈ ప్రభాతాలు!

ఎక్కడో,
నీరధు లింకితే,
ఇక్కడ ఈ జలపాతాలు!

ఎక్కడో శూన్యగోళాల్లో
అగ్ని గుండాలు రగిలితే,
ఇక్కడ ఈ కాంతి కిరణాలు!

ఎక్కడో కొండ కోనల్లో
పూల గుండెలు పగిలితే,
ఇక్కడ ఈ మలయానిల ప్రసరణాలు!

ఇక్కడి ప్రతి వెలుగుకూ
ప్రతిరూపంగా,
ఎక్కడో చీకటి!

ఇక్కడి ప్రతి ఆనందానికీ
ప్రతిబింబంగా,
ఎక్కడో విషాదం!!



శ్రీ కె. యస్. చెలమ్

# విద్య - ఆర్థికాభివృద్ధి

"విద్యలేనివాడు వింత పశువు" అన్ననానుడిలో విద్యయొక్క గొప్పతనం, దాని అవసరం మనకు తెలుస్తుంది. అయితే, యీ నానుడి ఒకనాటి మాట. విద్య కేవలం మానవుని సాంఘికావసరాలకు, తన పరిసరాలను తెలుసుకునేందుకు, ముఖ్యంగా కళ, సాహిత్యం, సంగీతం మొదలగు విషయాలను ఆకళించుకునేందుకుగాను అవసరమేనని చాలా మంది ఒకప్పుడు భావించారు. ఆ భావనలో తప్పే మాత్రం లేదు. గాని, మానవ నాగరికత, విజ్ఞానం శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పెరిగినకొద్దీ మానవుని అవసరాలు పెరిగాయి. అవి ఉత్పత్తి చేసే పద్ధతులూ, అందుకుపయోగించే ఉత్పత్తికారకాలూ మారాయి. దానితో మానవుడు సంపాదించి పెంపొందించుకొన్న విద్య తాలూకా పరిధి కూడా విస్తృతమైంది. విద్య కేవలం మానవుని విజ్ఞాన తృష్ణను తీర్చే సాధనంగా మాత్రమే గాకుండా దాని మూలంగా సమాజం యొక్క సాంఘిక, ఆర్థికాభివృద్ధిని **కూడా** సాధించవచ్చుననే అభిప్రాయం చాలా మంది విద్యావేత్తలలో కలిగింది. అలాగే ఆర్థికశాస్త్రవేత్తలు **కూడా** విద్య ద్వారా కలిగే ఆర్థిక లాభాలను చాలాకాలం నుండి తమ గ్రంథాల్లో చర్చిస్తూ వచ్చారు. ఆర్థికశాస్త్ర పితామహుడైన ఆడమ్ స్మిత్ తన "వెల్త్ ఆఫ్ నేషన్స్" గ్రంథంలో విద్య విషయమై యిలా అంటాడు: తన శ్రమను, కాలాన్ని ధారపోసి చదువుకున్న వ్యక్తిని... ఖరీదైన ఒకయంత్రంతో పోల్చ వచ్చును... నైపుణ్యంగల ఒక శ్రామికుని వేతనాలకు, సాధారణ శ్రామికుని వేతనాలకుగల వ్యత్యాసం యీ సిద్ధాంతంపై ఆధారపడివున్నది." అంతేకాదు. ఒక దేశంలో లభించే మూలధనంలో ఒకభాగం ఆ దేశంలో నివసించే ప్రజల నైపుణ్యం, తెలివితేటలు **కూడా** కలసి వున్నవి అని పేర్కొన్నాడు. ఆడమ్ స్మిత్‌కు సుమారు వంద సంవత్సరాల తరువాత మార్షల్ విద్య యొక్క ఆర్థిక ప్రతిపత్తిని యిలా పేర్కొంటాడు: "విద్యపై ప్రభుత్వం లేక ప్రైవేట్ వనరులు వుపయోగించటానికి దాని వలన చేకూరే ప్రత్యక్ష లాభాలతో కొలవలేము... సంవత్సరాల తరబడి విద్యపై వెచ్చించే ధనంమూలంగా ప్రజలకు ఉన్నత విద్య నభ్యసించేందుకు అవకాశాలను కల్పించినట్లయితే దాని వలన ఒక న్యూటన్, డార్విన్, షేక్స్పియర్ లేక బెతోవెన్ తయారైతే దాని మూల్యం చెల్లించినట్లే." మార్క్స్ కూడా తన 'కేపిటల్' లో శ్రమ విభజనలో విద్యయొక్క అవసరాన్ని నొక్కి చెప్పాడు. అయితే పైన పేర్కొన్న ఏ ఆర్థిక శాస్త్రవేత్త **కూడా** విద్య మూలంగా సమాజానికి చేకూరే లాభం యింత అని యిదమిద్ధంగా కొలిచి చెప్పలేదు. విద్యను ఒక ఆర్థిక సాధనంగా మాత్రమే వారు పేర్కొన్నారు.

## ఆర్థిక లాభాలు :-

విద్య ద్వారా చేకూరే ఆర్థిక లాభాలపై చర్చ 1960 తరువాత మొదట అమెరికా**లో**ను తరువాత అన్ని దేశాలలోను ప్రారంభమయింది. ఐక్యరాజ్య సమితి, యునెస్కో, OECD మొదలగు అంతర్జాతీయ సంస్థలు విద్య మూలంగా చేకూరే ఆర్థిక లాభాలపై అంతర్జాతీయ స్థాయిలో గోష్ఠి కార్యక్రమాలు, సమావేశాలు నిర్వహించడమే గాకుండా యీ విషయమై కావలసినంత సాహిత్యాన్ని తయారుచేశారు విద్య మూలంగా సమాజానికి చేకూరే యీ క్రింది ఆర్థిక లాభాలను దృష్టిలో పెట్టుకొని ఆర్థిక శాస్త్రవేత్తలు విద్యకు ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు. అవి :

(1) విద్య మనిషిని నాగరికునిగా తీర్చి దిద్ది తనను తాను తెలుసుకొని పరిసరాలను అర్థం చేసుకునేలా చేస్తుంది.

(2) విద్యా విధానం మానవుని విజ్ఞానాభివృద్ధి**లో** ఒక **భా**గం. విజ్ఞానం పెంపొందుతున్న కొద్దీ విద్యయొక్క పరిధి పెరుగుతుంది. శాస్త్ర, సాంకేతిక విద్య**తో** క్రొత్త క్రొత్త ఉత్పత్తి పద్ధతులు, పరికరాలు, యంత్రాలు కనుగొనబడతాయి. దానితో ఆర్థికాభివృద్ధి సుస్థిరమవుతుంది.

(3) ఆర్థిక లాభాలతో బాటు సాంఘిక రాజకీయమైన సౌలభ్యాలు **కూడా** చేకూరుతావి. ఉదాహరణకు చదువుకున్న ఒక ఓటరు ఓటువిలువ తెలుసుకుంటాడు. సక్రమమైన ప్రభుత్వాన్ని ఎన్నుకుంటాడు. అలాగే చదువుకున్న వ్యక్తి తాను సమాజంలో సభ్యుణ్నని, ఒక సంస్కృతికి వారసుణ్నని తెలుసుకుంటాడు. వస్తువూర్పిడి, మార్కెట్ ధరల **గూ**ర్చి చదువుకున్న వ్యక్తికి తెలిసినంతగా చదువులేని వానికి తెలియదు గదా !

(4) విద్యమూలంగా చే**కూ**రే ఆర్థికలాభాల్లో వినియోగపు లాభాలు, పెట్టుబడి లాభాలు చాలా ముఖ్య మయినవి. వినియోగపు లాభాలనగా చదువుకున్న వ్యక్తి తన అక్షరాస్యత**తో** కొన్ని గ్రంథాలు చదివి ఆనందిస్తాడు. దినపత్రికలు, ప్రకటనలు చూసి తన విజ్ఞానాన్ని పెంపొందించుకొని, వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుకుంటాడు. ఇవి విద్య మూలంగా చేకూరే వినియోగపు లాభాలు. విద్యాహీనుడు సాధించలేనివి.

విద్య కూడా మనిషిపై వెచ్చించే ఒక పెట్టుబడి లాంటిది. ఒకడు 500 రూపాయలు వెచ్చించి మెట్రిక్ పరీక్ష పాసయితే అంతకు మించిన లాభాలను జీతం రూపంలో తన జీవితాంతం పొందగలుగుతున్నాడు. అనగా తనపై పెట్టుబడి పెట్టిన 500 రూపాయలకు బదులుగా కొన్ని వేల రూపాయలు అతను జీతం రూపంలో లాభం పొందుతున్నాడని అర్థం.

(5) ఒక వ్యక్తి తన విజ్ఞానాన్ని, నైపుణ్యతను కొన్ని ప్రత్యేకమైన ప్రావీణ్యతలను విద్యద్వారా సంపాదించుకోవచ్చును. వాటిని ఉద్యోగ మార్కెట్‌లో అమ్ముకొని వేతనం రూపంలో ఆర్థిక లాభాలను పొందవచ్చును.

(6) విద్యమూలంగా సంపాదించే నైపుణ్యంతో ఒక శ్రామికుని ఉత్పాదక శక్తి పెరుగుతుంది

(7) విద్యాధికులైన ప్రజలున్న ఒక సమాజం ఉన్నత ప్రమాణాలను అన్ని రంగాలలోనూ సాధించగలదు.

పైనుదహరించిన కొన్ని ఆర్థిక లాభాలమూలంగా విద్యను ఆర్థిక శాస్త్రవేత్తలు వివిధ కోణాలనుండి యీనాడు విశ్లేషణ జరుపుతున్నారు.

ఇంతవరకు మనం కొన్నివిద్యత్తాలుకా అధిక లాభాలను తెలుసుకున్నాం. అసలు విద్యకు, ఆర్థికాభివృద్ధికి సంబంధం ఏమిటి?విద్య ఆర్థికాభివృద్ధిలో ఏ విధంగా భాగం పంచుకుంటున్నది? అన్న ప్రశ్నలకు కూడా సమాధానం చెప్పుకోవాలి. ఆర్థికశాస్త్రంలో ఆర్థికాభివృద్ధి అన్న ప్రత్యేక విభాగాన్ని రెండవ ప్రపంచయుద్ధానంతరం బాగా పెంపొందించారు. ముఖ్యంగా అభివృద్ధిచెందుతున్న దేశాల ఆర్థికస్థితి గతులు మెరుగుపరచటానికి చేయవలసిన కార్యక్రమాల గూర్చి పరిశోధనలు సాగించారు. ఆ విధంగా కావలసినంత సాహిత్యాన్ని కూడా ఉత్పత్తి చేశారు. ఆర్థికాభివృద్ధికి కావలసిన కారకాలను, వ్యూహాలను పరిశీలిస్తున్న సమయంలో విద్య కూడా వారికి ఒక సాధనంగా కన్పించింది. అయితే, 1960 తరువాత మాత్రమే ఆర్థికాభివృద్ధిపై విద్య తాలూకా ప్రభావాన్ని పరిశీలించే సాహిత్యం ఎక్కువగా వెలువడింది. అనేక దేశాలకు చెందిన ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తలు విద్యను ఆర్థికకోణంనుండి పరిశీలించటం మొదలుపెట్టారు. వీరిలో ముఖ్యులు షుల్ట్జ, డెనిసన్, బెకర్, సోలో, బ్లాగ్, ఏండర్‌సన్, బౌమాన్, చౌదరి, గోయెల్, పంచముఖి, హరిసన్, మేయర్స్, మొదలగువారున్నారు

ఆర్థికాభివృద్ధి విషయమై సరియైన నిర్వచనం ఐక రాజ్య సమితి నిపుణుల సంఘంవారు తయారుచేశారు. వారి "అభివృద్ధి చెందని" దేశం నిర్వచనాన్ని చాలామంది వాడుతున్నారు. "అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, పశ్చిమ ఐరోపాదేశాల నిఖర తలసరి ఆదాయం కంటే తక్కువ తలసరి ఆదాయం ఉన్నదేశాలు అభివృద్ధి చెందని" దేశాలుగా నిర్ణయించారు. అనగా ఆర్థికాభివృద్ధిని కొలవాలంటే కావలసిన ముఖ్యసాధనం తలసరి ఆదాయం లేక స్థూల జాతీయాదాయం అని తెలుస్తోంది. జాతీయాదాయం ఏ విధంగా పెరుగుతోంది, ఏయే కారకాల సాధనాలమూలంగా యీ జాతీయాదాయం పెరుగుతుందో తెలుసుకుంటే జాతీయాదాయంలో ఆయా కారకాలయొక్క భాగం ఏ మాత్రమో మనం కొలవటానికి ఆర్థిక విశ్లేషణ పద్ధతులున్నాయి. ఉదాహరణకు సహసంబంధం (correlation) తీసుకుందాం. ఈ పద్ధతినుపయోగించి రెండు చలాంకాల(variables) మధ్యనున్న సంబంధాన్ని కనుక్కోవచ్చును. విద్యపై ప్రభుత్వం వెచ్చించే ఖర్చుకు జాతీయాదాయానికి గల సంబంధాన్ని తెలుసుకోవచ్చును. అయితే యీ పద్ధతి రెండు చలాంకాల మధ్యనున్న సంబంధం మాత్రమే తెలుపుతుంది. ఈ పద్ధతి ద్వారా ఒక చలాంకం మార్పు ఒక నిర్ణీత పరిమాణంలో వున్నపుడు రెండో చలాంకం మార్పు ఏ పరిమాణంలో వుంటుందో తెలియజేయదు. అందుకు ప్రతిగమనము (Regression) అనే పద్ధతిని ఉపయోగిస్తున్నారు ఇవన్ని గణాంకపద్ధతులు. వీటిని ఆర్థికవిశ్లేషణలో ఉపయోగించుటచేత మిగతా విజ్ఞాన శాస్త్రములవలే ఆర్థిక శాస్త్రములో కూడా పరిశోధనలు, ప్రయోగాలుచేసి ఫలితాలను యిదమిద్ధంగా కొలిచి చెప్పేందుకు వీలు కల్పించబడినది. ఈ పద్ధతులను, యింకా క్లిష్టమైన అర్థమితి (Econometrics) పద్ధతులను ఉపయోగించి ఆర్థికాభివృద్ధిలో విద్య యొక్క భాగము ఎంతఉన్నదో అర్థశాస్త్రవేత్తలు కొలిచి చెప్పగలుగుతున్నారు.

## ఆర్థికాభివృద్ధిలో విద్య పాత్రను తెలిపే విధానాలు :

ఆర్థికాభివృద్ధిని పెంపొందించుటలో విద్య నిర్వహించే పాత్రను తెలుసుకునేందుకు సాధారణంగా యీ క్రింది విధానాలను ఉపయోగించి తెలుసుకుంటున్నారు.

(1) సహసంబంధ పద్ధతి (correlation approach) వివిధ తరగతులలో చేరిన విద్యార్థుల సంఖ్యకు జాతీయాదాయానికి లేక ఒక నిర్ణీత కాలంలో విద్యపై చేసిన వ్యయానికి జాతీయాదాయానికి గల సహ సంబంధాన్ని కనుగోవటం ద్వారా విద్యయొక్క ప్రభావాన్ని కనుక్కోవటం.

(2) శేషపద్ధతి (Residual approach) స్థూలజాతీయ ఆదాయాన్ని వృద్ధిచేస్తున్న గుర్తింపగల కారకాల (identifiable factors)యొక్క భాగం మొదట తెలుసుకొని మిగిలిన శేషం విద్య తదితర సంబంధమైన కారకాలమూలంగా వచ్చినదని చెప్పటం.

(3) అంతర్గత ప్రతిఫలరేటు పద్ధతి (Internal rate of Return) విద్యపై వెచ్చించిన డబ్బుతో వచ్చిన ప్రతిఫలంతో విద్య తాలూకా ఆర్థిక లాభాలను చెప్పటం

(4) సగటు ఉత్పత్తి ఫలసిద్ధాంతం (Aggregate production Function) ఉత్పత్తి ఫలసిద్ధాంతముద్వారా విద్యను

ఒక కారకంగా వుపయోగించి కాబ్‌డగ్లస్ ఉత్పత్తి ఫలసిద్ధాంతంతో విద్యయొక్క ఫలమెంతో తెలుసుకోవటం.

ఇప్పుడీ విధానాలను విపులంగా తెలుసుకోవాలి.

మొదటి పద్ధతిని వుపయోగించేందుకు ముఖ్యంగా కావలసినవి, వివిధ తరగతులలో చేరిన విద్యార్థులసంఖ్య, జాతీయాదాయం. అయితే కొంతమంది ఆర్థిక శాస్త్రవేత్తలు విద్యార్థులనే గాకుండా విద్యకు సంబంధించిన అనేక సూచికలను తీసుకొని యీ సహ సంబంధాన్ని కనుగొన్నారు. ఈ విధానంలో పరిశోధనలు చేసిన వారిలో స్వెన్నిల్‌సన్, ఎడ్డింగ్, హార్బిసన్ మరియు మేయర్స్, బౌమెన్, ఏండర్‌సన్ ముఖ్యులు. బౌమెన్, ఏండర్‌సన్‌లు ప్రపంచంలోని 83 దేశాల్లో వున్న అక్షరాస్యతను విద్యాసూచికగా తీసుకొని విద్యకు, ఆర్థికాభివృద్ధికి గల సంబంధాన్ని కనుగొన్నారు. ఈ 83 దేశాలను ఆయా దేశాల విద్యాభివృద్ధి, సగటు జాతీయాదాయాన్ని బట్టి మూడు గ్రూపులుగా విభజించారు. మొదటి గ్రూపులో 40 శాతం అక్షరాస్యత 300 డాలర్ల సగటు జాతీయాదాయం వున్న దేశాలను తీసుకున్నారు. ఈ గ్రూప్‌లో 32 దేశాలున్నవి. రెండవ గ్రూప్‌లో 30 నుండి 70 శాతం అక్షరాస్యత 500 డాలర్ల సగటు జాతీయాదాయంవున్న దేశాలను తీసుకున్నారు. ఇందులో 27 దేశాలున్నవి. మూడవ గ్రూప్‌లో 70 శాతం పైబడిన అక్షరాస్యత 500 డాలర్లు పైబడిన సగటు జాతీయాదాయం వున్న దేశాలను తీసుకున్నారు. ఇందులో 24 దేశాలున్నవి.

మొదటి గ్రూప్‌లోవున్న దేశాలు బీదదేశాలు, మూడవ గ్రూప్‌లోవున్నవి ధనిక దేశాలు, రెండవ గ్రూప్‌లో వున్నవి మధ్య తరగతికి చెందిన దేశాలు. ఈ పరిశోధనద్వారా తెలిసిన ముఖ్య విషయం—ఒక దేశం 300 డాలర్ల సగటు జాతీయాదాయాన్ని సంపాదించాలంటె 40 శాతం అక్షరాస్యత, 500 డాలర్ల సగటు జాతీయాదాయం కావాలంటె 90 శాతం అక్షరాస్యత అవసరం. దీనికి కొంచెం భిన్నమైన పరిశోధన హార్బిసన్ మరియు మేయర్స్ అన్న ఆర్థిక శాస్త్రవేత్తలు 75 దేశాల ఆర్థిక, విద్యారంగాలను పరిశీలించి, పరిశోధన చేశారు. వీరు విద్యావిషయమై ఏడు సూచికలను తయారుచేసి, ఆ సూచికలకు ఆర్థికాభివృద్ధికి గల సహ సంబంధాన్ని తెలుసుకున్నారు. ఈ ఏడు సూచికలను కలిపి వేరే మానవ వనరుల సూచిక (human resource index)ను రూపొందించి దానితో ప్రపంచ దేశాలను 4 గ్రూపులుగా విభజించారు. వీరి పరిశోధనా ఫలితాలు యీ క్రిందివిధంగా వున్నవి :

మొదటిస్థాయి (అభివృద్ధి చెందని) దేశాలు : 17, వీటిమా॥ వ॥ సూచిక 0.3 నుండి 7.55 మధ్య వున్నది.

రెండవ (కొంతవరకు అభివృద్ధి చెందిన) స్థాయిదేశాలు : 21, వీటి మా॥ వ॥ సూచిక 10.7 నుండి 31 2 మధ్య నున్నది.

మూడవ (ఒకమాదిరి అభివృద్ధి చెందిన) స్థాయి దేశాలు : 21, వీటి మా॥ వ॥ సూచిక 33.0 నుండి 73.8 మధ్య నున్నది.

నాల్గవ (బాగా అభివృద్ధి చెందిన) స్థాయి దేశాలు : 16, వీటి మా॥ వ॥ సూచిక 77.0నుండి 261.3 మధ్యనున్నది.

వీరి పరిశోధనలో వెల్లడైన ముఖ్యాంశం—సంకీర్ణ మానవ వనరుల సూచికకు సగటు జాతీయాదానికి మధ్యను 0.888 సహ సంబంధం వున్నది. అలాగే స॥ మా॥ వ సూచికకు జాతీయాదాయంలో ప్రభుత్వం విద్యపై వెచ్చించే శాతానికి మధ్య 0. 098 సహ సంబంధం వున్నట్లు అంచనా వేయడమైనది.ఈ ఫలితాలు, విద్యకు ఆర్థికాభివృద్ధికి గల సంబంధం వున్నదని తెలియజేయుచున్నవి.

రెండవ విధానంలో మొదట గుర్తింపగల కారకాలను, వాటి విలువలను కనుగోవాలి. తరువాత యీ కారకాలు ఒక్కొక్కటి జాతీయాదాయంలో ఎంతెంత భాగాన్ని తయారు చేస్తున్నాయో తెలుసుకోవాలి. అప్పుడు, జాతీయాదాయంలో ఒక్కొక్క కారకం తాలూకా భాగంపోగా కొంత శేషం మిగులుతుంది. ఆ శేషం యే కారకం తాలూకా భాగం అన్న ప్రశ్న వస్తుంది. దానినే విద్య, నిపుణత లాంటి విద్యకు సంబంధించిన జ్ఞానేంద్రియాలు గుర్తించలేని కారకాలయొక్క భాగంగా పేర్కొనవచ్చును. ఉదాహరణకు, ఒక దేశంలో శ్రమ, మూల ధనం కలసి ఒక రూపాయి విలువగల ఉత్పత్తిని చేశాయి అని అనుకుందాం. అందులో శ్రమ 40 పైసల విలువను, మూలధనం 30 పైసల విలువను ఉత్పత్తి చేశాయని అంచనా వేస్తే యింకా 30 పైసల విలువగల ఉత్పత్తిని యే కారకం తయారు చేసింది అనే ప్రశ్న వస్తుంది. ఈ శేషం విద్య, దానికి సంబంధించిన కారకాల భాగంగా పేర్కొనవచ్చు. ఈ విధమైన పరిశోధనలు చాలా దేశాల్లో జరిగాయి. వీటిలో డెనిసన్, కొరియా, సోలోల పరిశోధనలు చెప్పుకోదగ్గవి. ప్రొఫెసర్ డెనిసన్ 1929–1957 సంవత్సరాల మధ్య అమెరికాలో నికర జాతీయాదాయం 2. 93 శాతం పెరిగినట్లు అంచనా వేశారు. అలాగే ఉత్పత్తి కారకాలు కూడా 2 శాతం చొప్పున పెరిగినట్లు కనుగొన్నారు. అందులో శ్రమ భాగం 1. 57 శాతం, మూలధనం భాగం 0. 43 శాతం. భూమిలో పెరుగుదల లేదని కనుగొన్నారు. ఇందులో విద్య మూలంగా శ్రమ తాలుకా ఉత్పాదక శక్తి పెరిగి మొత్తం జాతీయాదాయంలో సుమారు నాలుగింట ఒక వంతు ఆదాయం (0 67 శాతం) పెరిగినట్లు వెల్లడించారు. అనగా 2. 93 శాతం జాతీయాదాయంలో విద్య లేక విజ్ఞానంలో వచ్చిన మార్పు 0.67 శాతం ఉత్పత్తికి బాధ్యత వహిస్తున్నట్లు తెలియుచున్నది.

మూడవ పద్ధతిలో విద్యపై వెచ్చించే డబ్బు మూలంగా వ్యక్తికిగాని, సమాజానికిగాని వచ్చే అంతర్గత ప్రతిఫల రేటును కను

క్కోవాలి. సాధారణ భాషలో చెప్పాలంటే విద్యపై పెట్టే పెట్టుబడిపై వచ్చిన లాభం రేటును కనుక్కోవటం. ఆర్థిక శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే, వర్తమాన వ్యయ విలువను భవిష్యత్‌లో వచ్చే అదనపు లాభాల వర్తమాన విలువలను సమానము చేసే డిస్కౌంట్ రేట్‌నే అంతర్గత ప్రతిఫల రేట్ అంటారు. ఒక వ్యక్తి తన విద్య, ఆరోగ్యంలపై వెచ్చించిన సొమ్ము మూలంగా ఆ వ్యక్తియొక్క ఉత్పాదక శక్తి పెరుగుతుంది. ఈ ఉత్పాదక శక్తి ఒక నాటితో ఆగిపోకుండా జీతం రూపంలో యింకా అనేక విధాలుగా అతని జీవితాంతం లాభాలను సమకూర్చి పెడతుంది. అనగా, ఒక వ్యక్తి కళాశాల చదువుతో జీవితాంతం సంపాదించిన ఆదాయానికి, వేరొక వ్యక్తి ఉన్నత పాఠశాల చదువుతో జీవితాంతం సంపాదించిన ఆదాయానికి వ్యత్యాసం వుంటుందని అర్థం. ఈ వ్యత్యాసానికి కారణం, కళాశాలలో చదివిన వ్యక్తి ఉన్నత పాఠశాలలో చదివిన వ్యక్తికంటె విద్యపై ఎక్కువ ఖర్చుచేసి సంపాదించిన నిపుణత, ఉత్పాదకశక్తి మూలంగా ఏర్పడింది. వివిధ రకాల విద్యలపై వ్యక్తులు చేసే వ్యయాలకు, ఆయా విద్యలతో వారు సంపాదిస్తున్న ఆదాయాల్లో వున్న మార్పులనుగ్రహించి, ఒక్కోరకం విద్యపై వచ్చిన అంతర్గత ప్రతిఫల రేట్‌ను ఆర్థిక శాస్త్రవేత్తలు అంచనా వేశారు ఈ రేట్‌నే ప్రైవేట్ రేట్‌గాను, సామాజిక రేట్‌గాను కూడా తెలియజేయవచ్చును. ప్రభుత్వం మరియు వ్యక్తులు విద్యపై చేస్తున్న వ్యయాన్ని తీసుకుంటే సామాజిక రేట్, వ్యక్తుల వ్యయాన్ని మాత్రమే తీసుకుంటే ప్రైవేట్ రేట్ వస్తుంది. ఇటువంటి పరిశోధనలను లీహేన్‌సన్, బ్లాగ్, హార్బెర్గర్, బెకర్ మొదలగు వారు చేశారు. ప్రొఫెసర్ లీహేన్‌సన్ 1949 గణాంకాలతో మూడురకాల విద్యపై వచ్చే అంతర్గత ప్రతిఫల రేట్‌ను అమెరికాలో కనుగొన్నారు. ఈయన పరిశోధనలో ప్రాథమిక విద్యపై 15 శాతం, ఉన్నత విద్యపై 11.4 శాతం, అత్యున్నత విద్యపై 10.2 శాతం అంతర్గత ప్రతిఫలరేట్ వున్నట్లు తెలియజేశారు. ఈ ఫలితాల మూలంగా, ప్రాథమిక విద్యపై వెచ్చించే డబ్బుకు వచ్చే ప్రతిఫలం, మిగతా విద్యల కంటె ఎక్కువ అనితెలుస్తూంది. మనదేశంలో బ్లాగ్, మరికొంత మంది ఆర్థిక శాస్త్రవేత్తలు జరిపిన పరిశోధనలో మెట్రిక్ చదివిన వ్యక్తి కంటె డిగ్రి వున్న వ్యక్తి 60 శాతం ఎక్కువగాను ఇంజనీరింగ్ డిగ్రీ వున్న వ్యక్తి డిగ్రీవున్న వ్యక్తికంటె రెండింతలు ఎక్కువగాను ఆదాయం సంపాదిస్తున్నట్లు వెల్లడించారు. అయితే హార్బెర్గర్ అనే అతను మనదేశంలో జరిపిన వేరొక పరిశోధనలో విద్యపై వెచ్చించిన దానికంటె యంత్రాలు మిగతా మానవేతర మూలధనంపై వచ్చిన లాభం రేటు ఎక్కువ అని వెల్లడించారు. అయితే యీ పరిశోధనలన్నీ ఒక విషయాన్ని మాత్రం తెలియ జేస్తున్నాయి. విద్యపై వెచ్చించే డబ్బు మూలంగా ఒకవ్యక్తి యొక్క ఉత్పాదక శక్తి పెరగడమే గాకుండా ఆదాయం కూడా పెరుగుతుందని విశదమవుతూంది. అందుచేతనే తమ పిల్లల చదువు ఖర్చుతో కూడుకున్న దైనప్పటికీ తల్లిదండ్రులు అప్పుచేసైనా చదివిస్తున్నారు. ఇటువంటి పరిశోధనలు ప్రపంచం అన్ని దేశాలలోనూ నిర్వహించబడ్డాయి. ఒక్కొక్క దేశంలో విద్యయొక్క ఉత్పాదకశక్తి ఏ విధంగావున్నదో సరిపోల్చి చూసుకునేందుకు యీ క్రింది పట్టికలో కొన్ని దేశాలలో విద్యపై వచ్చే అంతర్గత ప్రతిఫల రేట్లను యివ్వడమైనది.

| | | ప్రైవేట్ రేట్ | | | సామాజిక రేట్ | | |
|---|---|---|---|---|---|---|---|
| దేశం | అంచనా వేయబడిన సంవత్సరము | ప్రాథమిక విద్య | ఉన్నత విద్య | అత్యున్నత విద్య | ప్రాథమిక విద్య | ఉన్నత విద్య | అత్యున్నత విద్య |
| అమెరికా | 1959 | 17.8 | 14.0 | 9.7 | 155 1 | 19.5 | 13.6 |
| కెనడా | 1961 | — | 11.7 | 14.0 | — | 16.3 | 19.7 |
| మెక్సికో | 1963 | 25.0 | 17.0 | 23.0 | 32.0 | 23.0 | 29.0 |
| ఇంగ్లాండ్ | 1966 | — | 3.6 | 8.2 | — | 6.2 | 12.0 |
| డెన్‌మార్క్ | 1964 | — | — | 7.8 | — | — | 10.0 |
| జర్మనీ | 1964 | — | — | — | — | — | 4.6 |
| ఇండియా | 1960 | 20·2 | 16.8 | 12.7 | 24.7 | 19.2 | 14.3 |
| జపాన్ | 1961 | — | 5.0 | 6.0 | — | 6.0 | 9.0 |
| నార్వే | 1966 | — | 7.2 | 7.5 | — | 7.4 | 7.7 |
| మలేసియా | 1967 | 9.3 | 12.3 | 10.7 | — | — | — |
| నైజీరియా | 1966 | 23.0 | 12.8 | 17.0 | 30.0 | 14.0 | 34.0 |
| ఉగండా | 1965 | 66.0 | 28.6 | 12.0 | — | — | — |

గమనిక :— డేష్ వున్నవాటికి అంచనా వేయలేదు అని అర్థం.

నాల్గవ విధానం ఉపయోగించాలంటె కొంచెం అర్థమిత్తి గణితశాస్త్రం, సాంకేతికశాస్త్ర పరిజ్ఞానం అవసరముంటుంది. ఈ పద్ధతిని వాడిన వారిలో ముఖ్యులు ఆక్రస్ట్, సోలోలు. ఆక్రస్ట్ నార్వే దేశానికి సంబంధించిన ఆర్థిక పరిస్థితులను పరిశీలించి ఆ దేశంలో ఉత్పత్తి, మూలధనంల నిష్పత్తి బాగా పెరుగుట చేతను పెట్టుబడి ఆదాయాల నిష్పత్తిలో ఎంతో మార్పు వచ్చి నప్పటికీ అభివృద్ధి రేట్‌లో మార్పు రాకపోవటం గమనించి, ఆర్థికాభివృద్ధిలో మూలధనంయొక్క పాత్ర తక్కువగా వున్నదని అంచనా వేయడమైనది. అందుచేతనే శ్రమకు, వ్యవస్థాపనకు ఆర్థికాభివృద్ధి విధానంలో ఎక్కువ ప్రాధాన్యత యివ్వటం జరిగింది. ఈయన కాబ్‌డగ్లస్ ఉత్పత్తి ఫలసిద్ధాంతాన్ని నార్వే గణాంకల కుపయోగించి ఫలితాలను కనుగొన్నారు. ఈ పరిశోధనలో తెలిసిన విషయం, 1948–55 ప్రాంతాలమధ్య నార్వేలో వచ్చిన 3.39 శాతం వృద్ధిరేట్‌లో 1.81 శాతం వృద్ధిరేట్ వ్యవస్థాపన మూలంగా వచ్చినదని తేలింది. సోలో కూడా యిటువంటి సూత్రాన్నే వుపయోగించి అదేవిధమైన ఫలితాలను కనుగొన్నారు. ఈ పద్ధతిలో విద్య, సాంకేతిక పరిజ్ఞానం వంటివి కూడా ఉత్పత్తి పద్ధతిలోని కారకాలుగా పేర్కొని పరిశోధనలు జరుపుటచేత యీ పద్ధతిని ఉత్పత్తి పద్ధతని పిలవబడుతోంది.

పైన పేర్కొన్న యీ నాలుగు విధానాలే గాకుండా మానవ శక్తి ప్రణాళిక పద్ధతి అనే వేరే విధానంకూడా యీ విశ్లేషణలో ఉపయోగిస్తున్నారు. అయితే ఆ పద్ధతి కొంచెం భిన్నమగుటచేత యిక్కడ పేర్కొనలేదు ఇంకా చాలా పద్ధతులను ఆర్థిక శాస్త్రవేత్తలు కనుగొని ఆర్థికాభివృద్ధిలో విద్యయొక్క పాత్రను కనుగొంటూనే వున్నారు.

ఒకదేశంయొక్క ఆర్థికాభివృద్ధిలో విద్యతాలూకా ప్రభావం చాలా గొప్పదని పైన పేర్కొన్న పరిశోధనలు తెలియజేస్తున్నాయి అసలు మానవుడు యింత ఉన్నతిని, ప్రజ్ఞాపాటవాలను, విజ్ఞానాన్ని, సౌఖ్యాన్ని సంపాదించుకోవటానికి ముఖ్యసాధనం మానవ మేధస్సు, దానిని క్రమబద్ధం చేసి ఒకతీరులో ఉపయోగించిన విద్యేనని చెప్పక తప్పదు. ఈ విషయాన్ని మేధావులు ఏనాడో గ్రహించి సామాజాభివృద్ధికి విద్య అవసరం అని నొక్కి వక్కాణించారు. అయితే విద్య తాలూకా ఆర్థిక ప్రభావం యీ శతాబ్దంలోనే గుర్తించటం జరిగింది. ఇంకా కొన్ని దేశాల్లో విద్యావిషయమై తగినంత శ్రద్ధ కన్పించటంలేదు విద్యను కేవలం సాంఘికావసరంగా మాత్రమే గుర్తిస్తున్నారు. అందుచేతనే ఆ దేశాలు బడుగుదేశాలుగా మిగిలిపోతున్నవి. ఒక దేశం సాంఘికంగా, ఆర్థికంగా పటిష్టవంతమై సుఖసౌఖ్యాలతో విలసిల్లాలంటే తమ వనరుల్లో కొంతభాగం తప్పకుండా విద్యకోసం వినియోగించాలి. ఈ సత్యాన్ని గ్రహించనంత కాలం ఆ దేశాలు అభివృద్ధిని సాధించలేవు.

## ఆధార గ్రంథాలు


1. The political Economy of Education by John Vaizey.
2. Education and the Economics of human capital Ed by Wykstra.
3. Economic aspects of higher education O E CD.
4. Education, manpower and Economic growth by Harbison and Myers.
5. Investment in Education Ed. by T.W.Schultz.
6. The causes of graduate unemployment in India by Blaug et. al.




# సిరులు పొంగిన జీవగడ్డ...

నదుల ఆట కట్టింది.

ఈనాడు అవి పల్లం ప్రాంతాలమీదుగా పొంగి ప్రవహించి సముద్రం పాలు కావటం లేదు. విచ్చల విడిగా పారే నదీ జలాలకి అడ్డుకట్టవేసి, ఆ నీళ్లచేత రేపటి సమాజ నిర్మాణానికి చాకిరీ చెయించుకుంటున్నాడు నేటి మానవుడు.

నాగార్జున సాగర్ బహుళార్థ సాధక ప్రాజెక్టు భారతదేశానికే కలికి తురాయిగా వెలుగొందుతూంది. కృష్ణమీది యీ ప్రాజెక్టు ఇచ్చే విద్యుత్తు పుణ్యమా అని సామాన్యుడి గుండెల్లో ఆశాదీపాలు వెలుగుతున్నాయి ఆయకట్టు, కుడీ, ఎడమా కాలువ నీటివల్ల 21.54 లక్షల ఎకరాలు తడిసి, చేతికి అందివస్తూంది. ఇంకా లెక్కకు మిక్కిలిగా పంట కాలువలు తవ్వు తున్నారు దాదాపు 12.70 లక్షల ఎకరాలకు నీటి పారుదల వసతి యేర్పడింది.

1978 జూలై 10న భారత రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేసిన సాగర్ జలవిద్యుత్పథకం వల్ల 810 మెగావాట్ల ఉత్పాదక శక్తి ఖాయం. సమీప భవిష్యత్తులో ప్రారంభమయ్యే శ్రీశైలం హైడల్ ప్రాజెక్టువల్ల రాష్ట్రంలో స్థాపిత విద్యుదుత్పాదక శక్తి మరింత అధికమౌతుంది. గోదావరి నదిపై తెలంగాణా ప్రాంతానికి వరప్రసాదం వంటి పోచంపాడు ప్రాజెక్టు త్వరిత గతిని నిర్మాణంలో వుంది.

కృష్ణా గోదావరీ జీవనదులు మిట్ట పల్లాల్లో పంటకాలువలై ప్రవహించి బంజరు భూముల్లో బంగారం పండిస్తున్నాయి.

ఇది సిరులు పొంగిన జీవగడ్డ.

*సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు.*

28/78-79



# కలగూరగంప

## దసముహవహో

సేతుబంధము అను నామాంతరముగల 'దశముఖవధ' ప్రాకృత వాఙ్మయములో చక్కని కృతి. పదునైదు ఆశ్వాసముల రసవత్కావ్యము. ప్రవరసేన విరచితము. కాని ఇట్టి చిరంతన గ్రంథమును మూడు ముఖ్యవిషయములు పట్టి పీడించుచున్నవి. మొదటిది కర్త ఎవరు? రెండు ప్రక్షిప్తములపాలు ఎంత? మూడవది ఏ భాషలో వ్రాయబడినది?

దసముహవహో ప్రథమ ముద్రణ 1880లో శ్రీ గోల్డ్ ష్మిట్ అను జర్మనీ సంస్కృత విద్వాంసుడు స్ట్రాస్‌బర్గ్‌నందు ఎనిమిది వ్రాత ప్రతులను సేకరించి, తైపారువేసి, పరిష్కరణ ముద్రణగ వెలువరించినారు.

ద్వితీయ ముద్రణ బొంబాయిలో కాశీనాథ పరబ్, శివదత్త పండితుడు కలిసి కావ్యమాలా పరంపరలో రామదాస వ్యాఖ్య (సేతు ప్రదీపమ్)తో వెలువరించినది.

తృతీయ ముద్రణ ప్రఖ్యాత భారతీయ సంస్కృత విద్వాంసుడు, నేటికి సజీవుడు అగు ఆచార్య రాధాగోవింద బాసక్ 1958లో కలకత్తా సంస్కృత కళాశాల కావ్యమాలా పరంపరలో ఎనిమిదవ ప్రసూనము. అజ్ఞాత వ్యాఖ్యతో, విపుల భూమికతో ప్రచురించిరి. కాని పరిష్కరణ అంత తృప్తిగలేదు. ఎన్నియో అపపాఠములు నాకు పొడకట్టినవి. భాష కొంత కృతముగా కూడ ఉన్నది. సుమనోరమ్యము, ప్రాకృత కావ్యరత్నమునగు 'దసముహవహో' నకు సంస్కృత ముద్రణ అత్యంతావశ్యము. పరిష్కృత ముద్రణ లేనిది కావ్యవిమర్శనకు పూనుకొనుట మంచిదికాదు.

ఇక నామము. లోకములో దీనికి 'రావణవధ' అని వ్యాప్తి గాంచినది. తొలిముద్రణ కర్తలు అవిచార మూలముగ ఉంచిన నామమే వ్యాప్తి గాంచినది. ప్రవరసేనుడు తన కావ్యమునకు "దసముహవహో" అనియే పేరుపెట్టినాడు. ప్రతి ఆశ్వాస చివరి పద్యమున "అనురాగము" అను పదము ఉపయోగించినందున "అనురాగచిహ్నాము" అను నామాంతరము గలదు.

తం దిదస బంది మోక్ఖం
సమత్త తెల్లోక్క హియయ సల్లుద్ధరణం।
సుణుఅ అణురాగ ఇహ్నం
సీఆ దుక్ఖ క్ఖయం దసముహస్సవహం॥

అను అవతారికా పద్యమును జాగ్రత్తగ గమనించినచో కవి "దసముహవహో" అనియే తన కావ్యమునకు నామముంచినట్లు స్పష్టమగుచున్నదికదా! అంతేగాక కావ్యమున "దసముహ" పదమును ముప్పది నాలుగుసారులు ప్రయోగించాడు. 'దసాణణ' అని ఆఱుసారులు, 'దసవయణ' అని పదమూడు పర్యాయములు ఉపయోగించగ, 'రావణ' అని రెండుసార్లు మాత్రమే ప్రయోగించుట విమర్శకులు గమనించెదరని నా విశ్వాసము

కర్త ప్రవరసేనుడు. ఇతనిని గుర్తించుటలో విమర్శకులలో ఏకాభిప్రాయములేదు. కల్హణుడు రాజతరంగిణిలో ఇద్దఱు ప్రవరసేనులను పేర్కొనినాడు. (రాజతరంగిణి 3-౯౭, ౧౦౯) ఒకరు క్రీస్తుశకము 45 సం. ప్రాంతమునందును, ఇంకొకరు క్రీస్తుశకము 109 ప్రాంతమునందు జీవించియున్నారు. కొందరు విమర్శకులు వాకాటకరాజు రెండవ ప్రవరసేనుడు- కున్తలరాజు 'దసముహవహో' కర్తగ గుర్తించినారు. కాని ఈ గుర్తింపు స్పష్టముగ లేదు. కారణము శాసనకాలము నిశ్చితముగలేదు. భాషా విషయముగ విచారించినచో క్రీస్తు శకారంభ కాలమున వ్రాయబడినదిగా తోచుచున్నది.

భోజమహారాజు శృంగార ప్రకాశములో పదునొకండవ ప్రకాశములో "నను చ ఆశ్వాసక బన్ధేషు తత్సమాప్తావపి న ఛన్దో భేద ఉపలభ్యతే। తథాపి మారీచవధ, హరివిజయ, సేతుబంధేషు ఆదితః సమాప్తియ పర్యన్తం ఏకమేవ ఛన్దోభవతి। గీతకాని తు వ్యాసకష్టవత్ కైరపి విదగ్ధ మానిభి ఉపక్షిప్తా నీతితద్విదో భాషన్తే"

అర్యరాజ ప్రణీత మారీచవధ, సర్వసేనకృత హరి విజయమ్, ప్రవరసేన విరచిత దసముహవహ (సేతుబంధం) కావ్యము లందు ఒకే ఛన్దస్సు ఆమూలాగ్రము వాడబడినట్లు స్పష్టమగుచున్నది. మన దురదృష్టమువలన మారీచవధ, హరివిజయములు లభించుటలేదు. లభించుచున్న దసముహవహోలో భిన్నఛందస్సులు ముద్రిత ప్రతులలో కనబడుచున్నవి. వీటియందు యమకములున్నవి ఇట్టి యమక రచన ప్రక్షిప్తములని వాటి వాలకములే చెప్పుచున్నవి. నా దృష్టికి అందినంతవరకు ప్రక్షిప్తములగు పద్యములను ఉదహరించుచున్నాను. (శ్రీ రాధాగోవిన్ద బాసక్ ప్రతిననుసరించి సంఖ్యలను ఇచ్చుచున్నాను.)

I ఆ. ౫౯

II ఆ. ౨౩, ౨౪, ౨౭, 30, 33,

III ఆ. ౪౬, ౪౭, ౪౮, ౪౯,

IV ఆ. లేవు.

V ఆ. లేవు.

VI ఆ. ౪౮, ౫౩, ౫౬, ౫౯, ౬౨, ౬౫, ౬౮

VII ఆ ౪౦, ౪౩, ౪౫, ౪౭, ౪౯, ౫౦, ౫౯, ౬౦ ౬౧, ౬౨.

VIII ఆ. ౬౨, ౬౪, ౬౬.

IX ఆ. ౧౮, ౩౯, ౪౦, ౪౨, ౪౩, ౪౫, ౪౬, ౪౭, ౪౮
౪౯, ౫౧ ౬౧, ౬౭

X ఆ. లేవు.

XI ఆ. లేవు.

XII ఆ. లేవు.

XIII ఆ. లేవు.

XIV ఆ. లేవు.

XV ఆ. ౯౪.

(స్థూలదృష్టితో వింగడించుట జరిగినది. వ్రాత ప్రతు లనుసరించి, సూక్ష్మదృష్టితో పరిశీలించినచో మఱికొన్ని పద్యములు లభించును.)

దసముహవహో భాష శౌరసేనీ దండి మహారాష్ట్ర ప్రాకృతములో సేతుబంధము వ్రాయబడినది అని చెప్పినది భ్రాంతి యాభిమానమని ఆచార్య మనోమోహనఘోష్‌గారు చక్కగా నిరూ పించియున్నారు. భరతుడు ప్రాకృతములు ప్రధానముగ ఏడు అని నాడు. అవి. 1. మాగధి, 2. అవంతి, 3. ప్రాచ్య, 4. శౌరసేని 5. అర్థమాగధీ 6. బాహ్లీకీ 7. దాక్షిణాత్య విభాషలలోనైతము భరతుడు మహారాష్ట్ర ప్రాకృతము పేరులేదు.

చండకృత 'ప్రాకృత లక్షణము'నందును, వాల్మీకి కృత 'ప్రాకృత సూత్రము'ల లోను మహారాష్ట్రనామము కానరాదు

సర్వభాషా చతుర బిరుదాంచితుడగు రాజశేఖరుడు, కలియుగ సర్వజ్ఞుడగు హేమచంద్రాచార్యుడు మహారాష్ట్ర ప్రాకృతమును పేర్కొనకుండుట విమర్శకులు గమనించవలెను. వరరుచి ప్రాకృత ప్రకాశమున 'శేషం మహారాష్ట్రీవత్' (12 32) అనుచో ఎట్టి మహారాష్ట్రమో మనకు బోధపడదు కారణము ప్రాకృత ప్రకాశ ములో ఇతర్రతా మహారాష్ట్ర గుఱించిలేదు. అంతేగాక, సూక్తి కోశము అనదగిన గాథాకోశం (గాథాసప్తశతి), శృంగార మధు కోశము అనదగిన పాదలిప్తాచార్యుని 'తరంగలోల' ఉండగ, ఆచార్య దండి సేతుబంధమునే పేర్కొనుట వింతగ ఉన్నది.

దసముహవహో భాషను జాగ్రత్తగ పరిశీలించినచో శౌర సేనీ భాషలో వ్రాయబడినట్లు స్పష్టమగును. అత్త (ఆత్మ), హు (ఖలు), ఖ్ఖోభం (క్షోభం), మత్త (మాత్ర), మయంక (మృగాఙ్క), తణ్హా (తృష్ణ), తువం (త్వం), అమయ (అమృత) మున్నగు పదములు "దసముహవహో" చిరంతనత్వమునకు చొక్కపు మచ్చులు

దసముహవహో కావ్యమునకు ఇప్పటివరకు పదివ్యాఖ్యాన ములు బయలుపడినవి. భవిష్యదన్వేషణలో మఱికొన్ని లభించ వచ్చును.

శ్రీనివాసకవి 'సేతుదర్పణము', లోకనాథ, సాహసాంక, హర్ష పాల కృతవ్యాఖ్యలు, కులనాథుని 'దసముహవహ వివరణ', రామ దాసుని 'ప్రదీపము', మల్లభట్టుని 'సేతుచన్ద్రికా', కర్తృరహిత 'సేతుతత్త్వ చన్ద్రికా' — ముఖ్యమైనవి.

**శ్రీ ఇ. సాయిబాబా**

# శ్రీనాథుని శయ్యా సౌభాగ్యం

శయ్య అన్నది శబ్దధర్మం. మొదటిసారిగా శయ్యను గూర్చి ప్రత్యేకంగా చెప్పినవాడు విద్యానాథుడు. అతడు "యా పదానాం పరాన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" అని తన "ప్రతాపరుద్ర యశో భూషణం"లో శయ్యను నిర్వచించాడు. అంటే "వినిమయా సహిష్ణువులైన పదముల నిరతిశయమైన మైత్రి శయ్య" అని అతని అభిప్రాయం. శయ్య అంటే 'అన్యోన్యపదమైత్రి' అని సాహిత్యరత్నాకర కర్త వారణాసి ధర్మసూరి, 'వినిమయాసహమైన పదముల పరస్పరమైత్రి' అని చమత్కార చంద్రికా కారుడు విశ్వేశ్వరుడు, 'పద పరివృత్తి వైముఖ్యం' అని ఏకావళీ వ్యాఖ్యాత మల్లినాథసూరి, 'పదానుగుణ్య స్వరూపమైత్రి' అని అలంకార చింతామణి కర్త అజితసేనుడు భావించారు. దీనిని బట్టి శబ్ద మైత్రినే శయ్య లేదా శైలి అనవచ్చునని స్పష్టమవుతోంది.

ప్రసిద్ధ పద ప్రాచుర్యం, శ్రవణపేయమైన శబ్ద సంఘటనం, భావ పరిపుష్టమైన నిరర్గళధార చక్కని శయ్యకు సజీవ లక్షణాలు. ఈ లక్షణాలన్నీ శ్రీనాథుని కవితా శయ్యకు సంపూర్ణంగా సంక్రమించాయి. శబ్ద సౌందర్య దిద్పక్షుడైన శ్రీనాథుని శయ్యలో ప్రౌఢత్వం, మార్దవం, మాధుర్యం మూడూ త్రివేణిలాగా సంగమించాయి. అందువల్లనే అతని కవితా స్రవంతి పెద్దన తిమ్మనాది ప్రబంధ కవివరేణ్యులకు మార్గదర్శకం, అను కరణీయం అయింది. శ్రీనాథుని శయ్యా సౌభాగ్యానికి ఈ క్రింది పద్యాలు మేలుబంతులు.

> "హేమంతావధి సంప్రబోధగురువుల్; హృజ్జాతతేజోస్నిధా
> య్యామంత్రాక్షరముల్; పటీరగిరి వన్యామందవా
> తూలముల్;
> వేమారుం గలశీతనూభవవధూవేణీ భరాంతః ప్రసూ
> నామోదగ్రహియాళువుల్ పొలసె దక్షారామమధ్యంబునన్."
> (భీమేశ్వర పురాణం 5. 95)

దక్షవాటికలోని వసంత వర్ణనం ఇది. మలయ పర్వతం మీది మంచి గంధపు తోటలనుంచి మాటి మాటికి ప్రసరిస్తున్న మందమారుతాలు ఇందులో మనోహరంగా వర్ణింపబడ్డాయి. వానిని హేమంతం యొక్క అంతాన్ని ప్రబోధించే గురువులుగా, మదనానలాన్ని మండించే మంత్రాక్షరాలుగా సంభావించటం మరింత బాగుంది. అవి అగస్త్యుని అర్ధాంగలక్ష్మి అయిన లోపాముద్ర కేశ పాశంలోని పుష్పాల పరిమళాలను పరిగ్రహించే స్వభావం గల వనటంలో వచోవైచిత్రి తొంగిచూచింది.

ఈ పద్యంలో ఏ పదాన్ని మార్చి మరొక పదాన్ని వేసినా శబ్ద సౌందర్యం దెబ్బతింటోంది.

> "చెవికిం గెళివతంసకోత్పలదళ శ్రీలై కపోలంబులన్
> నవకాలాగురు పత్త్రరేఖలయి. మేనం గమ్మకస్తూరియై
> ధవళాంభోరుహనేత్ర పైం బొలసె నుద్యల్లీల సీమంతపుం
> సవనాజ్యాహుతి హోమసంప్రభవ చంచద్ధూప
> ధూమచ్ఛటల్."

(శివరాత్రి మాహాత్మ్యం 2.58)

చూలాలైన ఇల్లాలు సుశీలను ప్రేమతో చూచుకొంటున్న యజ్ఞదత్తామాత్యుడు ఉత్తమ పుత్రప్రాప్తికోసం సీమంతం, పుంసవనం మొదలైన శాస్త్రోక్త సంస్కారాలు జరిపించి జయాది హోమాలు చేయించే సందర్భంలోని పద్యమిది. హోమధూమ సమూహాలు ఆమె చెవికి నల్లకలువరేకులై, చెక్కిళ్లకు మకరికా పత్త్రరేఖలై, శరీరానికి కమ్మని కస్తూరి పూతలై వెల్లివిరి సాయటనంతో సుశీల యొక్క కోమల శృంగారమూర్తి స్ఫురించు తోంది.

ఈ పద్యం కూడా పద పరివృత్తిని ఏ మాత్రం సహింప లేదు. శయ్యను గూర్చి ప్రాచ్య వైమర్శిక దృక్పథం పైవిధంగా ఉంటే పాశ్చాత్య పండితుల దృష్టి మరొక విధంగా ఉంది. వారు చెప్పిన అంశాలు కొన్ని శ్రీనాథుని కవితా శయ్యకు కూడా సమన్వయింపవచ్చు.

సముచితశబ్దాలను సముచితస్థలాలలో సమకూర్చటం శయ్య—(Style may be defined proper words in proper places.) అంటాడు స్విఫ్ట్ మహాశయుడు. శ్రీనాథుని కవిత్వంలో ఈ లక్షణం అధికంగా కన్పిస్తుంది.

ఉదా : "తాను దాండవ విద్యా ప్రధాన గురుఁడు
లలన పార్వతి సుకుమార లాస్యజనని."

కాశీఖండంలోని ఈ పద్యపంక్తులలో శివునికి వేసిన "తాండవ విద్యా ప్రధాన గురుడు" అన్న విశేషణం ఆయన గంభీర ప్రవృత్తికి, పార్వతికి వేసిన "సుకుమార లాస్యజనని" అన్న విశేషణం ఆమె మృదు ప్రవృత్తికి నిరూపకంగా ఉన్నాయి. "లలన" అన్న పద ప్రయోగం పార్వతి లలిత విలాసానికి సంకేతం. మరొక ఉదాహరణం

> "కలహంసి ! రారాదె కదలి నాతోఁగూడి
> నీ వేల వత్తమ్మ నెమ్మినుండి
> కదళికా కాంతార ! కదలిరా నముఁగూడి
> నీ వేల వత్తమ్మ నెమ్మినుండి
> శ్రీ విశాలక్షి ! విచ్చేయు నాతోఁగూడి
> నీ వేల వత్తమ్మ నెమ్మినుండి
> నా తోడఁగూడి యంతర్గేహ ! యేతెమ్ము
> నీ వేల వత్తమ్మ నెమ్మినుండి
> రండు నముఁగూడి యో పరివ్రాట్టులార !
> వత్సలతగల్గి మీరేల వత్తురయ్య !
> పరమ నిర్భాగ్యుఁడైన నా వజ్జఁబట్టి
> కటకటా ! సౌఖ్య జలరాశి కాశిఁబాసి"

(కాశీఖండం 2. 140)

విశ్వనాధుని సేవిస్తూ చిరకాలం కాశీనగరంలో గడపిన అగస్త్య మహర్షి దైవకార్యంకోసం కాశీని విడిచి వెళ్లవలసిన సందర్భంలోనిది ఈ పద్యం. అగస్త్యుడు కాశీ వియోగాన్ని భరింపలేక పరిపరి విధాల పరిదేవనం చేస్తూ కాశీనగరంలోని తనకు సుపరిచితమైన పక్షులను, వనాలను, దైవతాలను, గర్భాలయాలను, పరివ్రాజకులను పేరు పేరున తనతో రమ్మని ఆహ్వానించాడు. ఆ ఆహ్వాన నిరూపణం పై పద్య రూపంలో శ్రీనాథ లేఖినీ పరిష్కారాన్ని అందుకొంది. అగస్త్యునికి ఆయా వస్తువులతో ఉన్న అనుబంధానికి, వాటిని విడువ వలసి వచ్చిన విషాదానికి అనుగుణమైన శబ్ద విన్యాసంతో సమాసగుంఫనం కానీ, శబ్దచిత్రం కానీ లేకుండా ఇక్కడ రచన సాగింది.

రచయిత శయ్య అతని మనస్సుకు ప్రతిబింబం అనీ, వైశద్య శయ్య రచించాలంటే అతడు పరమనిర్మలమైన చిత్తవృత్తిని కలిగి ఉండాలనీ, ప్రగల్భ శయ్య రచించాలంటే అతడు దివ్యమైన లక్షణాన్ని కలిగి ఉండాలనీ (Generally speaking, an author's style is a faithful copy of his mind. If you would write a lucid style, let there first be light in your own mind, and if you would write a grand style, you ought to have a grand character) గెటే పండితుడు అభిప్రాయపడ్డాడు. ఇది ఎంతో యుక్తియుక్తమైన లక్షణం. శ్రీనాథుని శయ్యలో ఎన్నోచోట్ల ఆతని చిత్తవృత్తినే పరికింపవచ్చు.

ఉదా : "భీమనాధునిఁ ద్రిభువన స్వామినాధుఁ
బార్వతీనాధు శశ్వత్కృపాసనాధు
దక్షవాటాధినాధు వేదత్రయైక
నాధు నానాథుఁ గొలుతు శ్రీనాధు నాధు."

(భీమేశ్వర పురాణం 3. 82)

మహా మాహేశ్వరుడైన అగస్త్యుడు భీమేశ్వరుని ప్రభావం వ్యాసమునీంద్రునికి వెల్లడించే సందర్భమిది. ఈ పద్యంలో "శ్రీనాధు నాధు" అనటంలో విశేషార్థం గోచరిస్తోంది. "శ్రీ మహావిష్ణువుకు ఆరాధ్యుడు" అనే అర్థమే కాక "శ్రీ నాధుడనైన నాకు మహాప్రభువు" అన్న అంతరార్థం కూడా ఈ పంక్తిలో ఉంది. ఇక్కడ "శ్రీనాధుని"లో శ్రీనాధుడు తనను తాను ఒదిగించుకొన్నాడు. ఇందులో అగస్త్యుని శివపారమ్యంతో పాటు శ్రీనాథ మహాకవి ఆత్మీయతా రూపమైన భక్తిభావం కూడా అభివ్యక్తమౌతోంది. ఇంతేకాక కాశీఖండంలోని అగస్త్యుని కాశీ వియోగ వేదనా వర్ణన సందర్భంలో కూడా ఆ సంతాపమంతా శ్రీనాధునిదేనేమో అని అన్పిస్తుంది.

శ్రీనాథునిలో వైశద్యశయ్య (Lucid Style), ప్రగల్భ శయ్య (Grand Style) రెండూ సమంగా కూడి ఉన్నాయి. శ్రీనాథుడన గానే చాలా మందికి సమాసాలు జ్ఞాపకం వస్తాయి. కాని ఎన్నో చోట్ల అతడు సందర్భోచితంగా వైశద్యశయ్యను ప్రదర్శించాడు. ఉదాహరణకు కాశీఖండంలోని గుణనిధ్యుపాఖ్యానం. ఈ చక్కని కథను చమత్కారవంతంగా ఎక్కడా సుదీర్ఘసమాసాలు ఒక్కటి కూడా లేకుండా నడిపించాడు శ్రీనాథుడు. యజ్ఞదత్తుడనే శ్రోత్రియ బ్రాహ్మణుని కుమారుడు గుణనిధి ధూర్తవర్తనుడై తుట్టతుదకు శివసాయుజ్యం అందుకొన్న కథ యిది. ఉదాహరణకు — నడివీధిలో ఒక జూదరి వ్రేలికున్న తన రత్నాంగుళీయ కాన్ని చూచి ఇంట్లో ఉన్న విలువైన వస్తువులన్నీ కుమారుడు తాకట్టు పెట్టి జూదమాడటంలో మునిగితేలుతున్నాడని తెలుసు కొన్న యజ్ఞదత్తుడు "లజ్జాక్రోధంబులు మనంబున ముప్పిరిగొన నర్ధముండితంబైన మూర్ధంబున నీర్కావిదోవతి నటిముటిఁ జుట్టుకొని యింటికేతెంచి మొగంబు గంటువెట్టుకొని" భార్యతో "సోమిదమ్మ! ఏమి సేయుచున్నదాన! విటు రమ్మ! నీ కొడుకెక్కడం బోయె? బోవుఁగాకేమి! వినుము —

"అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరముల్ లోచనా
పాంగప్రాంతములం దిగుర్ప నొక సయ్యాటంబుఁ గల్పించి నా
యంగుళ్యాభరణంబు పుచ్చుకొనవా? యా యుంగరం బిప్పుడే
శృంగారింపని చేతఁ బావకునకున్ జేయన్ హవిర్దానమున్"

అని ఖండితంగా పల్కినప్పటి రచనా విన్యాసం వైశద్య శయ్యగా పేర్కొనవచ్చు. ఆ సమయంలోని యజ్ఞదత్తుని కోపానికీ, బింకానికీ తగినట్లు ప్రాయాలంటే ఇక్కడ సమాసప్రాచుర్యం పనికిరాదు. ఈ ఘట్టంలో శ్రీనాథుని హృదయం స్పష్టంగా, స్ఫుటమితంగా, నిర్మలంగా మనకు గోచరిస్తుంది.

ఇక ప్రగల్భశయ్యకు కాశీఖండంలోని కాలభైరవా విర్భావాన్ని ఉదాహరించవచ్చు.

"ధమధమార్భటి సముడ్డమరు ఢక్కాధ్వని
పదిదిక్కులందును భ్రమరిపార
గళమూల నిర్గళత్కాల కూటచ్ఛవి
యర్కబింబంబు మాయంబుసేయ
ఫాలదృగ్భవసముద్భట శిఖాజాలంబు
లుదధుల నన్నింటి నుడకఁ బెట్టఁ
గుటిలపాటల జటాంకుర కుట్టనంబులు
జగిదండసీమ బెజ్జములు పుచ్చ
సంభ్రమమునొందె హరు నవష్టంభరభస
శుంభదవగాఢ రోషవిస్ఫురణ వలన
విశ్వసంహార సన్నాహ విషమ సుషమ
పరుష దుర్భైరవుండగు భైరవుండు."

తానే సర్వాధికుడనని విర్రవీగుతున్న బ్రహ్మ దురహం కారాన్ని సహింపని శంకరుని "నితాంత రోషసంగంభం" వల్ల భైరవుడు ఆవిర్భవించాడు. అతని ధమధ మార్భటితో కూడిన ఢక్కాధ్వనికి దశదిశలు బద్దలైనాయి. కంఠమూలంలోని కాల కూటకాంతి పటలికి మార్తాండబింబం మసకబారింది. ఫాలేక్షణ జ్వలనజ్వాలా మాలికలకు సముద్రాలు తుకతుక ఉడికిపోయాయి. పాటల జటాఘట్టనలకు బ్రహ్మాండం బీటలువారింది. పై పద్యం లోని సమాసకల్పనం, రూక్షాక్షరాలతో నిండిన గాఢ పదబంధం భైరవుని రౌద్ర స్వరూపానికి వన్నెలు దిద్దాయి.

గొప్ప రచయిత ఆత్మీయమైన, తిరుగులేనిదైన శయ్యను కలిగి ఉంటాడని, అది అతనిని అంత సులువుగా విస్మృతిపాలు చేయదని ( A great writer possesses so to speak, an individual and unchangeable style which does not permit him easily to preserve the anonymous ) ఓల్టేర్ విద్వాంసుని ఉద్దేశం. ఇది ప్రత్యక్షర సత్యమైన అభి భాషణం. ప్రపంచ మహాకవులైన వాల్మీకి వ్యాస కాళిదాసులలో ఆత్మీయమైన నిరాడంబర సుందర శయ్య ఆద్యంతం మూర్తీభ వించి ఉంది. అందువల్లనే వారు ఆనాటికి ఈనాటికి ఏనాటికి మహాకవులుగానే పరిగణింపదగిన వారైనారు. కవియొక్క వ్యక్తిత్వ ముద్రాభద్రమైన సాహిత్యం ఉత్తమ సాహిత్యమని, అతడు తన కావ్యంలో ప్రదర్శించే వివిధశైలీ విన్యాసాలు తత్స్వభావ నిరూప కాలని పెక్కుమంది పాశ్చాత్య పండితుల అభిప్రాయం. శ్రీనాథుని శయ్యకూడా ఆత్మీయమైంది, అనితరసాధ్యమైంది. కనుకనే అతడు మహాకవుల ప్రక్కన పంక్తిదీర్పగలిగాడు.

భావౌచిత్యం, శయ్యౌచిత్యం తరచుగా కలిసే ఉంటాయి— (propriety of thought and propriety of diction are commonly found together) అని మెకాలే పండితుడు భావిం చాడు. ఇందుకు క్రింది శ్రీనాథుని పద్యం ఉదాహరణీయం.

"కంటికి నిద్రవచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటక మిందునే? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబు గలయట్టి మనుష్యున కెన్నఁడేనియున్
గంటకుఁడైన శాత్రవుఁ డొకండు దనంతటివాఁడు గల్గినన్"
(కాశీఖండం 1.108)

వింధ్యగిరికి, మేరుగిరికి వైరం వచ్చింది. మేరువు దర్పాన్ని వింధ్యుడు నారదుని పలుకుల వలన విని తనలో తాను ఆత్మాభిమా నాన్ని సమర్థించుకోవటం ఇందులోని విషయం. వింధ్యగిరియొక్క వివిధభావ సంకలితమైన సంకులితస్వాంతాన్ని చిన్న చిన్న పదాలతో శ్రవణపేయంగా వ్యక్తీకరించాడు శ్రీనాథుడు. సందర్భానుగుణమైన శయ్య.

ఈ విధంగా గమనిస్తే ఆంధ్ర సాహిత్యంలో శ్రీనాథ కవి సార్వభౌముని కవితాశైలి ఎంత విలక్షణమైనదో, విన్యూత్న మైనదో, విశిష్టమైనదో సుస్పష్టమౌతుంది. ఆ శయ్యాసౌభాగ్యాన్ని తిలకించి పులకించటం వల్లనే "శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబుల గూడబలుకనేర్చు" అని పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

"శ్రీనాథుని పద్యప్రసిద్ధధారాశుద్ధి" అని రామ రాజ భూషణుడు, "బహుముఖప్రఖ్యాత మహితశయ్యాసనాథు శ్రీనాథు" అని చెన్నమ రాజు, "శయ్యాచమత్కార సంప్రదాయంబున నతను ప్రతిష్ఠచే నలరినాఁడు" అని తిరుపతి వేంకటకవులు, "శ్రీనాథు డాంధ్ర పద్యముల కబ్బురపు నిబ్బరపు నడక నేర్పినాఁడు" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, "శబ్దార్థముల రెంటికిని సమప్రాధాన్యమిచ్చిన శిల్పి శ్రీనాథుడే" అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, "ఇతని శైలి గంగాలహరిచందంబున ననర్గళధారాసముల్లసితంబై యనన్యాదృశప్రౌఢధాటీ చమత్కార గంభీరంబై కోమలశబ్దసముదయసుభగంబై నిరుపమానమై నివ్వటిల్లు" అని నాగపూడి కుప్పుసోమయ్యగారు, "తూగుటుయ్యేలలోఁ బరుండునప్పటి సుఖపారవశ్యము చదువరుల కీతని పద్యములఁ జదువునప్పుడనుభూతమగుచుండును" అని బండారు తమ్మయ్యగారు, "అనర్గళధారతో నుదాత్తగమనముతో రొమ్మువిరుచుకొని నడుచు నా పోకడ యనన్యకింకరము" అని గడియారం వేంకట శేషశాస్త్రిగారు, "ఈతని పద్యముల నడక మత్తేభయానమున కెనయై చదివినకొలది చవులూరించుచుండును" అని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, "శ్రీనాథుని శైలీ పరిశీలన మొక గ్రంథమునకు సామగ్రి" అని ఆచార్య యస్వీజోగారావు గారు శ్రీనాథ కవితా సరస్వతికి నీరాజనా లెత్తారు.

*డాక్టర్ జంధ్యాల జయకృష్ణ బాపూజీ*

# శ్రీ సర్దేశాయికి సమాధానం

'భారతి' ఆగష్టు 1978 సంచికలో శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మగారి వేమన సూక్తులు అనే పుస్తకాన్ని సమీక్షించాను. ఆ గ్రంథంలోని "సాహిత్యంలో సామాన్యుడు" అనే వ్యాసాన్ని గూర్చి కొన్ని వాక్యాలు వ్రాశాను. అందులో గురజాడ గురించిన నా విమర్శ చదివి శ్రీ సర్దేశాయి తిరుమలరావు గారు ఆవేశం పొంది కన్యాశుల్కంలో అసభ్యత ఉన్నదా? ('భారతి' నవంబరు 1978) అని ప్రశ్నిస్తూ "కన్యాశుల్కంలో అసభ్యత ఎక్కడుంది" అని ముగించారు. అందులో "కన్యాశుల్కం వర్ల్డ్ డ్రామాకోవకి చేరుతుంది" మొదలైన పాతమాట లెన్నోవున్నాయి.

"ఇప్పుడెవరైనా కన్యాశుల్కం యధాతథంగా ప్రదర్శిస్తే సామాన్యజనం కూడా అందులోని బూతులను చూచి తుపుక్కున ఉమ్మేస్తారు!" అని నేను వ్రాసిన వాక్యం వారికెంత ఆవేశం తెప్పించిందంటే నేనసలు కన్యాశుల్కం చదవలేదని తేల్చేశారు! కన్యాశుల్కం గొప్పతనాన్ని చెప్పడానికి మృచ్ఛకటికాన్ని తక్కువ చేశారు శ్రీ సర్దేశాయి! ("కన్యాశుల్కంలో ఉండే అగాధత, క్రాంత దృష్టి మృచ్ఛకటికంలో ఎక్కడిదీ?" అని వారు ప్రశ్నించారు!)

కన్యాశుల్కాన్ని చదవకుండానే అందులో బూతులున్నాయని నేను చెప్పినట్లు శ్రీ సర్దేశాయిగారు భ్రాంతి పడ్డారు. ఆ నాటకం ప్రారంభంలోనే ఈ విషయం సుస్పష్టమవుతూ ఉండటం వలన ఇప్పుడు నా పని సులభమవుతూంది. ప్రథమాంకం, రెండో రంగం చూద్దాం. రామప్పంతులు మధురవాణి గదిలో ఉన్నాడు. సల్లాపాలు సాగుతున్నాయి. గిరీశం వస్తాడు రామప్పంతులు అక్కడే ఉన్న మంచం కిందకి దూరతాడు. గిరీశం మధురవాణితో కబుర్లు మొదలు పెడతాడు. ఇంతలో పూటకూళ్లమ్మ తలుపు తడుతుంది. గిరీశం కూడా మంచం కిందికి దూరతాడు. అక్కడ మరో మనిషుండటంచూచి "దొంగలంజ సరసుణ్ణి దాచిందోయ్..." అనుకుంటాడు. తరువాత రామప్పంతులుతో 'నన్నడిగితే యిలాటి లంజల్ని ఇరవైమందిని మీకు కన్యాదానం చేతునే!' అంటాడు. గోడవైపు సర్దుకున్న తరువాత మళ్లీ "ఈ లంజని యస్సడూ నమ్మకండి. ఇలా ఇరవైమందిని దాచగల శక్తుంది దీనికి" అని గిరీశం అంటే రామప్పంతులు "రెండువందలు దొబ్బిందిరాబాబూ"! అంటాడు. ఇలా నడుస్తుందంటీ నాటకం' అశ్లీలపుకూతలకూ, ముద్దులకూ లెక్కలేదు. సంభోగం తప్ప అన్నీ చూడవచ్చు!

ఇప్పుడు మళ్లా ఒక్కసారి నా వాక్యాన్ని గమనించండి. "కన్యాశుల్కాన్ని యధాతథంగా ప్రదర్శిస్తే.." అని వ్రాశాను. యధాతథంగా ప్రదర్శిస్తే ఘోరంగా ఉంటుంది. మన చలన చిత్రాల్లో ముద్దు చూపవచ్చా లేదా అనే విషయంపై ఇప్పటికీ గుద్దులాట జరుగుతోంది ఎక్కడైనా ఒక్కచిన్న ముద్దు చూపిస్తే జనం విచిత్రంగా చెప్పుకోవడం వింటున్నాం మరి కన్యాశుల్క నాటకంలో ఎన్నో ముద్దులున్నాయే! జనం 'లంజ' మొదలైన మాటల్నీ, ముద్దులు మొదలైన చేష్టల్నీ రంగస్థలంపై చూస్తే చెప్పులు విసురుతారనడంలో సందేహం లేదు.

బూతులూ, కౌగిలింతలూ, ముద్దులూ — వీటిలోంచి సంఘ చిత్రణ, సంఘ సంస్కరణ, నాటక కళ, ఉదాత్త హాస్యం, గంభీర భావం లాగుతారు కాబోలు విమర్శకులు! ఏదీ, తెలుగుదేశపు రంగ స్థలంమీద సామాన్య ప్రేక్షకుల యెదట ఆడదీ మగాడూ కౌగిలించుకొని ముద్దు పెట్టుకోమనండి చూద్దాం! "ఇది మహా సొగసైన సీను అనీ, సభ్యతాయుతమనీ, నేటి సంఘాన్ని చక్కగా ప్రతిబింబిస్తోందనీ, మహాకవి మాత్రమే ఇలావ్రాయగలడనీ, ప్రపంచ అగ్రశ్రేణి నాటకాల్లో ఇది ఒకటనీ" ఎవరైనా అంటారేమో చూద్దాం' ఇది తిరణాలలో బండిపై ఎక్కి తైతక్కలాడే రికార్డు డాన్సు సీను కంటే ఏ మాత్రం తక్కువ గాదు!

ఇలాంటి ఛండాలపు ఘట్టాలూ, మాటలూ ఉన్న నాటకంలో "ఏలాటి వల్గరిజమ్ లేని స్వచ్ఛంగా వుండే కన్యాశుల్కంలో లేని అసభ్యత ఉందంటున్నారే!" అని శ్రీ సర్దేశాయి గారు ఆశ్చర్యపడటం చూచి నేను ఆశ్చర్యపడ్డాను. అయినా వారు నన్నన్నట్లుగా "కన్యాశుల్కం చదవలేదు" అని నేను వారిని అనను! ఇన్నాళ్లనుంచీ ఒక ప్రచారం సాగుతోంది. గురజాడ మహాకవి అనీ, కన్యాశుల్కం మహోత్తమ నాటకం అనీ ఆ ప్రచారం. ఆ ప్రచారాన్ని నమ్మి ఆ నాటకంలోని ఉత్తమ లక్షణాలను లాగి లాగి. ఊహించుకొని పరవశం చెందుతారు కొందరు. అదేం తప్పు కాదు. తావలచింది రంభ. కానీ ఆ నాటకాన్ని వేరే కోణం నుంచి

చూచి చెప్పినప్పుడు వెంటనే ఆ వాదాన్ని తునాతునకలు చేద్దామనే ప్రయత్నం చేసే బదులు అందరి సత్యాసత్యాలను తెలుసుకోవడం మంచిది

"మధురవాణి వేశ్యావృత్తి వదిలేసి ఎలా బతుకుతుందట?" అని శ్రీ సర్దేశాయి అనవసరంగా జాలి ప్రకటించారు. గాఢాభిమానం వలన కన్యాశుల్కంలోని అనేక సంభాషణలను వారు మరచి పోయినట్లున్నారు.

నాటకం చివర్లో సౌజన్యా రావంటాడు :

"...ఈ వృత్తి మానలేవూ ? స్థితి లోపమా ?"

మధు : "దైవానుగ్రహంవల్ల లోపం లేదు."

దీన్నిబట్టి మధురవాణికి స్థితిలోపం లేనిదని తెలుస్తోంది. వేశ్యావృత్తిని వదిలి వసంతసేన లాగా మంచివాణ్ణి ఒకణ్ణి ప్రేమించవచ్చు. కానీ చివరకు కూడా ఆమెలో శరీర సంబంధమైన తుచ్ఛవాంఛే తొంగి చూచింది. సౌజన్యారావును ముద్దు పెట్టుకోవాలని ప్రయత్నించింది. కానీ మహాకవి తమాయించుకొని ఆ ప్రయత్నాన్ని విరమింప చేశాడు. "చెడని వారిని చెడగొట్ట వద్దని మా తల్లి చెప్పింది" అని సౌజన్యారావుని ముద్దు పెట్టుకోనియలేదు. తల్లి చెప్పకపోతే మాత్రం అందుకు సిద్ధమే. మధురవాణి ఎవరిని వదిలింది గనుక ? ఆఖరికి 'శిష్యుడి'ని గూడా ముద్దు పెట్టుకుందాయె !

గురజాడ ఏ ఆదర్శంతోనూ నాటకాన్ని ఆరంభించలేదని అడుగడుగునా ఈ నాటకంలో స్పష్ట మవుతూ ఉంటుంది ఏదో పోనీలే సౌజన్యారావు పంతులు ఒక్కడూ ఈ నాటకంలో ముద్దుల్లేని బుద్ధిమంతుడు అనుకుందామా ! కుదరదే! "నీవు సొగసరివి. ముద్దు చేదని కాదు. వ్రతభంగం గదా అని దిగులు" అని తన వెధవ బుద్ధిని వెళ్లబెట్టుకున్నాడు. ఇక ఎవరు ఆదర్శ వ్యక్తులిందులో ? అంగరూ అందరే! ఎవర్నీ నమ్మగూడదు. ఈ ముద్దుల నాటకాన్ని యధాతధంగా ప్రదర్శిస్తే మూఢాభిమానులూ, తిరణాలల్లో బూతుల డాన్సులు చూచే మూర్ఖ జనులూ చూచి ప్రశంసిస్తారేమోగాని, సామాన్య సహృదయ ప్రేక్షకులు హర్షించ లేరు.

ఇది ప్రపంచ మహానాటకాల కోవలో చేరితే , ఇక పనికిరాని తెలుగు నాటకమేదో తీవ్రంగా వెతకవలసివుంది. మూఢాభిమానాలతో లోలోతులకు తవ్వుకుంటూ పోయి గాలిస్తే కన్యాశుల్కంలో "పైపై హాస్యం చమత్కారం వెనుక అగాధవిషాదం" శ్రీ సర్దేశాయిగారి లాటివారికి కనబడవచ్చు. కాని అంతలోతుగా చూడలేని సామాన్యులకు మాత్రమే నిస్సందేహంగా అందులోని పైపై చమత్కారమూ, అశ్లీలఘట్టాలే కనబడతాయి "అభిజ్ఞాన శాకుంతలం"లో శ్లోకాన్ని విని గ్రామీణ స్త్రీకూడా మెటికలు విరిచి శాపనార్థాం పెట్టే ప్రమాదం వుంది అని శ్రీ సర్దేశాయిగారన్నారు. ఆ శ్లోకాన్ని విన్న మాత్రానే గ్రామీణ స్త్రీ మెటికలు విరిచి నట్లయితే, కన్యశుల్కనాటకంలోని బూతు దృశ్యాలను చూచి నటుల్ని, దర్శకుణ్ణి, దొరికితే రచయితను ఆ స్త్రీయే చెప్పుతో కొట్టే ప్రమాదం ఉండవచ్చునేమో ! అయినా అభిజ్ఞాన శాకుంతలానికీ, కన్యాశుల్కానికీ పోలిక ఏమిటి ? ఇంద్రధనుస్సు వంకరే కుక్కతోకా వంకరే అన్నట్లుంటోందిది.

'మృచ్ఛకటికం'వంటి నాటకాన్ని రాయాలనే గురజాడ ప్రయత్నించాడు. కానీ అయ్యవార్ని చెయ్యబోతే కోతి అయినట్లు కన్యాశుల్కం తయారైంది చివరకు. 'మృచ్ఛకటికం'లో ఉండే హాస్యరీతినే గురజాడ అనుసరించాడు. కానీ ఆ హాస్యం వెనుకఉండే ఉదాత్తత, గాంభీర్యం గురజాడకు పట్టుపడలేదు. శకారుని అస్తవ్యస్త సంభాషణలనేగాక శర్విలకుని మాటలనుగూడా గురజాడ అనుకరించడానికి విఫలయత్నం చేశాడు. శర్విలకుడు దొంగతనానికి పోయినప్పుడు జంధ్యం గూర్చి అనుకొన్న మాటలనే కన్యాశుల్కంలో గిరీశం ప్రథమాంకంలో అనుకొంటాడు. కానీ 'మృచ్ఛకటికం'లో ఆ మాటల వెనుక ఎంతో కథఉంది. కన్యాశుల్కంలోని పేలవమైన పిచ్చి మాటలగా గోచరిస్తాయి. కొద్దిపాటి హాస్యాన్ని అందిస్తే అందించవచ్చు. శకారుడు భారత రామాయణ పాత్రలను అసందర్భంగా పోల్చి చెబుతుంటాడు. ఒకదాని బదులు ఒకటి అంటాడు. ప్రేక్షకులు వెంటనే ఆ తప్పుడు మాటలను అర్థం చేసుకోగలరు. కారణం ఆయా విషయాలన్నీ సామాన్యులక్కూడా అందుబాటులో ఉండటమే! అతడు పక్కా దుర్మార్గుడు. కానీ కవి మనోహరమైన హాస్యాన్ని ఆ పాత్రలో తొణికిసలాడేట్లు చేశాడు. మరిక్కడ గిరీశం? ఇతడు కూడా తప్పులో ఒప్పులో కలిపి కొడుతుంటాడు. గిరీశం హాస్యం అర్థం చేసుకోవడానికి ఇంగ్లీషుతో తప్పక పరిచయముండాలి. నాటి సమకాలీన సంఘ పరిస్థితులు క్షుణ్ణంగా తెలిసుండాలి. మన సామాన్య ప్రేక్షకుల్లో ఎంత మందికి ఇంగ్లీషు వచ్చు ? ఎంత మందికి చరిత్ర తెలుసు? వాళ్ళకు అర్థమయేది మహాకవి ప్రయోగించిన " లంజ " మొదలైన మాటలు, మహాకవిపై కృత్రిమ గౌరవాన్ని పెంచుకున్న మహాశయులు ఆ మాటలు భరించి మెచ్చుకోగలరేమోగాని, సామాన్య ప్రేక్షకులు మాత్రం ఈ బూతుల దృశ్యకావ్యాన్ని ప్రశంసింపలేరు . సామాన్యులకు సాహిత్యాన్ని చేరువ చేయాలని గురజాడ పయత్నించినట్లు విమర్శకులు చెబుతుంటారు. ఆ సామాన్యుని స్థానంలోఉండి కన్యాశుల్కం చదవండి తెలుస్తుంది. సామాన్యులకోసం కలంబట్టిన గురజాడకే ఎవరు సామాన్యులో తెలియలేదు ! గురజాడ తన పుస్తకాన్ని ఎవరికి అంకిత మిచ్చాడు ? గురజాడను అనవసరంగా ఆకాశానికి ఎత్తిన రాజకీయ పక్షంవాళ్ళు ఎప్పుడైనా ఆలోచించారా? ఊటీలో కూర్చుని సామాన్యులకోసం ఇంగ్లీషులో పీఠికలు రాశాడు "మహాకవి"! గురజాడ దృష్టిలో సామాన్యులు జమిందారులు, ఇంగ్లీషువాళ్ళేమో!

మన ప్రాచీన నాటకాలను, కావ్యాలను ప్రదర్శనయోగ్యం కాదనీ, అసభ్య వర్ణనలు ఉంటాయని విమర్శిస్తుంటారు. మరి ఆధునిక యుగంలో, ఆంగ్ల సాహిత్య పరిచయానంతరం మహాకవిగా స్తుతింపబడుతున్న గురజాడ రచించిన నాటకం ప్రదర్శనకు అయోగ్యంగా ఉన్నదెందుకని? అసభ్య సంభాషణలున్నా యెందుకని?

ప్రహసనం, భాణం, వీధి—వీటిల్లో ఇవితప్పవని సమర్థిస్తారు. కన్యాశుల్కంవంటి ఘోరదురాచార నిర్మూలనకు నడుంబిగించిన వ్యక్తి ఎంత చవకరకంగా నాటకాన్ని తీర్చిదిద్దాడు! అది చదివినవాళ్లకు అందలి సమస్యలపై దృష్టినిలిచేబదులు, హాస్యోక్తులు, వేశ్యావృత్తి రీతులు, గిరీశం స్పీచ్‌లపై మనస్సు నిలుస్తుంది. "ప్రాచీనతలోని మూఢత్వాన్ని వదలగొట్టాలని ప్రయత్నించే 'అభ్యుదయవాది' గురజాడ, మన ప్రాచీన ప్రక్రియలైన ప్రహసనం, వీధి, భాణంలలో ఉండే అశ్లీలతత్వాన్నే తన నాటకంలో ఉపయోగించుకున్నాడన్న మాట! ఇంకేం! గురజాడకు మన ప్రాచీన సాహిత్య ప్రక్రియల్లో నచ్చినవి అశ్లీలాలకు తావున్నవేనన్నమాట!" అని ఎవరైనాఅనవచ్చు. కానీ నేనలా అనను. ఇలా అంటాను. "గురజాడకు భారతీయ సంస్కృతి అర్థం కాలేదు"

శ్రీ పులిచెర్ల సాంబశివరావు.

## "భావ కవిత్వం" - కీ. శే. స్వామి శివశంకరుల అభిప్రాయం

శ్రీ రాయప్రోలు, వేదుల వంటి పెద్దలను అడిగినట్టే స్వామి శివ శంకరులను కూడ 'భావ' కవిత్వ ప్రారంభం గురించి, ఆ పేరు పుట్టు పూర్వోత్తరాల గురించి నేనొక మారు అడిగాను. నా వద్దనున్న "కవితా చలం" అనే పుస్తకాన్ని ఆయన చదువుకునేందుకు తీసుకుని, దాని మార్జిన్‌లో ఎన్నో తమ అభిప్రాయాలను రాయడమేగాక, విడిగా ఒక కాగితం మీద నా ప్రశ్నకు సమాధానంగా యిలా రాశారు (సంవత్సరం గుర్తు లేదు):

"భావకవి" అనే పదము క్రి.శ 9వ శతాబ్దిలో రాజశేఖర కవి తన కావ్య మీమాంసలో వాడినాడు.

రాయప్రోలు సుబ్బారావుగారు తమ "తృణకంకణ పీఠికలో" భావ కవిత్వ... అని వాడినారు (1913).

1914 లో గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు ఆంధ్ర పత్రికలో భావ కవిత్వము అని స్పష్టముగా వాడినారు. గిడుగు సీతాపతిగారు అంతకు ముందే ఆ పదము వాడాననీ, సర్వోత్తమరావు గారికి సూచించాననీ నాతో చెప్పినారు ఒకప్పుడు.

భావకవి అనే ఇంటి పేరుకల పెద్ద మనిషి నాకు 1930 ప్రాంతాలలో కనబడి మాటాడినాడు.

రాయప్రోలు సుబ్బారావుగారు భావకవిని అనుకొనేవారని జ్ఞాపకము. బసవరాజు అప్పారావుగారు "నేను భావకవి సమ్రాట్టును" అనేవారు.

"మేము ఎవ్వరమూ భావ కవులము అని ఎన్నడూ అనుకోలేదు; ఎవరైనా మీరు భావ కవులా? అంటే, కాము"అనే వాళ్లము.

శ్రీ శివరామశాస్త్రిగారు వ్రాసినది నాకు ఏమీ జ్ఞాపకము లేదు. ఆలంకారిక మత ప్రకారము ఎంకి పాటలనుగాని, ఆధునిక ఖండ కృతులను గాని సమర్థించవచ్చును. వామనాచార్యుడు చెప్పిన అనిబద్ధ కావ్యశ్రేణిలోకి ఇవి చేరుతవి. జగన్నాథ పండిత రాజు చెప్పిన లక్షణములో చమత్కారిత్వానికి ఇవి లక్ష్యాలుగా కొంతవరకు సరిపోతవి.

"ఎంకి పాటలు కాని, గేయ సందోహాలు కాని, అమరు శతకము, రసమంజరి, గీత గోవిందము వంటివి అని కొద్దిలో చెప్పవచ్చు."

శ్రీ కె. వి. రమణారెడ్డి

## అమ్మ, అప్ప

అక్టోబరు 1978 'భారతి'లో శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద గారి "ద్రావిడ భాషలలో మాతృ, పితృ వాచకాలు" అను వ్యాసము చదివి, అందులేని కొన్ని విశేషములను తెలుపుచున్నాను.

### అమ్మ

"అమ్మా" అను పదము సంస్కృత పదము "మా"నుండి వచ్చియుండవచ్చును. తమిళము "అరవ" భాష. పదములు "అ" శబ్దముతో మొదలు పెట్టు భాష. "రంగము" "అరంగము" అగును. మూలద్రావిడ భాషలో కూడా ఇతర భాషల నుండి వచ్చిన పదములకు "అ" తగిలింపబడియుండును. సంస్కృతపు "మా", "అమా" అయి యుండవచ్చునని నా యూహ. "అమా" 'అమ్మా' అయి నాల్గు ద్రావిడ భాషలలోనికి వచ్చినది పార్వతి అను అర్థమిచ్చు "అంబ" "అమ్మ" అగునని ఒప్పుకొనినప్పుడు, లక్ష్మి అను అర్థమిచ్చు "మా" "అమ్మా" అగుటకు ఒప్పుకొనుటకేమి యభ్యంతరము? కనునది పార్వతి, చదువు చెప్పునది భారతి అయినను పోషించునది "మా" యే కదా. పెంచిన అమ్మా ప్రేమ మిగితా వాని కంటె గొప్ప. ఈ దృష్టిలో కూడ "అమ్మా" పదము "మా" నుండి వచ్చినట్లు సమర్థనీయము.

### అప్ప – అబ్బ

అమ్మ అప్ప శబ్దముల వ్యుత్పత్తి వ్రాయుచు బ్రహ్మానంద "కేవలం ద్రావిడ రూపాలుగా నిరూపించబడటానికి ప్రయత్నించిన ఈ రూపాలు ప్రాకృతంలోనూ, ఇతర ఇండో యూరోపియన్ భాషల్లోనూ కనిపించడం ఎంతో ఆసక్తిని రేకెత్తించే విషయం" అనినారు. ఇండో యూరోపియను భాషలలోనే కాక సెమెటిక్ భాషలలో నమా "అప్ప" వంటి ఒక పదము తండ్రి అనే అర్థముతో నున్నది. ఆ పదము "అబ్బ". చూడుడు: బైబిలు క్రొత్త నిబంధన లోని ఈ క్రింది వాక్యములు:

(i) And he said Abba, Father (St. Mark, 14, 36)
(ii) We cry, Abba, Father (Romans 8, 15)
(iii) Crying, Abba Father (Galatians 4, 6)

ఇచట Abba (అబ్బ) అనిన అరామైక్‌భాష (ఏసుక్రీస్తు మాట్లాడిన ఒకానొక సెమెటిక్ భాష) లో తండ్రి అని అర్థము. అరాబిక్

భాషలోనూ ఈ పదము కద్దు. పై మూడు సందర్భములలోననూ, భగవంతుని తండ్రిగా బోధించి "అబ్బ" అను పదమును తండ్రికి పర్యాయ పదముగ వాడినారు.

తెలుగులో "అబ్బ"ను పితృ పరముగనే వాడుదురు. కాని అందులో తూష్ణీం భావ ముండదు.

"వాడి అబ్బ సొమ్ము ఏం పోయింది' లో వలె. భద్రాచల రామదాసు కీర్తనలలో శ్రీరాముడు సైతము నిర్లక్ష్యముగా ఈ పదము తోడనే ఉపాలంభింపబడినాడు.

అమ్మ అప్ప అను పదములు కేవలము ద్రావిడ భాషా పదము లని చెప్ప వీలులేదు.

**శ్రీ సర్దేశాయి తిరుమలరావు**

# "కృతజ్ఞతా ప్రకటనం శూన్యం"

పై శీర్షికతో శ్రీ దినకర్‌గారు నా వ్యాసమును గూర్చి వ్రాసిన యభిప్రాయ మసంగతమేకాక కుదృష్టితో కూడినదై వారి యజ్ఞతను చాటుచున్నది. తిరుపతి వేంకట కవులకు శ్రీ నరకంఠీరవ శాస్త్రులుగారు తర్క గురువులనుట కాధారమేమి? అటువంటి జనశ్రుతి చిత్తూరు జిల్లా ప్రాంతములోగాని, శ్రీ న. శాస్త్రిగారి శిష్య, ప్రశిష్య, బంధువర్గమువలన గాని తెలియకున్నది. అంతేకాక శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తమ "కథలు—గాథలు" (మొదటి భాగము, పేజి 412) అను గ్రంథములో "గురుపరంపర" అను శీర్షికయందు తమకు చదువు నేర్పిన గురువులనందరిని స్మరించిరి. అందులో శ్రీ న. శాస్త్రిగారి పేరు చేర్చబడలేదు. అట్లైనచో తమకు తర్కశాస్త్రమును నేర్పిన గురువులను విస్మరించునంతటి కృతఘ్నులా శ్రీ చెళ్లపిళ్లవారు? (చేమర్తి శోభనాద్రిశాస్త్రులు చెళ్లపిళ్లవారికి తర్కగురువులట). లేక శ్రీ న. శాస్త్రిగారిని గురువుగ గుర్తించుట శ్రీ చెళ్లపిళ్లవారి కవమానముగ తోచినదా? కావున తిరుపతి వేంకటకవులకు శ్రీ న. శాస్త్రిగారు తర్కగురువులను విషయమును పత్రికా ముఖమున సప్రమాణముగ బుజువు చేయవలసినదిగ దినకర్‌గారికి నా మనవి. పరిశోధకుడెన్నడును ఆధార రహితములు, అసంగతములునయిన జనశ్రుతులను, పుక్కిటి పురాణములను నమ్మడుకదా!

శ్రీ నరకంఠీరవ శాస్త్రిగారి రచనల గూర్చి నే జేయు పరిశోధన కుపకరించు విషయములను, గ్రంథములను అందజేయమని నేను పత్రికా ముఖమున కోరగా, నాకు ముగ్గురు మాత్రమే బదులు వ్రాసిరి. బహుశః వారిలో నొకరు శ్రీ దినకర్‌గారు. వీరు శ్రీ న. శాస్త్రిగారి "స్తుతిరత్నములు", నవరత్నమాల"ను వ్రాసి పంపిరి. వెంటనే వారికి నా కృతజ్ఞత ప్రకటించుకొంటిని. శ్రీ న. శాస్త్రిగారి పాండిత్య ప్రకర్ష యీ స్తుతి రత్నములమీద నాధార పడలేదు. అంతేకాక శ్రీ న. శాస్త్రిగారు చదువుకొని, యుద్యోగము చేసిన తిరుపతి సంస్కృత కళాశాలకు నే నధ్యక్షుడగుటచేత శ్రీ న. శాస్త్రిగారి గురించి పెక్కు విషయములు తెలుసుకొనుటకు వీలైనది. శ్రీ న. శాస్త్రిగారితో సాక్షాత్ పరిచయము కలవారు, మరియు వారి మేనల్లుడయిన బ్రహ్మశ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారివలనను, శ్రీ న. శాస్త్రిగారి పౌత్రుల వలనను, వారి ప్రశిష్యుల వలనను పెక్కు నూతన విషయములను తెలుసుకొని ఇతః పూర్వ మలభ్యమైన గ్రంథములను సంపాదించితిని కాన వారందరికిని కృతజ్ఞతను సమర్పించితిని గాని, సర్వజన లభ్యమైన శ్రీ న. శాస్త్రిగారి "స్తుతిరత్నములు", "నవరత్నమాల"ను వ్రాసి పంపిన "దినకర్" మిత్రులకు (సాహితీ ప్రియులకు) కృతజ్ఞత తెలియజేయనైతిని. "దినకర్" మిత్రులు వ్రాసి పంపునంతవరకు వీటిని గూర్చి నాకు తెలియదా? ఒక సంవత్సరముపాటు తిరుపతిలోని గ్రంథాలయము లన్నిటిని పరిశీలించి, కత్తెరపల్లె (శ్రీ న. శాస్త్రిగారి స్వగ్రామము), నెల్లూరు మొదలగు ప్రదేశములకేగి ఎన్నో అపూర్వ విషయములను, గ్రంథములను సేకరించిన నాకీ "స్తుతిరత్నములు" ఒక లెక్కకు రావుకదా! 1928వ సం॥లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో సత్తీర్ణులైన మా తండ్రి బ్రహ్మశ్రీ డాక్టరు కాశీభట్ట రామనాథదత్తగారు నాకు నా పన్నెండవ సం॥ననే (అనగా 1950వ సం॥) శ్రీ న. శాస్త్రిగారి "నవరత్నమాల"ను నాకు కంఠస్థముగ నేర్పిరి. అంతేకాక శ్రీ బండేపల్లి శేషశాస్త్రిగారిచే రచింపబడిన "శ్రీ నవరత్నమాలా మంజూష"తో బాటు యీ "నవరత్నమాల"ను వావిళ్ల ప్రెస్‌వారు 1944లో ముద్రించిరి.

ఇక నవరత్నమాలిక" "ఆరాధన" పత్రికలో మొట్టమొదటి పర్యాయము ప్రకటింపబడినట్లు భ్రమించి శ్రీ దినకర్ దానిని చాల క్రొత్త విషయముగ తమ విమర్శలో నుడివిరి. ఈ "నవరత్నమాలిక"కు తెనాలి తాలూకా, అవనిగడ్డ వాస్తవ్యులు శ్రీ దివి నరసింహాచార్యులు "శ్రీ శారదాంబా నవరత్న మాలిక" యను క్రొత్త పేరు కల్పించి వాటిని తామే రచించినట్లు మద్రాసులో శ్రీ శృంగేరి స్వాములవారి సన్నిధిలో చదివి, 1960 "ఆరాధన" పత్రికలో ప్రకటింపగ, శ్రీ వట్టిపల్లి మల్లినాథ శర్మగారు, యీ "నవరత్నమాలిక" శ్రీ న. శాస్త్రి కృతమే కాని శ్రీ నరసింహాచార్యుల రచన కాదని సప్రమాణముగ నిరూపించిరి. (చూడుడు: శ్రీ వట్టిపల్లి మల్లినాథశర్మగారి "శంకర శతకము", భూమిక, 8—9 పేజీలు). ఈ విషయముల నన్నింటిని పరిశీలింపగ "ఆరాధన"లో ప్రకటించుటకు 40-50 సం॥లకు పూర్వమే "నవరత్నమాల" బహుళ ప్రచారములోనుండి, అచ్చటచ్చట ప్రకటింపబడినట్లు తెలియును. అంతేకాని యజ్ఞానాంధకారములో మునిగియున్న దినకర్‌గారు భ్రమ పడినట్లు ప్రప్రథమముగ "ఆరాధన"లో ప్రకటింపబడి "దినకర్" వలన మాత్రమే నాకు తెలిసినదనుట మిక్కిలి హాస్యాస్పదము.

క్రొత్త విషయములను తెలిపిన వారికి, యనన్య లభ్యమైన గ్రంథముల నందజేసిన వారికి కృతజ్ఞత తెలుపుట పరిపాటి కాని, అతి సామాన్యములు, సర్వజన లభ్యములు, పేలవములైన విషయముల దెల్పిన వారికి కృతజ్ఞత ప్రకటింపవలసిన బనిలేదు. దుస్సాహస తో విమర్శింపగోరిన వారిని గూడ నితరులతో సమానముగ

నేను కృతజ్ఞత ప్రకటించి యుండినచో శ్రీ వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారి యాత్మ ఎంత క్షోభించియుండెడిదో! ఇట్లు జరుగకుండుటకు కారణము శ్రీ న. శాస్త్రిగారు నన్నాశీర్వదించుటయే.

*డాక్టర్ కాశీభట్ట సేతురామేశ్వర దత్త*

# లేఖలు

## బసవేశ్వరుడు

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పరిశోధక పరమేశ్వరులు, కళాప్రపూర్ణులు. వారి విమర్శలకు ప్రతివిమర్శ చేయబూనడం సాహసమే. అయినా ఎంత గొప్ప పండితులుగాని అనాలోచిత విమర్శ చేసినప్పుడు సమాధానం చెప్పడం సత్యాన్వేషకుల విధి. తెలుగు కన్నడ సాహిత్యాల కించిత్ పరిజ్ఞానం ఉండబట్టి నేనీ సాహసం చేస్తున్నాను.

శ్రీ తిప్పేరుద్రస్వామిగారి ఆంగ్ల గ్రంథానువాదమైన 'బసవేశ్వరుడు' అనే గ్రంథాన్ని నిడుదవోలువారు సమీక్షించారు. (భారతి, నవంబరు, 78). ఈ సమీక్షలో కొన్ని వివాదాస్పదాలైన అంశాలున్నాయి.

బసవన వీరశైవ మతోద్ధారకుడని, బసవన వచన సాహిత్యము నవీనమని, అర్ధశతాబ్దము క్రిందట మాత్రమే వెలుగులోనికి వచ్చినదని, బసవాదుల నెవ్వరు సాహిత్య నిర్మాతగా పరిగణింపలేదని శ్రీ నిడుదవోలు వారు చెప్పడం వారికి కన్నడ సాహిత్యంతోగాని, కన్నడ సాహిత్య చరిత్రలతోగాని పెద్దగా పరిచయంలేదని తెలుపుతున్నది. బసవనను యుగకర్తగా (సాహిత్య యుగకర్త) గుర్తించిన సాహిత్య చరిత్రలే కన్నడంలో ఎక్కువ. దయచేసి నిడుదవోలువారు డా. రం. శ్రీ. ముగళిగారి 'కన్నడసాహిత్య చరిత్ర'ను ఒక్కసారి తిరుగవెయ్య వలసిందని మనవి.

డా. తిప్పేరుద్రస్వామి 'క్రిందటియేట' వచ్చిన 'బసవన వచనాలు—సమగ్ర సమీక్ష' అను గ్రంథమును చూడలేదట! సహృదయులు గమనింపగలరు! డా. తిప్పే రుద్రస్వామిగారు ఈ పుస్తకం కాక, విలువైన ఇంకా అనేక పుస్తకాలను ప్రచురించే కాలానికి శ్రీ రామయ్యగారు అసలు పరిశోధనైనా ప్రారంభించారో లేదో. శ్రీ నిడుదవోలు వారే చెప్పినట్లు 'సాహిత్య నిర్మాత' కాని 'బసవన వచనాల సమీక్షకు డాక్టరేట్ వచ్చిందంటే (తెలుగు సాహిత్యానికి) నిడుదవోలువారి మాటలలోని ఆభాసాన్ని గమనించగలరు!

బసవన కాలాన్ని గురించి వ్రాస్తూ 'ముక్తికంఠాభరణము' అనే వచనాన్ని ఉదహరించారు వేంకటరావుగారు (దాని అర్థం వారికే తెలియాలి—అది తెలుగూకాదు, కన్నడమూకాదు). కల్యాణిలో 36 ఏండ్లు ఉన్నట్లుగా ఉన్న ఈ వచనం సత్యమైనదని, బసవనిదని నమ్మని కన్నడ పండితులే ఎక్కువ. ఈ విధంగా కాలజ్ఞాన వచనాలను, ప్రక్షిప్త వచనాలను ఆధారంగాచేసుకొని కాలనిర్ణయం, జీవన కాలనిర్ణయం చేయడం పరిశోధకులు చేసే పనికాదు. ఇంతకు ఈ వచనం, దీనిఅర్థం రామయ్యగారుగాని,నిడుదవోలువారుగాని కొత్తగా కనుక్కొన్నదేమీకాదు.ఇదిఇంతకుముందేకన్నడంలోచర్చాస్పదమైంది. డా స్వామిగారు బసవన వచనాలను చదవలేదని, కన్నడ గ్రంథాలు చూడలేదని చెప్పడం దుస్సాహసం. డా. తిప్పేరుద్రస్వామిగారు కన్నడంలోని ప్రామాణిక విమర్శకులలో ఒకరు. బసవన జీవితకాలం తేదీలతో సహా నిర్ణయమైందని మన మనుకుంటే సరికాదు. వాటిని నిర్ణయించడానికి మూలాలు ఎంతవరకు సరైనవి, దానిని ఎంతమంది అంగీకరించారు వగైరాలన్నీ పరిశీలించాలి. ఇక్కడ ఒక విషయం స్పష్టం చెయ్యాలి. విమర్శ కవిత్వం కాదు. పరిశోధకులు ఇతరుల పరిశోధనలను, ఆలోచనలను ఎరువు తెచ్చుకున్నప్పుడు వాటినిపేర్కొనాలి. తమ మీద విమర్శ వచ్చినప్పుడు(ఉదా : రామయ్యగారి పరిశోధనలను పూర్వపక్షంచేస్తూ కన్నడంలో వచ్చిన వ్యాసాలు) వాటిని పేర్కొనాలి, ఖండించాలి. ఇవేవీ చేయనప్పుడు ఆ పరిశోధనలమీద, వాటిని అగత్యమైనా మధ్య ప్రవేశింపజేసే శ్రీ నిడుదవోలువంటి వారి ఆర్జవంమీద అనుమానం రావడం సహజం (శ్రీ నిడుదవోలువారు ప్రశంసాపూర్వకంగా శ్రీ రామయ్యగారి గ్రంథానికి వ్రాసిన పీఠికనే 'భారతి'కి సమీక్షగా పంపి ప్రచురించారు. ఇది అపూర్వము, పెద్దలు చేయకూడనిది—పీఠికలలో చాలామటుకు బలవంతపు బ్రాహ్మణార్థాలే అని చాలామందికి తెలుసు). అందువల్ల 'బసవన కాలము' అనే సమీక్షలోని పేరా నిజానికి నిరుపయోగము. ముందేవచ్చిన శ్రీ స్వామిగారి గ్రంథంమాట అటుంచి శ్రీ రామయ్యగారి గ్రంథం వచ్చిన తర్వాత కన్నడంలోవచ్చిన ప్రామాణిక సాహిత్య గ్రంథాలలో వారి వాదాన్ని ఎంతవరకు అంగీకరించారన్నది శ్రీ నిడుదవోలువారు తెలుసుకుంటే మంచిది.

డా. స్వామిగారు బసవన చేసినవని మన పండితులు నమ్ముతున్న మహిమల్ని గురించి చెప్పకపోవడం ఆయన గ్రంథానికున్న విశిష్ట గుణాల్లో ఒకటని నా నమ్మిక. సాహిత్య నిర్మాతగా బసవనను నిరూపించ నిశ్చయించుకున్న గ్రంథంలో అసంగత మహిమల వర్ణనమెందుకో అర్థంకాదు.

మన గ్రంథాలను, మన పండితులను దుయ్యబట్టేటప్పుడు ఎట్లున్నా ఇతర భాషలను, ఇతర భాషాపండితులను గురించి వ్రాసేటప్పుడు సంయమం, సత్యాన్వేషణ, పక్షపాత ధోరణి లేకపోవడం అన్నవి అత్యవసరమని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

*శ్రీ సుందరం*

## అహితబోధకు మితబోధ

బసవన సాహిత్య నిర్మాతకాడు· కబీర్, మీరాబాయి, విద్యాపతి, చండీదాస్, జయదేవ నమ్మాళ్వార్‌వలె భక్తిగీత రచయితే కాకుండా మహాప్రవక్త. వీరశైవ మతోద్ధారకుడు. వర్ణాశ్రమ ధర్మనిర్మూలన దీక్షాదక్షుడు. శంకర, రామానుజ, మధ్వాచార్యులల

వలె దక్షిణ భారతావనిలో వెలసిన మహానుభావుడు. దీనికి కన్నడ సాహిత్య చరిత్రను మరోసారి చూడనక్కరలేదు. సుందరంగారికి ప్రసిద్ధ కన్నడ రచయిత డా. హెచ్. తిప్పేరుద్రస్వామివారిపై గల అవ్యాజానురాగం హర్షింపదగినదే. కాని వారు 'కన్నడ గ్రంథాలు చూడలేదని చెప్పడం దుస్సాహసమని' సుందరంగారు వ్రాయడం సబబుగాలేదు. అటువంటి నిందాపూర్వకమైన రచన సుందరంగారి చేతికి అలవాటేమోగాని నా విమర్శలోలేదు. కాబట్టి వీరు నా విమర్శ చదివి ఉండరనుకొంటాను. అంతేకాదు. శ్రీ స్వామిగారు ప్రతి పుటలోను బసవవేశ్వరుని ఘహాప్రవక్తగా చిత్రించారు. దానికి ఆధారాలు బసవగీతాలనుండి ఉద్ధరించారు. వారు సాహిత్య నిర్మాతగా బసవేశ్వరుని చిత్రించలేదు. సుందరంగారు శ్రీ స్వామిగారి 'బసవేశ్వరుడు' గ్రంథంకూడా చదివినట్లులేదు. శ్రీ స్వామిగారిపై భక్తి తాత్పర్య గరిమ, శ్రీ రామయ్యగారిపై ఈర్ష్యాద్వేషాలు శ్రీ సుందరంగారి లేఖకు ఉద్బోధకమైన కారణాలు. ఇతరులకి కన్నడ వాఙ్మయంతో పరిచయం ఉన్నదీ లేనిదీ సంగతి ఈ సందర్భంలో అనవసరం, ఇంతకీ శ్రీ స్వామివారిని 'ఎవరూ దుయ్యపట్టలేదు': వారి గ్రంథాన్ని విమర్శించడం మాత్రమే జరిగింది. దీనికే సుందరంగారికి ఇంత కోపమా! మితబోధములైనవారు హితబోధ చెయ్యడం ఆశ్చర్యంగా ఉంటుంది.

*శ్రీ వేంకటరావు*

# మరీ పూరు విమర్శలు

'భారతి' 'నవంబరు 78' 74 పేజీలో శ్రీ ములుమూడి ప్రసాదరావు "మరుపూరిగారి విమర్శలు" గూర్చి ఒక లేఖ వ్రాశారు దానిమీద నా అభిప్రాయం మనవి చేస్తున్నాను.

(1) "అందరూ కృష్ణామాండలిక పదాల్నే వాడాలా?' అని ప్రసాదరావు ప్రశ్నించారు పలువురు రచయితలు ఈనాడు వారి వారి మాండలికాల్ని సొగసుగా వాడుతూంటే అవి "తప్పు" అని మరుపూరు కోదండరామరెడ్డిగారు ఈసడిస్తున్నారు. ఆ విషయం ప్రసాదరావు ముఖ్యంగా గమనించాలి. "కొబ్బరిచెట్టు-తోటి-బానిసత్వం"వంటి వాడుకలు ఏ మాండలికాలైనా తప్పులుకావు.

(2) "మరుపూరువారు నెల్లూరుదేశ్యం వాడడం వింతగా వుండవచ్చు కొందరికి"—వింత యేమీ లేదుగాని వెక్కిరించినట్టు వుండకూడదుకదా? నెల్లూరి మాండలికం వాడటంకోసమని యితర మాండలికాల్ని తప్పు పట్టాలా? ఒకరు పనిగట్టుకొని ఒక్కమాండలికమే వాడితే అంత మాత్రానికే అది ప్రచారమైపోదు; అందులో 'రసవత్త' వుండాలి మరి!" "నెల్లూరుదేశ్యం" అని ప్రసాదరావు పేర్కొనడం పొరపాటు, "నెల్లూరి మాండలికం" అనాలి.

(3) "వారుపయోగించే 'మాండలిక' పదాల్లో ఒక చెణుకు, ఒక హాస్యం, ఒక వింతశబ్దం చెవుల్లో మార్మోగుతుంటుంది"—అది ప్రసాదరావు అభిరుచి. ఒకరి అభిరుచి మరొకరు కాదనకూడదు. కాని తప్పును ఒప్పుగా, ఒప్పును తప్పుగా భజించకూడదు. అది నీచాభిరుచి అవుతుంది. మాండలిక పదాల ప్రయోగంతోనే సమైక్యత వస్తుందని ప్రసాదరావు అనుకోవడం (ఇతర మాండలికాల్ని తప్పు పడ్తూనా?) వారి భాషా-రాజకీయ—చారిత్రక పరిజ్ఞానానికి గుర్తు.

(4) నేనూ నెల్లూరు మండలం వాడినే. నెల్లూరి మాండలికం వాడటం నాకూ యిష్టమే. సమర్థంగా వాడాలని నా కోరిక కూడా. కాని యితర మాండలికాల్ని నిరసించ బనిలేదు; తప్పులని త్రోసి పుచ్చుడమూ పనికిరాదు.

మరొక సంగతి—

డా మురళీధర్ అనువారు మరొక లేఖలో ఒక 'వింత విశేషం' సెలవిచ్చారు!

(1) "మరుపూరుగారు గ్రంథవిమర్శ చేయరాదనడానికి మీ రెవరండి" అని అంజయ్యను ప్రశ్నించారు. మరుపూరివారి జ్ఞానవిశేషం అలాంటిదని అంజయ్య అభిప్రాయం ఆ యభిప్రాయం ప్రకారం సంపాదకులు మరుపూరి విమర్శలు మానేస్తారనికాదు. వెర్రిమొర్రి రచనలద్వారా కూడా పాఠకులను ఆకర్షించాలనుకోవడం సంపాదకులకు సహజమే. 'భారతి' అన్ని అభిప్రాయాలను ప్రచురిస్తున్నది, అది గొప్ప సుగుణం.

(2) "మీ రచనలు వారికి పంపకండి. కాని ఇష్టమున్నవారు పంపుకొంటారు. ప్రచురించే బాధ్యత సంపాదకులది..." ...రచయితలు తమ రచనలు నేరుగా విమర్శకులకే పంపుకొంటారని నాకు ఇంత దాకా ఊహలేదు! సంపాదకులకే పంపితే, వారు అర్హులైన విమర్శకులకు అప్పగిస్తే, ఆ విమర్శకులు సమీక్షిస్తారనుకుంటుండినది పొరపాటన్నమాట? పరిస్థితులు మారిన సంగతి యిప్పుడే తెలుస్తున్నది! శుభమస్తు.

*శ్రీ బండి నాగరాజు*



# గ్రంథ విమర్శలు

## యోగము - జూదము

[గ్రంధకర్త : డా. గోరంట్ల మదనమోహనరావు, ఎం. ఏ. పి.హెచ్.డి.; ప్రచురణ : శ్రీ ధూర్జటి ప్రచురణలు; పుటలు : 28; వెల : పదిరూపాయలు ]

పేకాటలో గెలవడానికి ఓడిపోవడానికి ఎప్పుడు ఎక్కువగా అవకాశాలున్నాయో ఈ చిరు గ్రంధంలో చర్చించబడింది. ఈ గ్రంధం వ్రాయడానికి అయిదు సంవత్సరాల, ముప్పదివేల రూపాయల వ్యయం జరిగిందని గ్రంధకర్త పీఠికలో చెప్పారు. తమిళంలో అవ్వైయ్యార్ అనే భక్తురాలు చెప్పిన విషయం మీద గ్రంధకర్త పరిశోధన సాగించి ఈ క్రింది విషయాలు తెలుసుకున్నారు.

రోజుల మీద సూర్యచంద్రుల ప్రభావం వుంటుంది. ఒక వారంలో కొన్నిరోజులు సూర్యుని ప్రభావం, కొన్నిరోజులు చంద్రుని ప్రభావం వుంటుంది. ఈ ప్రభావం పక్షాలమీద కూడావుంటుంది. కృష్ణపక్షము మీద సూర్యుని ప్రభావం, శుక్లపక్షము మీద చంద్రుని ప్రభావం వుంటుంది. ఆయా పక్షముల్లో, రోజుల్లో ముక్కు రంధ్రాలనుండి వచ్చే శ్వాసనుబట్టి జయాపజయాల నిర్ణయం చెయాలి. అంటే, సూర్యుని రోజుల్లో సూర్యనాడి నుండి అనగా కుడి ముక్కు రంధ్రంనుండి శ్వాస వస్తుంటే జయము. అలాగే చంద్రుని రోజుల్లో చంద్రనాడి నుండి అనగా ఎడమ ముక్కు రంధ్రం నుండి శ్వాస వస్తుంటే జయము. అలాగే సూర్యపక్షంలో సూర్యనాడి నుండి శ్వాస వస్తుంటే జయము. చంద్రపక్షంలో చంద్రనాడి నుండి శ్వాస వస్తుంటే జయము.

గ్రంధకర్త చెప్పినట్లుగా అనుభవ పూర్వకంగా వెంటనే ఒక విషయం తెలుసుకోవచ్చు. అదేమిటనగా, ఒక ముక్కురంధ్రం నుండే శ్వాస ఎక్కువగా వస్తూ పోతూవుంటుంది. ఈ శ్వాస కూడా షుమారు ప్రతిరెండుగంటలకు ఒకముక్కు రంధ్రంనుండి వేరొక ముక్కురంధ్రానికి మారుతుంది. ఈ గ్రంధం చదువుతుంటే, ఎన్నో సందేహాలు గలుగుతాయి. ఒక్కసారి చదివితే, అర్థంకాదు. కొన్నివిషయాలు పట్టిక ద్వారా చెప్పారు. అవి — ఏయే పక్షంలో, ఏయే రోజులలో, ఏయే శ్వాస లాభము.

పేకాటలో కూర్చున్నవారికి ఈ పట్టిక ఆధారంగా శ్వాసను చూచుకొని లాభం (జయం) వచ్చేవేళ్ళలోవుండి, నష్టంవచ్చేవేళ లేచి వెళ్ళిపోవచ్చు. రెండుగంటల తర్వాత మళ్ళీశ్వాస మారుతుంది గాబట్టి, అప్పుడు పేకాటలో కూర్చోవచ్చు అని గ్రంధకర్త చెప్పారు. దీనినిబట్టి పేకాటలో కూర్చున్న ప్రతివారికి ఒక రెండు గంటల కాలం లాభంతో కూడినదవ్వాలి. కాని ఇదికూడా ఖచ్చితంగా చెప్పలేరు. ఏమయినా, గ్రంధకర్త చెప్పిన సూత్రాలు బాగా అనుభవపూర్వకంగా తెలుసుకొనిగాని కొట్టెయ్యడానికి వీలులేదు. పేకాటప్రియులు ఈ పుస్తకంకొని లాభాన్ని ప్రయత్నించవచ్చు ఈ పుస్తకం పది రూపాయిలుపెట్టి కొనడం పేకాడేవారికి తేలికే అవ్వవచ్చుగానీ, ఇది చదివి అర్థంచేసుకొని, వీటిలో పొందపరచిన సూత్రాల ప్రకారం ఆడే వోపిక ఎవరికీ వుండకపోవచ్చు. పైగా పేకాట జోరుగా జరుగుతున్న సమయంలో ఎవరైనా తమ శ్వాసను పరీక్షించుకొని, ఇక నష్టంవచ్చేవేళ మొదలయిందని లేచి వెళ్ళడానికి ప్రయత్నిస్తే ఎవరూ వూరుకోరు.

ఇందులోని సూత్రాలు ఒక్క పేకాటకేకాక మిగతా జూదాలకు కూడా వర్తిస్తాయి, సినిమా తీసేవారికి కూడా వర్తిస్తుంది అన్నారు గ్రంధకర్త (సినిమా జూదమేకదా!).

ఇది పరిశోధనా గ్రంధం కావడంచేత కాబోలు దీనికి ఎక్కువ వెలపెట్టారు. పుస్తకం లోపల చదవకుండా, చూచే వారికి ఇదియెక పరిశోధనా గంధం అనిపించదు.

— బాబు

## గణపతి

[కన్నడ మూలం : శ్రీ ఎస్. శ్రీధరమూర్తి రచనకు ఆంధ్రానువాదం, అనువాదకులు : శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి. డెమ్మీసైజు 152 పుటలు, వెల: 12 రూ. లు, ప్రతులకు : పునర్వసు ప్రకాశనము, మల్లేశ్వరం, బెంగుళూరు–3 లేక శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రి, గాంధీనగర్, కడప–4.]

గణపతి దేవుడు చాలా మందికి ఆరాధ్యదేవత. భారతదేశం అంతటా ప్రతి సంవత్సరము అతని పూజలు, గణపతి నవరాత్రోత్సవాలు వైభవంగా జరుగుతూ ఉంటాయి. ఆ దేవుని గురించి రకరకాల కథలు చెప్పుకుంటారు. కాని, ఆయన తత్వాన్ని తెలుసుకున్నవారు తక్కువ. వేర్వేరు గ్రంథాలలో ఆ దేవుని గాధలు విభిన్న పద్ధతులలో ఉన్నవి. వాటినన్నిటినీ సమీకరించి, సమీక్షించి వ్రాయబడిన గ్రంధం "గణపతి".

దీని కన్నడ మూలాన్ని రచించిన మ. శ్రీధరమూర్తిగారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు. చరిత్ర పరిశోధనలోను, ప్రాచ్య, నవ్య సాహిత్యంలోనూ, గ్రంధ రచనలోను, పత్రికా సంపాదకత్వంలోను గొప్పఅనుభవం ఉన్నవారు. ఎన్నో గ్రంధాలు రచించి విఖ్యాతులైనవారు. ఆయన బెంగుళూరులోని "రాష్ట్రోద్ధార సాహిత్య" వారి ప్రోత్సాహంతో దీనిని రచించి ప్రకటింపజేశారు. "గణపతి"ని గురించిన అపూర్వ విషయాలిందు ఎన్నో ఉన్నందున కన్నడ పాఠకులూ, విద్వాంసులూ కూడా దీన్ని చాలా మెచ్చుకున్నారు.

ఇట్టి గ్రంథం తెలుగులో **కూడా** ఉండడం ఎంతో అవసర మని గ్రహించి విద్వత్కవులు, రాయలసీమ రచయితలలో ప్రముఖులు, తెలుగు, కన్నడాలు రెండింటిలోనూ అభిజ్ఞులూ అయిన జానమద్ది — హనుమచ్ఛాస్త్రిగారు ఆంధ్రీకరించారు. సులభగ్రాహ్యమైన వ్యావహారిక భాషలో ఈ రచన సాగింది. అయితే—అనువాదం జరిగినప్పుడు కొంచెం మార్పు చెయ్యవలసి వచ్చింది. దాన్ని హనుమచ్ఛాస్త్రిగారే యిలా వివరించారు:

''మూలములో కర్ణాటకములో గణపతి, కన్నడములో గణపతి'' అని రెండు అధ్యాయాలున్నవి. వానిలో మొదటి దానిని అట్లే వుంచి అనుబంధములో 'ఆంధ్ర ప్రదేశములో గణపతి', 'కన్నడములో గణపతి'కి బదులుగా ''తెలుగు కావ్యాలలో గణపతి'' అను అధ్యాయాలు చేర్చి తెలుగు పాఠకులకు సమర్పిస్తున్నాను.'' తెలుగు పాఠకులకు తగినట్లు యిలా మార్పు చెయ్యడం ఎంతో సబబుగా ఉన్నది.

ఇందులో ''శ్రీముఖము, పుట్టుక —వికాసము, పురాణాలలో గణపతి, విగ్రహ కల్పనము, విగ్రహ లక్షణము — వైవిధ్యము, కర్ణాటకములో గణపతి, గణపతి తత్వము, పూజ — ఉపాసన, విదేశాలలో గణపతి, గాణాపత్య సాహిత్యము, కలౌ చండీ వినాయకౌ'' అనే శీర్షికలు ఉన్నవి. అనుబంధంలో ''తెలుగు కావ్యాలలో గణపతి, ఆంధ్రప్రదేశములో గణపతి, గణపత్యథర్వ శీర్షోపనిషత్, ఉపయుక్త గ్రంథసూచి, చిత్రసూచి'' ఉన్నవి. పుస్తకం చివర 16 పుటలలో ఆర్టు పేపరు పైని వివిధ ప్రాంతాలకూ, దేశాలకూ సంబంధించిన గణపతి చిత్రాలు ఛాయా చిత్రాలు, రేఖా చిత్రాలు 44 ఉన్నవి.

ఈ శీర్షికలను బట్టీ, అనుబంధాన్నిబట్టీ గణపతిని గురించి రచయిత ఎట్టి ప్రగాఢ పరిశోధన చేసినదీ స్పష్టమవుతూ ఉన్నది. ఈ విషయంలో రమారమి అరవై గ్రంథాలను చూడడం జరిగింది. అవి సంస్కృతం, ఇంగ్లం, మరాటీ, హిందీ, తెలుగు భాషలలో ఉన్నవి. ఋగ్వేదం మొదలుకొని నవీనంగా వెలువడిన గ్రంథాలు ఈ గ్రంథ పట్టికలో చేరి ఉన్నవి.

ఇందలి 'శ్రీముఖం'లో గణపతి అనార్యుల దేవుడనీ, తర్వాత ఆర్యుల దేవుడయినాడనీ చెప్తున్న పాశ్చాత్యుల అపసిద్ధాంతాలు సయుక్తికంగా ఖండించబడినవి. 'పుట్టుక — వికాసము' అనే శీర్షికలో గణపతిని గురించిన అభిప్రాయాలు క్రమక్రమంగా ఎలా పరిణమిస్తూ వచ్చాయో, మొదట్లో లేని గణపతి పూజ క్రమంగా ఎలా చోటు చేసుకుని దేశమంతటా వ్యాపించి ప్రాముఖ్యాన్ని గడించిందో వివరంగా ఉన్నది. తర్వాతి ప్రకరణంలో గణపతిని గురించి వివిధ పురాణాలలో కానవస్తున్న విభిన్న గాథలు సంగ్రహించబడినవి. ఆ తర్వాత 'విగ్రహలక్షణము—వైవిధ్యము' అనేశీర్షికలో గణపతివిగ్రహాల వైవిధ్యము, దానికి కారణములు ఉన్నవి. తర్వాతి ప్రకరణంలో కర్ణాటక రాష్ట్రంలోఉన్న గణపతి క్షేత్రాల సమాచారంఉన్నది. ఆతర్వాత గణపతి తత్వాన్ని గురించీ, వాహనాన్ని గురించీ, భార్యా పుత్రులను గురించీ అపూర్వమైన విషయాలు ఉన్నవి. 'పూజ—ఆరాధన'' అనే శీర్షికలో గణపతి పూజను, వ్రతాన్నీ గురించే కాకుండా గాణాపత్యం, పంచాయతనం, గణపతి చక్రాలు మున్నగు వాటి విషయాలు విపులంగా చెప్పబడినవి. ఆరాధన విషయమై పురాణాల్లో చెప్పబడిన విశేషాలు కూడా ఇందులో ఉన్నవి.

''విదేశాలలో గణపతి'' అన్న శీర్షికలో విదేశాలలో కనబడుతున్న గణపతి శిల్పాలను అనుసరించి ఆయా గణపతి శిల్పాల స్వరూపాలు, బౌద్ధులు తమ దేవతా విగ్రహాలలో గణపతిని ప్రవేశ పెట్టడానికి కారణం, విదేశాలలో గణపతి ప్రవేశం మున్నగునవి వివరంగా ఉన్నవి. తర్వాతి అధ్యాయంలో గణపతిని గురించి వివిధ భాషల్లో ఉన్న వాఙ్మయం, సూత్ర, తంత్ర గ్రంథాలను గురించీ ఉన్నది. తర్వాత కలియుగంలో వినాయకునికిగల ప్రాధాన్యం వివరింపబడింది.

పుస్తకం అట్టమీద చిన్నదిగానూ, లోపల ఆది శంకరుల గణపతి స్తోత్ర రత్న ప్రారంభంలో సమగ్రంగా పెద్దదిగానూ గణపతి యంత్ర చిత్రం చేర్చబడినది.

గణపతిని గురించి సమగ్రంగా వివరించే గ్రంథాలలో ఇది విశిష్టమైనది. తెలుగులో ఇటువంటి గ్రంథం యింతవరకూ వెలువడ లేదనే చెప్పవలసి యున్నది.

డాక్టర్ కే. కృష్ణమూర్తిగారు (ధార్వార్ కర్ణాటక విశ్వవిద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులు) ''గణపతిని గురించిన పరిశోధనాత్మక సాహిత్య మంతటినీ ఆమూలాగ్రంగా అధ్యయనం చేసి, ఆధునికుల ఔత్సుక్యాన్ని ఉపశమింపజేసే రీతిగా సరళమైన కన్నడంలో రచింపబడిన ఈ గ్రంథం నిజంగా శ్లాఘాపాత్రం. రచయిత విషయ నిరూపణలో అంధ శ్రద్ధకు లోబడకుండా, అతి వైజ్ఞానిక మనోధర్మానికి బలికాకుండా, వస్తు నిష్ఠ దృష్టి కలిగి వుండటం ప్రశంసార్హం'' అని మూల గ్రంథాన్ని అభినందించారు. ఈ ఆంధ్రానువాదం ఆ అభినందనలలో వంతు పంచుకోగలదని చెప్పవలసి ఉన్నది.

ఇది ఆంధ్రానీకం సమాదరణకు పాత్రం కాగలదని విశ్వసిస్తున్నాను.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# దీనారటంకాలు

[వైజయంతి, శ్రీనాథాంకం. 2వ ప్రచురణ. శ్రీనాథుని సీసాలు—సవ్యాఖ్య—వ్యాఖ్యాత శ్రీకర్రా—చంద్రశేఖరశాస్త్రి, అగ్రహారం, సామర్లకోట, తూర్పు గోదావరి జిల్లా. క్రౌను 16 + 135 పుటలు. విలువ రు. 10/-]

'దీనారటంకాలు'అనే మాటవింటేనే చటుక్కున శ్రీనాథుని సీసాలు చెవిలో మారుమ్రోగుతాయి. శ్రీనాథుడి సీసం విలువ కట్టలేని అనర్ఘరత్నమని సాహితీ వేత్తలు ఎరుగుదురు. ఆ సీసపద్యాలు అందర్నీ ఆకర్షిస్తాయి అన్నీ హృదయంగమాలే అయినా ఆయా గ్రంథాలలోంచి ప్రసిద్ధమైన వాటిని కొన్నియేర్చి, తమ వ్యాఖ్యతో— సుప్రసిద్ధ విద్వాంసులు కర్రా-చంద్రశేఖరశాస్త్రిగారీ పుస్తకాన్ని ప్రకటించారు. ''వైజయంతి'' ప్రకటన మూలంగా శాస్త్రిగారు చేస్తున్న సాహిత్య సేవ సాహిత్యాభిమానులకు విదితమే!

ఇందులో కవి సార్వభౌముని శృంగార నైషధం, భీమ ఖండం, కాశీఖండం, చాటువులు, హరవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం, క్రీడాభిరామాలనుండి అక్కడక్కడి పద్యాలు తీసుకుని వ్యాఖ్య వ్రాయబడింది. ఇందలి వ్యాఖ్య ప్రతి పదార్థటీకా తాత్పర్య సహితం కాదు. కవి హృదయాన్నీ, వ్యాఖ్యాతృ హృదయాన్నీ వెల్ల డించే సంగ్రహరూపం. అవసరమైనచోట్ల కొన్నిపదాలకు మాత్రం అర్థం ఇయ్యబడింది. ప్రతి పద్యానికీ అవతారిక, తాత్పర్యం, విశేష వ్యాఖ్య కూర్చబడినవి. పాఠకులు తమకు — ఆయా వ్యాఖ్యలు చదివి నపుడు తమకు తోచిన విషయాలు ''నోట్'' చేసుకొనుటకు అను కూలంగ అక్కడక్కడతెల్లకాగితాలు చేర్చబడినవి.

ఇదివరకు ముద్రితాలైన శ్రీనాథుని గ్రంథాలలో అక్క డక్కడ అపపాఠాలు చేరి అర్థంకాక పెద్ద పెద్ద విద్వాంసులే తిక మకలు పడేవారు. ఈ వ్యాఖ్యాత చాలా చోట్ల సరియైన పాఠాలనే గ్రహించి వ్యాఖ్యానించడం ప్రశంసనీయం.

ఉదాహరణకు (పుట 60) కాశీఖండంలోని ''చిఱు సాన బట్టించి...'' సీసం ఎత్తు గీతిలో మునుపు ''స్పష్టికన్నెర'' అని పడింది. అది అర్థంకాక వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి వారు సుదీర్ఘంగా పరిశీలించి ''స్పష్టి కన్దెర'' అనే సాధుపాఠాన్ని బయటికి తీశారు. ఆ పాఠాన్నే ఈ వ్యాఖ్యాత గ్రహించడం హర్షించదగినది.

82వ పుటలో చాటువులలోని ''కవిరాజు కంఠంబు—'' అనే పద్యం మొదటి పాదంలో ''పురవీధినెదు రెండం బొగడదండ'' అని బొగడదండలోని 'బొ'ను ఆదేశ సరళంగా భావించి ''పొగడ దండ'' శిక్షా సాధనమని వ్రాశారు. అది స్వాభావిక సరళమే కాని ఆదేశ సరళం కాదనీ, ''బొగడదండ'' యే శిక్షాసాధనమనీ విద్వాంసులు సమ్మతించారు. మరి ఈ వ్యాఖ్యాత మాత్రం ''పొగడదండ'' అనే అంటున్నారు. ''పొగడదండ'' యే సరియైన పాఠమని వారి అభిప్రాయమేమో !

దీనిపైని డాక్టర్ నారాయణరెడ్డిగారు, డాక్టర్ ఎస్వీ జోగా రావుగారు సదభిప్రాయాలిచ్చారు. ఇట్టి వ్యాఖ్యాత తన పద్యాలకు దొరకడం శ్రీనాథుడి అదృష్టమంటున్నారు డాక్టర్ జోగారావు గారు. దీనికి ''దీనారటంకాలు'' అనే పేరు బాగా కుదిరిందని డాక్టర్ నారాయణరెడ్డిగారి అభిప్రాయం.

వ్యాఖ్యాత తమ 'వక్తవ్యం'లో 'వైజయంతి' తొలి సంపుటాన్ని గురించీ, మలి సంపుటంలో ప్రణాళిక మార్పును గురించీ, వ్యాఖ్యావిర్భావాన్ని గురించీ, ప్రకటనకు ఆర్థికంగా సహాయం చేసిన ఉదార హృదయులను గురించీ కృతజ్ఞతాసహితంగా తెలుపుకున్నారు. శ్రీ వడ్డాది పాపయ్యగారి ముఖచిత్రం ఆకర్ష ణీయంగా ఉన్నది.

ఇది సాహిత్యాభిమానుల హృదయాలను ఆకర్షించగలదని నా విశ్వాసం.

*"అంగీరస"*

## కాకతి

[రచయిత :ఇవటూరి యోగదుర్గామల్లికార్జున, ప్రచురణ; ఇవటూరి సుబ్రహ్మణ్యం అండ్ సన్స్, సత్యనారాయణపురం, విజయవాడ - 11. వెల : రూ. 4 00; పుటలు 27 ]

ఇందు రచయిత కాకతి శబ్దమును గూర్చి చర్చించుచు ఇట్లు వ్రాసిరి : ''కాకిత, కాకతి, కాకెత, కాకర్త్య, కాకత్య, కాకణ్తి, కాకణ్డ, కాకన్ది, కాకన్దు కాకండక (ఋషి గుప్త కాకండకుడు, కాశ్యపేయ, గౌతమీయ, వాసిష్ఠీయ, సౌరాష్ట్రిక అను నాలుగు శాఖలను స్థాపించి. వాటితో పాటు ఋషి గుప్తిక, ఋషిదత్తిక, అభిగసన అను మూడు మానవ గణములను స్థాపించినవాడు, కాకండిక, కాకాని, కాకండి, కాకత్తియ, కాక రణ్డియ, (కాకరణ్డయ, కాకరన్తియ, కాకరణ్తియ, కాకరత్తియ), కాకరతియ్య అను పేరులన్నీ సమానార్థకములై క్రమక్రమ పరిణతి చెంది కాకత్య, కాకరణ్డియ శబ్ద పరిణామమును తెలుపుచున్నది. ఈ పరిణామమునకు చెందినదే కాకర్త్య శబ్దముకూడా.''

పై జెప్పిన శబ్దజాలము నెక్కడనుండి గ్రహించిరో వారు వివరించలేదు. మొదటి బ్రాకెటు ఎక్కడ అంతమగునో తెలుప బడలేదు కనుక వాక్యము దుర్గ్రాహ్యముగనున్నది. మొదటి పదములు కాకతి పదమునకు దగ్గరగానున్నవి. కాకతి, కాకర్త్య, కాకాని నామములను బట్టి యీమె నల్లటివర్ణముగల దేవతయనిరి. అటుపైన ఈమెయే మహాకాళియని చెప్పి ఆమె యొక్క మాహాత్మ్యమును అభివర్ణించిరి. కొన్ని శ్లోకముల నుదహరించిరి. దేవీభాగవతములోని శుంభ నిశుంభుల వధ, మహిషాసుర వధలకు సంబంధించిన కధలను వివరించి చెప్పిరి. వీరపూజ యనగా యుద్ధములందు మృతినొందిన వీరుల పూజకాదనియు, శ్రీ విద్యో పాసకుల పూజయనియు వీరిభావము. గ్రామదేవతలందరు సాధారణముగా విద్యోపాసకులేననిరి. కనుక ఆ గ్రామదేవతల పూజయే వీరపూజయని వీరి యభిప్రాయము.

ఈ చిన్నపొత్తము దేవీ ఉపాసకులకు కొంత ఆదరణీయమన్పి తోచుచున్నది. కాని చరిత్రకు సంబంధించిన అంశములిందు గ్రంథ రచయిత ఆశించినంతగా కనుపించవు.

కాకతియను శబ్దము దేవత పేరుగను, నగర నామముగను మన కుపలబ్ధ మగుచున్నది. ఆ దేవతను గాని, నగరమును గాని సరిగా గుర్తించుటకు వీలుకాకున్నది. వీరి పుస్తకములో కూడా అట్టి సంశయములు తొలగుటలేదు. నల్లనివర్ణముగల కాళికయే కాకతియని వీరు చెప్పిన అంశము లోగడ కొంత తెలిసియేయున్నది. నగరనామమును బట్టియా లేక దేవత నామమును బట్టియా కాకతీయ వంశ నామమేర్పడినది ? ఈ సమస్యను సమాధాన పరచుటకు ఈ రచన తోడ్పడునట్లు తోచదు.

*శ్రీ పరబ్రహ్మ శాస్త్రి*

# విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్ మూడుపుస్తకాలు

విజయవాడ విశాలాంధ్ర పబ్లిషింగ్ వారు ఈ 1978వ సంవత్సరములో నిర్వహించిన నవలల పోటీలో జాతశ్రీ వ్రాసిన "బలిపశువు" కు ద్వితీయ బహుమతి లభించింది. పండుముసిలి పున్నమ్మతో ఆరంభమైన ఈ కధ ఆమె అత్తగారి వృత్తాంతం వరకూ వెనక్కు వెళ్ళి అక్కణ్ణుంచి ప్రస్తుతం వరకూ వచ్చింది కథా స్థలం తెలంగాణాలోని వో పల్లె. ఆ పల్లె జనం, పడుచులు, ధనవంతులు, కామందులు పాత్రలు.

రచయిత జాతశ్రీ కధలోని పాత్రలు రచించడంలో చక్కని శ్రద్ధ వహించారు. పల్లెలలోని రాజకీయాలు, అరాజకీయాలూ చక్కగా చిత్రీకరించారు. ముఖ్యంగా పున్నమ్మ పాత్ర అతి చక్కనిది. పల్లె అరాజకీయాలలో ఆమె భర్త చంపబడ్డాక ఆమె ఆ పల్లెలో ఏ కామందు కామానికి బలికాకుండా తన పిల్లలను పెంచుకోగలుగుతుంది. తన అత్తగారిని వుంచుకుని, తన భర్త జన్మకు కారకుడైన దొర (ఖామందు) నీడన బ్రతుకుతూంటుంది. ఆమె కోసం ఆశపడ్డ అనేకులు హతాశులవుతారు.

కధ నింతవరకూతెచ్చి, పున్నమ్మ పవిత్రతను పెంచుతూ వచ్చిన రచయిత చివరికామె పాత్రను పుట్టున అపవిత్రం చేశారు. ఆమెను కష్టాల్లో ఆదుకున్న దొరకు ఆమె యవ్వనమంతా తీరే సమయానికి ఆమె మీద కోర్కె కలగడం, ఆ కోర్కెను ఆమె తీర్చడం, యిది చూచిన ఆమె కొడుకు దేశాలు పట్టిపోవడంవంటి మలుపు కధ తిరుగుతుంది. ఇది పున్నమ్మ పాత్రకు రచయిత చేసిన అన్యాయం. అంతేగాక ఆ సన్నివేశానికి కూడా రచయిత బలం చేకూర్చలేక పోయారు.

ఇది తప్ప కధ, కధనం, సన్నివేశాల చిత్రీకరణ అన్నీ బాగున్నాయి. ముఖచిత్ర రచయిత, ప్రకాశకులూ కధను వివరించే బొమ్మ విషయంలో కాస్త శ్రద్ధ వహించివుంటే బాగుండి వుండేది. పున్నమ్మ మీద లోకులు ఆశపడి, ఆమె కోసం ఆరాటపడ్డది ఆమె భర్త చనిపోయాకనే. కానీ ముఖ చిత్రంలోని పున్నమ్మకు బొట్టు తాళిబొట్టు వున్నాయి.

కె. బ్రహ్మనందరావు వ్రాసిన "కోటికుటుంబాల ఘోష"కు తృతీయ బహుమతి లభించింది. ఈ కధాస్థలం కూడా తెలంగాణాలోని వో పల్లెటూరే. ఇదీ ధనిక, బీద, అధికార, బానిస వర్గాల వారి చరిత్రే పల్లెలో కరణాలు, మునసబులు, వారి ఆశ్రయులు, వారి దర్జా, వీరి నికృష్ట జీవితాలు ఈ నవలలో చూపబడ్డాయి. ఎన్నికలలో మాలపల్లెవాళ్ళ తమనాదరించలేదని కరణం, మునసబు, వారి అనుయాయులూ ఆ మాలపల్లెను నేలమట్టం చేయిస్తారు. లెక్కకు మీరినంతమంది చనిపోతారు. ఇంతే కథ. ఈ కధ పాతదే అయినా రచయిత కధనం, వాడిన భాష చక్కగా వున్నాయి. పాత్రలను రూపొందించడంలో ఆయన చక్కని శ్రద్ధ చూపారు.

మూడోనవల మల్లిక్ వ్రాసిన "సంకెళ్లు తెగుతాయి" కు కన్సోలేషను బహుమతి వచ్చింది. ఈ నవలలో కార్మికవర్గమూ, పెట్టుబడిదారువర్గమూ, వీరి ఘర్షణా చిత్రీకరింపబడ్డాయి. ఈ కధాస్థలం కూడా తెలంగాణాయే. లేత్ మిషను వర్క్‌షాపులో పని చేస్తున్న సంతోష్ కార్మిక నాయకునిలా తోటి పనివారి కష్టసుఖాలను కనిపెట్టూ యజమానులతో పోట్లాడుతూంటాడు. ఆ వర్గానికీ ఈ వర్గానికి పోరాటం, సమ్మెలు, లాకవుట్లు, దొమ్మీలు, పోలీసుల పక్షపాతాలు యీ కధలో వున్నాయి. కధకు మూలకధంటూ లేదు. కార్మిక వర్గం పడే బాధలే మూలకథ. రచయిత మల్లిక్ పాత్రలను చక్కగా మలిచారు.

మొత్తానికి బహుమతి పొందిన నవలల్లో ఈ మూడు నవలలూ ధనిక, పేద వర్గానికి జరుగుతున్న పోరాటాలే, ప్రధాన వృత్తాలు పోటీ నిర్వహించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు ఏరి కోరి ఈ యితివృత్తాల నెన్నుకున్నట్టు కనుపించడమేగాక ప్రకాశకుల ఆశయం కూడా కనుపిస్తోంది ఏది ఏమైనా రచయితలను ప్రోత్సహించే, ఉత్సాహపరచే ప్రకాశకులు మిక్కిలి అభినందనీయులు.

# "దెయ్యాల మేడ"

[కంచి రమాదేవి. శ్రీముఖపబ్లికేషన్స్: హైదరాబాదు. రూ. 3 00.]

1977లో సాహిత్య అకాడెమి బహుమతి పొందిన యీ 79 పేజీల సాహసగాధ 'దెయ్యాలమేడ'లో చంద్రం, రాము అనేయిద్దరు స్కూలు కుర్రాళ్లు సముద్రపొడ్డునున్న దెయ్యాల మేడవైపు

షికారుకు వెళ్ళి, ధైర్యంచేసి ఆ మేడలోకి వెళ్ళి(మర్నాడు)అక్కడ నరసంచారం వుందని అనుమానించి ఈ విషయం ప్రఖ్యాత డిటెక్టివ్ భూషణ్‌కు తెలియజేస్తే ఆయన ఈ కుర్రాళ్ళ సహాయంతో ఆ 'దెయ్యాల మేడ' నాధారం చేసుకుని దొంగ వ్యాపారం చేసే స్మగ్లర్ల గ్యాంగును పట్టివేస్తాడు కుర్రాళ్ళిద్దరికి రాష్ట్రపతి జాతీయ బహుమతులందుతాయి.

ఈ కథ పిల్లలకథ. రచయిత్రి ఈ వుద్దేశ్యం మనస్సులో పెట్టుకురాసుంటే మరింత బాగుండేది. కథలో డిటెక్టివ్‌పాత్రను ప్రవేశపెట్టడంతో ఈ కథకు డిటెక్టివ్ సాహిత్యపువాసనవచ్చేసింది. అలాగాక ఆ యిద్దరు కుర్రాళ్ళే పరిశోధనలు చేసినట్లు చిత్రించి వుండి వుంటే కథకు చక్కని బిగివచ్చివుండేది కథలోకూడా చక్కని సన్నివేశాలను, అద్భుతాలను ప్రవేశపెట్టి వుండివుండవచ్చు.

ఫా లా క్షు డు

## శివానందలహరి

[సంస్కృతమూలము : శ్రీ శంకర భగవత్పాదులు ఆంధ్రానువాదము : శ్రీ గుట్టిము వేంకటసుబ్రహ్మణ్యము. ప్రకాశకులు : అనువాదకులు; వేదంవారి అగ్రహారము, నెల్లూరు. మూల్యము రు. 3/-]

'శ్రీశైలశిఖరం దృష్ట్వా(దృష్ట్వః)పునర్జన్మ నవిద్యతే'— శ్రీశైల శిఖరమును చూచిన జీవికి పునర్జన్మ ఉండదు—అని పురాతనోక్తి.

శ్రియా, మోక్షశ్రియా. యుక్తః శైలః=మోక్షలక్ష్మితో కూడిన కొండ అనిన్నీ, శ్రియం, మోక్షశ్రియం, దదాతి = మోక్ష లక్ష్మిని ఇచ్చునది శ్రీదః, శ్రీదః శైలః = శ్రీశైలః — మధ్యమ పదలోపి సమాసం—ఇలాగు చెప్తారు శ్రీశైలానికి. అక్కడ వేంచేసియున్న శివుడు మల్లికార్జునస్వామి శివుని ఇంకొక అవతారం—అంటే అర్చావతారం. ఆ దేవదేవునితో ఉన్న దేవి భ్రమరాంబా నామ్ని. ఆ విధంగా శ్రీ భ్రమరాంబా సమేత మల్లికార్జునస్వామి అయినాడు.

ఆదిశంకరులు కాశ్మీరమువరకు అద్వైతమత స్థాపనకు పర్యటిస్తూ శ్రీశైలమునకు వచ్చి అక్కడ కొంతకాలము తపస్సు చేస్తూ ఉండగా ఒక దుష్టపరివ్రాజకుని అఘోరభైరవ మంత్ర పాశానికికట్టుబడి తత్పాశ విముక్తికై శివుని గూర్చి పలికినదే శివానంద లహరియై ఆదిశంకరులను పాశవిముక్తులను చేసిందని విజ్ఞులు చెప్పడం కద్దు. ఆ స్తోత్రం శివునకు ఆనంద లహరి అయింది. కాగా మొత్తం గ్రంధం శివానందలహరిగా ప్రసిద్ధమయిందని అనడం విరుద్ధ కథనం కానేరదనే నా అభిప్రాయం. ఈ కృతిలో ఏభై, ఏభైఒకటి సంఖ్యగల శ్లోకాలు ప్రత్యేకించి శ్రీశైలదేవుని గూర్చి చెప్పినవి.

ఒక శ్లోకం విజయవాటి కనకదుర్గాధిపతిని చెప్పుతూంది ఒకచోట.

63వ శ్లోకం శ్రీకాళహస్తీశ్వరస్వామిని జ్ఞప్తికి తెస్తూంది కన్నప్ప దినచర్యతో. వీటినిబట్టి ఆదిశంకరులు ఆయా క్షేత్రాలను కూడా దర్శించి అచ్చట అవతరించిఉన్న మహాదేవుణ్ణి స్తుతించినట్లు గ్రహించవచ్చు. కాగా ఆంధ్రదేశములో వాసికెక్కిన శైవ క్షేత్రాలను ఆ మహనీయుడు దర్శించినట్లు శివానందలహరివల్ల తెలుసుకోవచ్చు.

కవితో యజ్ఞయాగాలు చెయ్యడం మాటకేమి జన్మానికల్లా శివరాత్రి అన్నట్లు ఏ కార్తిక సోమవారంనాటి ఉపవాస నియమమైనా పాటించని అలసులూ, అశక్తులూ ఉంటారు వారికి భవతరణోపాయం ఏమిటి అంటే స్థిరమైన భక్తి ఒక్కటి చాలునన్నారు పెద్దలు. ఆ భక్తికి సోపానాలు దైవస్తుత్యాత్మకములైన స్తోత్ర కావ్యాలు. అలాటి వాటిలో; శివానందలహరి; మకుటం వంటిది అనే మాట ఆస్తికులు సర్వాత్మనా అంగీకరిస్తారు.

ఎక్కడెక్కడో పువ్వులకోసం తిరిగి శ్రమపడడ మెందుకు? మనస్సు అనే తమ్మి పువ్వు నిలో ఉంది. దానిని ఆ దేవునకు సమర్పించు అంటాడు భగవత్పాదుడు.

'గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజము మానాధ! భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో! 9

కొలకులునుం గభీరములు ఘోరవనంబులు నిర్జనంబులున్
బొలయు విశాలశైలములు బుద్ధివిహీనుడు పూలు తేఁగ
కలగిన చిత్తపంకజ మొకండు సమర్పణచేసి నీ కడన్
నిలువబడన్ సుఖస్థిరత నేరడిదేమి నరుండు మా పతీ'—

''గుహలలో, అడవులలో, కొండలలో, కోనలలో, నీళ్ళలో, నిప్పులలో, కఠోర నియమాలలో మ్రగ్గి మాడి మునిగి తేల ముక్కు మూసుకుంటూ ఏకాంతవాసమనీ, తపస్సనీ, యోగమనీ ... ఎందుకీ బాధలూ, వేధలున్నూ. శివుని పాదపద్మములందు స్థిరభక్తి యోగముతో మనస్సును సమర్పించుకున్నవాడే యోగి. అదే మోక్షప్రాప్తికి యోగమంటాడు భగవత్పాదుడు. ఎంత చక్కని తరణ బోధ!

'గుహాయాం గేహేవా బహిరపి వనే వాద్రి శిఖరే
జలేవా వహ్నౌవా వసతు వసతేః కిం వద ఫలం
సదా యస్యైవాంతఃకరణ మపి శంభో! తవ పదం
స్థితం చేద్యోగోఽసౌ సచ పరమయోగీ సచ సుఖీ 12

'గుహయొ గృహంబొ ఆర్బయలో గూఢ వన స్థితియో నగాగ్రమో
బహుళ జలంబు లగ్ను లయు వాస మొవర్తిల నేమి యబ్బెడిన్
అహరహమో మహేశ! భావ దంఘ్రుల నెవ్వని స్వాంత మొప్పనో
మహి నదియోగ మాతడె సుమా పటుయోగి సుఖాతి శాయియున్'

శ్లోకాలకు తెలుగు పద్యాలు కూడా యిచ్చాను. అనువాదం ఎంత సమవాదముగానూ, ఎంత సామవాదముగానూ ఉందో కవితా మనోధర్మం గలవారు గ్రహించగలరు. అయినా వేంకట సుబ్రహ్మణ్యముగారు ఎప్పుడో లబ్ధ ప్రతిష్ఠులైన కవులలో లబ్దస్థానులు. ఇప్పటి ఈ అనువాదం నిజంగానే ఒక్కొక్కచోట మూలార్థానికి ముద్దయిన సుద్దులు చెప్పేదిగా ఉంది. ఇది మెరమెచ్చులకై చెప్పేది కాదు. అలా చెప్పితే నాకేమి లాభం. ఉన్నది ఉన్నట్లు

చెప్పే స్వభావం నాది. పద్య పూరణ ఫలకములైన అక్షరాలకు వేంకట సుబ్రహ్మణ్యముగారు కలలో కూడా వెదకనక్కర లేదని ఈ అనువాదం ప్రబలమైన సాక్ష్యం ఇస్తుంది. ధన్యులు శ్రీవేంకట సుబ్రహ్మణ్యముగారు.

ఇంతకు మునుపు బలిజేపల్లి వారిఅనువాదం ఒకటి చూశాను. ఇంకెవరెవరో దీనిని తెలుగు చేశారు. నేనూ నలభై సంవత్సరాల క్రితం తెనిగించాను. నా అనువాదం ఆనాడు ఎందరో చూసి ఆనందించారు. ఎక్కువ ప్రతులు వేయించలేకపోయాను కనుక

కాల ప్రభావానికి లొంగిపోయి మనో నేత్రాన్ని సరిగా తెరువలేని అమాయకులు ఈ అనువాదం పారాయణ గ్రంధముగా ఉపయోగించి సుస్థిరానందం పొందవచ్చు. భగవత్పాదుల శ్లోకాలు కూడా కలిపి వేసిన కృతి కనుక ఉభయతారకం ఇది. ప్రస్తుతానికి ఇంతే! కాని ఒక్క మాట. అనువాదమే అయినా కవిగారి పద్యపు ధాటి ఆయన ఇంటిపేరును సార్ధకపరుస్తుంది ఇను మిక్కిలిగా ఒక్కొక్కచోట...

*శ్రీ యామిజాల పద్మనాభస్వామి*

# "బ్రౌన్ స్వీయ సారస్వత కథనం"*

బ్రౌన్ స్వీయ సారస్వత కథనం పరిశోధకులకు పాతది. ఈ కాలం వారికి కనువిప్పు. పరిశోధకులలో మన ముందు తరం వారికి తప్ప ఈ తరం వారిలో చాలామందికి బ్రౌన్ గురించి విన్నమాటలే తప్ప అతను రచించిన, సంస్కరించిన గ్రంథాలు కన్నవారు లేరు. కారణం బంగోరె చెప్పినట్లు బ్రౌన్ గ్రంథాలలో 90 పాళ్లు మద్రాసులో అచ్చయినా కనీసం 50 శాతం గ్రంథాలయినా ఏ గ్రంథాలయంలోను లభించవు (పు. 14).

దేశ వ్యాప్తంగా పరిశోధన జరుగుతున్న ఈ రోజులలో బ్రౌన్ పరిశోధనా విభాగాన్ని ఏర్పరచి బ్రౌన్ గ్రంధాలను లభించినంత మట్టుకు పునర్ముద్రణ కావించి ప్రకటిస్తున్న శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంవారిని, ముఖ్యంగా తెలుగు శాఖాధ్యక్షులు ప్రొ. జి. ఎన్. రెడ్డి గారిని 'బ్రౌన్ జ్వరం పట్టి' తేరుకొంటున్న బంగోరెను మెచ్చుకోవాలి.

---

బ్రాకెట్లలోని పుటల సంఖ్య సమీక్షిస్తున్న గ్రంథంలోవి.

---

బ్రౌన్ విభాగంవారు విశ్వ విద్యాలయం పక్షాన ప్రకటించిన 4 గ్రంథాలలో ఈ గ్రంధం చివరిదైనా ప్రామాణికతకు ప్రధానమైంది. విశ్వవిద్యాలయ గౌరవ స్థాయిలో వెలసిన మొదటి గ్రంథం అని కూడా ఈ ప్రచురణను సంభావించవచ్చు — ప్రచురణ పద్ధతిలో, ధోరణిలో. కాని అయ్యబాబోయ్! పుస్తకం వెల ముప్ఫై రూపాయలే అనిపిస్తుంది.

168 పేజీల్లో బ్రౌన్ స్వీయసారస్వత కథనం 57 పేజీలు బ్రౌన్ పండితుని 'లోనారసి' కాల్డ్వెల్ చేసిన పరిచయ విమర్శ సుమారు 13 పేజీలు — ఈ గ్రంధానికి ఆయువుపట్లు. మిగతా అంతా ప్రధాన సంపాదకులు, ఉప సంపాదకులు శ్రమకోర్చి చేర్చిందే.

ఈ గ్రంథమే మొదట ప్రచురించిన తరవాత వరుసగా బ్రౌన్ రచనలు ముద్రిస్తూ చివరికి బ్రౌన్పై సమగ్ర పరిశోధనా సిద్ధాంత గ్రంథం లాంటి సంపుటం వెలువడితే "ఎంత బాగుండును; ఎంత బాగుండును" అనిపించింది.

ఇక గ్రంధ సమీక్ష "ఉపరించెడి పట్టున" చెప్పవలసిన అంశాలు :

## బ్రౌన్ దొరకు హిందూమతం అంటే కిట్టదు :

"He seems to have a sincere, through, and well grounded belief in christianity 1 as a system, and a very low opinion, I must say a contempt of Hindooism" (P. 93) అని కాల్డ్వెల్, బ్రౌన్గూర్చి స్వంతంగా తెలుసుకొని చెప్పినవిషయం. అంతేకాదు. కాల్డ్వెల్ మరో మెట్టెక్కి "His Knowledge, however, of "orthodox" Hindooism and of classic Sanskrit is confessedly inferior to that of many" (P. 91) అని బ్రౌన్కి ఉన్న సంస్కృత భాషాజ్ఞానం ఎంతో బట్టబయలు చేశాడు.

కాని బ్రౌన్ పరిశోధనా విభాగం ప్రధాన పర్యవేక్షకులు, డా॥ ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డిగారు మాత్రం బ్రౌన్ని Telugu Max - muller (P. S) గా కీర్తించారు.

## తెలుగు సారస్వతాన్ని బ్రౌన్ ఎందుకు ఉద్ధరించాలి :

తెలుగు సారస్వతం తాటాకుల్లో మూల్గుతూ, రక్షించే నాథుడు లేని కాలంలో విదేశీయుడైన బ్రౌన్ (పుట్టడం భారతదేశంలోనే) తెలుగు నేర్చుకొని, పండితులను తన సొంత డబ్బుతో పోషించి, తాటాకుల్లోని వాఙ్మయాన్ని కాగితాలపై వ్రాయించి, అనేక గ్రంథాలకు సంస్కరణ ప్రతులు తయారు చేయించి, వాటికి వ్యాఖ్యానాలు, పద సూచికలు ఏర్పరచి, కొన్ని గ్రంథాలను ముద్రింపజేసి ఆంధ్ర భాషోద్ధారకుడైనాడు.

కోల్ బ్రూక్, విల్కిన్స్, విల్ఫోర్డ్, విల్సన్ సంస్కృత భాషా వ్యాప్తికి నిర్మత్సరంలో పనిచేయడానికి కారణం వారికున్న మత సహనమే అని, వారు బ్రాహ్మణుల వలె ఈ భాషా వ్యాప్తికి తోడ్పడిన 'పశ్చిమ బ్రాహ్మణులు' (Westren Brahmins) అని కాల్డ్వెల్ నిర్మోహ మాటంగా చెబుతూ (పు. 93) బ్రౌన్ ఆ వరసలోని వాడు కాడని, అతనికి హిందూ మతం మీద ఏ మాత్రం గౌరవం లేదని అంటాడు. దీనిని బట్టి చూస్తే బ్రౌన్ తెలుగు భాషను ఉద్ధరించడానికి కారణం ఏమయి ఉంటుందని ఆలోచన తప్పక కలుగుతుంది.

బ్రౌన్ ఇదంతా కృతనిశ్చయంతోను, మొండి ఉత్సాహంతోను (by dint of determination and a dogged sort of enthusiasm)చేశాడని కాల్డ్వెల్ అంటాడు (పు. 87).

బ్రౌన్కి స్వతహాగా పురాతనంమీద గాఢాభిమానం ఉంది. పాత పుస్తకాలు చదవడం, వాటిమీద రిమార్కులు రాయడం, విసుగు విరామం లేకుండా సమాచారాన్ని సేకరికండడం, పనికిమాలిన విజ్ఞానంపై అతనికి ఉండే ఓ రకమైన ఇష్టం — మొదలయినవి తెలుగు సాహిత్య పునరుజ్జీవనానికి కారణాలు అయి ఉంటాయి. దీనికితోడు అతనికి బ్రహ్మాండమైన జ్ఞాపకశక్తి ఉంది. (90)

బ్రౌన్ పిడివాదం చేస్తూ ఏది అడిగినా 'Oh! no' అంటూ చెప్పటం మొదలు పెట్టినాడని (92) తెలివి తేటలు గొప్పవయినా, అతని జడ్జిమెంటు మీద మాత్రం ఎప్పుడూ నమ్మకం పెట్టుకో కూడదని కాల్డ్వెల్ అనుభవం (86).

ఇంకా బ్రౌన్ గురించి కాల్డ్వెల్ ఏవేవో వ్రాశాడు. బ్రౌన్ గురించి ఇంత విమర్శనాత్మకమైన పరిశోధనచేసి తెలుగువారికి మేలుచేసిన కాల్డ్వెల్ మనకు అభినందనీయుడు. అంతకంటె అభి నందనీయులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం బ్రౌన్ పరిశోధనా విభాగంవారు. వారీ కాల్డ్వెల్ కథనాన్ని బ్రౌన్ స్వీయ సారస్వత జీవితంతో కలిపి అచ్చు వెయ్యకపోతే బ్రౌన్ సమగ్ర స్వరూపం మనకు తెలిసి ఉండేదికాదు.

## బ్రౌన్ సారస్వత కథనం - పరిష్కరణ

బ్రౌన్ మిత్రుల ప్రోత్సాహంతో ఈస్వీయ సారస్వత కథనాన్ని వ్రాసి 1866 మొదటిసారి, పరిష్కరించి 1872లో రెండోసారి లండన్లో ప్రచురించాడు. 1895లో బ్రౌన్ ఇంగ్లీషు — తెలుగు నిఘంటువు పరిష్కృత ముద్రణంగా మద్రాసులో అచ్చయినప్పుడు బ్రౌన్ 1872 స్వీయకథనాన్ని అందులో చేర్చడం జరిగింది. దానికి ఆంధ్రానువాదం 63 మే 'భారతి'లో శంభూప్రసాద్గారి కోరికపై అచ్చయింది. అనువాదం ఈ సమీక్షా కర్తదే.

ఇది ఇలా ఉండగా లండన్నుండి డా. జి. కృష్ణమూర్తి బ్రౌన్ స్వహస్తాలతో వ్రాసుకొన్న ప్రతి ఒకటి మిన్నెసోటా (యు. ఎస్. ఎ.) విశ్వవిద్యాలయంలో ఉందని బంగోరెకు తెల్పగా దాన్ని కూడా సంపాదకులు సంపాదించి మొత్తం 3 ప్రతులను తైపార చేసి ఈ గ్రంథాన్ని ముద్రించారు.

తమిళనాడు ఆర్కైవ్స్లోని బ్రౌన్ స్వహస్త లిఖిత లేఖలకు (2-2-1830, 2-11-1834, 12-4-1855 నాటివి) ఛాయా ప్రతులు (Photostat copies) ఇందులో జతపరచారు. బ్రౌన్ మరణ వార్తపై పత్రికా ప్రకటనలు, ప్రధాన గ్రంథానికి వివరణలు, బ్రౌన్ సమకాలికుల సంక్షిప్త జీవిత చరిత్రలు సంపాద కుని పరిశోధనా పాటవానికి నిదర్శనాలుగా ఉన్నాయి. వీటితోబాటు లభించినంత వరకు ఫోటోలు కూడా ప్రచురిస్తే పుస్తకం రాణించేది.

## కలకత్తాలో బ్రౌన్ పుట్టిన ఇల్లు

''డేవిడ్ బ్రౌన్ కలకత్తాకు 15 మైళ్ళ దూరంలో ఒక ఇల్లు కొనుక్కొని దానికి 'ఆల్డీన్' అని పేరు పెట్టాడు. అది హుగ్లీ నదీతీరంలో ఉంది. ''ఆల్డీన్'' ఇంటిముందు ఒక పాడుబడ్డ దేవళం—అందులో విగ్రహం ఉన్నాయి'' అని కేయి గ్రంథంలో ఉన్న దానిని డా. కె. వి. రావు, సి. పి. బ్రౌన్ గ్రంథంలో (పుట 37) పేర్కొనగా బ్రౌన్ పుట్టిన పవిత్రస్థలంయొక్క ఫోటో తెప్పించా లని ఎంతో ప్రయత్నం చేయడం జరిగింది. కాని అది ''వృథా ప్రయాస'' అయింది. ఆ పరిసర ప్రదేశాలు చూచి వచ్చిన వ్యక్తి ఈ విధంగా వ్రాశారు :

"The story that floats around about this is, that this was the place called Aldeen and that a major portion of it was submerged in the river Hooghly. The locals also call this place as Radhavallab Mandir"

## కడపలో బ్రౌన్ ఇల్లు

ఇక కడపలోని బ్రౌన్నివసించే స్వంతగృహాన్ని శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు పంపారు. అది ఇది.



కడపలో బ్రౌన్ నివసించిన భవనం

## లండన్లో బ్రౌన్ చివరి రోజుల్లో నివసించిన గృహం



సి. పి. బ్రౌన్ 22 కిల్డారీ గార్డెన్స్ డబ్లు2లో ఉండే వాడు. ఈ చిరునామాలో ఇప్పుడున్న కట్టడం ఫోటో. లండన్

వాస్తవ్యులు శ్రీ రవీంద్రనాథ్ రెడ్డిగారు ఎంతో శ్రమకోర్చి వెదకి ఫోటో తీసి పంపారు. ఆంధ్రపత్రిక ప్రచురించింది.

## బ్రౌన్ తండ్రి డేవిడ్ బ్రౌన్



డేవిడ్ బ్రౌన్ (1763-1812)

## బిషప్ కాల్డ్‌వెల్

బ్రౌన్ వ్యక్తిగత జీవితాన్ని పరిశీలించి "My restless pandit Mr. Brown" అనే రేఖా చిత్రాన్ని రచించిన సుప్రసిద్ధ ద్రావిడభాషా సిద్ధాంత ప్రవర్తకుడు—బిషప్ కాల్డ్‌వెల్.



బిషప్ కాల్డ్‌వెలు (1814-91)

## బ్రౌన్ బైబిల్ అనువాదం

లండన్‌లోని బ్రిటిష్ అండ్ ఫారెన్ బైబిలు సొసైటీలో బ్రౌన్ బైబిలు తెలుగు అనువాదం వ్రాత ప్రతులు 8 సంపుటాల్లో చక్కని లిపిలో ఉన్నాయని, అదే విధంగా డేవిడ్ బ్రౌన్ పుస్తకాలు, కొన్ని తెలుగు లేఖలు, డేవిడ్ బ్రౌన్‌బొమ్మ అక్కడ కనబడ్డాయని శ్రీ రవీంద్రనాథ్‌గారు వ్రాశారు. బైబిల్ అనువాద సంపుటాల ముద్రణను గూర్చి బైబిల్ సొసైటీ కార్యదర్శికి వ్రాసిన లేఖలో బైబిల్ తెనుగులోకి అనువదించిన వారి అనువాద వైఖరి, తాననుసరించిన విధానం గూర్చి బ్రౌన్ ఒక దరఖాస్తు పెట్టుకొన్నాడు. (పుట 76.)

## బ్రౌన్ వ్రాయించిన పార్సీ వ్యాఖ్యానం

"బాగ్-ఇ-ఇరానీ" అనే కావ్యానికి బ్రౌన్ బందరులో ఉన్నప్పుడు వ్యాఖ్యానం వ్రాయించాడు. వ్యాఖ్యాత పేరు మౌలవీ మహమ్మద్ అలిబిన్. బందరు వాస్తవ్యుడు. దీని ప్రతి ఇండియా ఆఫీసు గ్రంథాలయంలో ఉంది. (పెర్షియన్ మ్యాన్యుస్క్రిప్ట్స్, సం. 2, 1937. గ్రంథసంఖ్య నెం. 3034)

## హైదర్ చరిత్ర

బ్రౌన్ హైదరు చరిత్రను మరాటీ నుండి అనువదించడమే కాకుండా Peixotos వ్రాసిన "History of Hyder Alikhan Bahadur" అనే గ్రంథాన్ని ఎడిట్ చేసినట్లు వ్రాసుకొన్నారు. ఈ గ్రంథకర్త మొదట కుంఫిణీ పదాతి దళంలో కెప్టెన్‌గా ఉంటూ 1758లో హైదరాలీ జీవితం వ్రాశారు. స్వర్గీయ నేలటూరి వేంకట రమణయ్యగారికి బ్రౌన్ అనువాదం సంగతి తెలియదని వ్రాయటానికి ఆయన ignorent అని దుడుకుగా వ్రాయనవసరంలేదు. చరిత్రకారులలో చెరగని కీర్తి తెచ్చుకొన్నవారిలో కీ. శే. వెంకట రమణయ్యగారొకరు. (పుటలు 55, 155). అదే విధంగా బెంజిమిన్ షూల్జ్‌ను 'Brown had failed to mention'అనే దాని కంటె తరవాత చెప్పినట్టు 1885 వరకు ఇతనిగురించి బ్రౌన్‌కు తెలిసి ఉండదేమో అంటే బాగుండేది (పుట 78)

# Haileybury College (1805 - 1857)

ఈ కళాశాలలో సంస్కృతం నిర్బంధ పరసీయాంశంగా ఉండేది. చార్లస్ విల్కిన్స్ ఇక్కడి విద్యార్థుల కోసం సంస్కృత వ్యాకరణం వ్రాశారు. కోల్‌బ్రూక్ వ్యాకరణం వచ్చిన తరవాత దీనికంత ప్రఖ్యాతి రాలేదు. ఇక్కడే ఫ్రాన్సిస్ జాన్సన్ అనే గొప్ప ప్రొఫెసరు ఉండేవారు. అతనికి తెలుగుతోబాటు ఎన్నో భాషలు తెలుసు. మోనియర్ విలియమ్స్ ఇతనివద్దనే సంస్కృతం, అరబిక్, పెర్షియన్, బెంగాలీ, తెలుగు నేర్చుకొన్నాడు. తర్వాత సంస్కృతం, ఇంగ్లీషు, నిఘంటువు వ్రాశారు. కాని ఈ ప్రొఫెసర్ ఏ యూనివర్సిటీలోను చదువుకోలేదు. ఏ భాషా లిపి తెలియదు.

## సంస్కృత విద్యార్థులకు బంగారు పతకాలు

ఈ కళాశాలలో సంస్కృతంలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు బంగారు పతకాలు ఇస్తూ ఉండేవారు పతకం అంచుచుట్టూ "ఆత్మబుద్ధి ప్రసాదజమ్ తత్ సుఖమ్ సాత్విత్త్వకం ప్రోక్తం" అని భగవద్గీత (18–37)లోని శ్లోకం వ్రాసి ఉండేది. పతకం మధ్యభాగంలో 'శ్రీవిద్య వరాహ' అని చెక్కబడి ఉండేది. **(Eminent Orientalists G. A. Natesan & Co Madras).** నటేశన్ గ్రంథంలో ప్రాచ్యవిజ్ఞాన పరిశోధనకు మొదట దోహద మిచ్చినాడు వారన్ హేస్టింగ్స్ అని ఉంది. (పుట 108)

వింయం బ్రౌన్ నిఘంటువును 1953 లో (కల్చరల్ బుక్స్ లిమిటెడ్, మద్రాసు 2) తిరిగి అచ్చేశారు.

ఈ గ్రంథానికి ఇచ్చిన వివరణలు చాలవు. ఇంకా ఎన్నో చేర్చాలి. ఎంతైనా చేర్చొచ్చు. బ్రౌన్ వ్రాసి పెట్టుకొన్న నోట్సు నుండి వాక్యాలు ఉద్ధరిస్తూ పోతే ఇంతకి రెండు రెట్లు పెరుగుతుంది. బ్రౌన్ వాఙ్మయం సమస్తం సేకరిస్తేగాని అది సాధ్యం కాదు. బ్రౌన్ విభాగం నుండి 'బంగోరె' లండన్ కదిలి అక్కడే ఒకపట్టు బడితే సాధ్యం కానిది లేదు. ఈ పనికి ప్రభుత్వమూ, విశ్వవిద్యాలయం ప్రోత్సాహం ఇవ్వాలి.

## బ్రౌన్ సమగ్ర వ్యక్తిత్వం

ఏ ఘనకార్యాలు కష్టపడితేకాని కావు. బ్రౌన్ తండ్రి డేవిడ్ బ్రౌన్ కలకత్తాలో ఉన్న 25 సంవత్సరాలలోను ఏ ఒక్కనాడు సెలవు పెట్టలేదట. అంటే తన పనిలో అంత పట్టుదల గలవాడన్నమాట. ఆ తండ్రి గుణమే కొడుక్కీ అబ్బింది. అప్పుడప్పుడు అనారోగ్యానికి పాలుపడ్డా బొందిలో ప్రాణం ఉన్నంత వరకు తెలుగు భాషాభివృద్ధికి పాటుపడ్డాడు. తనకున్న దానిలో ఇతరుల కిచ్చిన దయార్ద్రహృదయుడు బ్రౌన్.

Let them only begin with honest endeavours and full determination and god will open the way for their progress and final success.

ఇదే బ్రౌన్ మనకిచ్చిన సందేశం. ఈ సందేశాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం బ్రౌన్ ప్రాజెక్టువారు ముఖ్యంగా పాటించి వారి ఉద్దేశాలను విజయవంతంగా నెరవేర్చుకొంటారని ఆశిద్దాం.

---

[* లిటరరీ ఆటో బయాగ్రఫీ ఆఫ్ సి పి బ్రౌన్. ప్రధాన సంపాదకులు ప్రొఫెసర్ జి.ఎన్. రెడ్డి, సంపాదకులు బంగోరె. ప్రచురణ. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం. తిరుపతి. 1978. వెల. రూ. 30.]

1 క్రైస్తవ మత గ్రంథ సమీక్షకుడివి. కాల్డ్ వెల్లే చెప్పనక్కర లేదు. బ్రౌనే **I was considered a deliberate enemy of the Hindu Idolatry (P. 59)** అన్నాడు

బ్రౌన్ క్రైస్తవ మతాభిమానానికి చిన్నతార్కాణ. విశాఖమండలంలోని వద్దిపర్తి కోనమరాజు అనే కవి ఉండేవాడు. అతడు రామభక్తుడు. అతని భక్తి పరీక్ష చెయ్యడానికి రాజమహేంద్రవరంలో ఒకనాడు బ్రౌన్ మొదలయిన కుంఫిణీ దొరలు కొలువు దీర్చి, కోనమ రాజును రప్పించి "మీ కందుబాటులో నున్న అండమాను ద్వీపము నుండి మీ సమీప రేవు స్థలమగు రేవు పోలవరము చేరెదరా" యని ప్రశ్నించిరట. అందుల కాయన నొడంబడెనట ... ... ...

"వారిలో ఛార్లెస్ బ్రౌన్‌గారు నన్వేషించి స్వచ్ఛమైన తెలుగు భాషలో 'కవీంద్రా నీవెంతకైనను సమర్థుడవని మాకు తోచుచున్నది' అని నన్ను మన్నించు తరి దొర లందరు వారిలో వారు స్వభాషచే సంభాషించి నవ్వుకొను తిరిగి బ్రౌన్ దొరగారు నాతో "కవీంద్రా మీకు రాముడిష్ట దైవమా? మా కెవ్వరని యందువా! జీసస్ క్రైస్తు. భేద మెంతయో యోచించితివా?" యన నే నిట్లంటిని :

గీ. క్రైస్తువన నెవ్వఁ డతఁడె శ్రీ కృష్ణుఁడె గద
రామునకు కృష్ణునకు భేదమేమి లేదు !
జీవరాశికి నొక్కడె దైవ తముఁగ
పలుకు భేదంబె నాంగ్లేయ ప్రభువరేణ్య.

ఓహో మంచి సమాధాన మిచ్చితివే నిను మెచ్చవచ్చుననిరి.

[డా. అక్కిరాజు రమాపతిరావు సౌజన్యంతో]

— వెంకటరావు

---

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**